సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 31 జూన్, 1975 సంచిక 6

జూలై నెల

## భావపరిచయ పోటీ

బహుమానం రూ. 10-00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.


డిపాజిట్లు మాత్రమే।


మళ్ళీ లేటుగా వచ్చారు గదూ!
చంద్ర



# కొండంత మబ్బు

## ఇల్లిందల సరస్వతీదేవి

కాంచన సూట్ కేసు పట్టుకుని తలుపులు నెట్టుకుంటూ లోపలికి వచ్చింది. ఎదురుగా తండ్రి కుర్చీలో కూర్చుని పత్రిక చదువుతున్నాడు. తలుపు చప్పుడు వినగానే ఆయన తలెత్తి "అమ్మా కాంచనా! జి.టి.లో వచ్చావా?" కనుబొమలు పైకెత్తి ఆశ్చర్యార్థకంగా ప్రశ్నించాడు.

ఒకనిమిషం తండ్రి కుర్చీదగ్గర ఆగి, అవునంటూ జవాబిచ్చినట్టుగా తల ఊపి, విసురుగా గదిలోకివెళ్ళి చెప్పులువిడిచి, ఎత్తిపడేసినట్టుగా సూట్ కేసు గోడవారగా పెట్టి, వంటయింట్లోకి వెళ్ళి. గడపలో నిలబడ్డది కాంచన.

విశాలాక్షమ్మ కాఫీ గ్లాసుల్లో పోసి పిల్లలను ఒక్కొక్కళ్ళనే పేరు పేరునా పిలిచి పిలిచి అలసిపోయింది. స్టౌదగ్గరే చిన్నపీట వేసుక్కూర్చుని "ఎంతసేపు పిలిచినా రారు. ఎంతకూ కదలరు" అంటూ తను కాఫీ తాగటం మొదలు పెట్టింది.

తను వచ్చినసంగతి తల్లి ఇంకా తెలుసుకోలేదనుకుంటూ "అమ్మా" అని ఆమె పక్కనే చతికలపడ్డది కాంచన.

కాంచనను చూసీచూడగానే కామాక్షమ్మ తెల్లబోయి నోరుతెరిచింది. అంతలో తెప్పరిల్లి "ఇప్పుడే బండీ దిగావా?" ప్రశ్నించింది.

"అవునమ్మా'' ముఖావంగా సమాధానమిచ్చింది కాంచన. తల్లి ఇచ్చిన కాఫీ తాగి తిన్నగా స్నానాల గదిలోకివెళ్ళి స్నానంచేసి మంచమ్మీదికి చేరుకుంది.

రిటైరయిన విశ్వనాథం పదకొండుగంటలకే భోజనం చేస్తాడు. కాఫీ, టిఫిన్, భోజనం, నిద్ర మొదలైనవన్నీ నియమిత కాలాల్లోనే చేస్తాడు, ఒక నిమిషం ఇటూ అటూ కాకుండా. ఆయన భోజనంచేస్తూ "కాంచన ఇంకా లేవలేదూ?'' అన్నాడు విశాలాక్షమ్మ ముఖంలోకి చూస్తూ.

లేదని ఆమె తలాడించింది. కాని–ఆయనింకా తన ముఖంలోకి చూస్తూ ఉండటం గ్రహించి ''లేస్తుందిగా! లేస్తే అన్ని విషయాలూ వాటంతట అవే బయటపడతాయి" అన్నది వినీ వినబడకుండా. అంతకంటె వాళ్ళిద్దరూ పైకి ఎక్కువ మాట్లాడుకోలేదు. మనసు పాపిష్టిది. ఎప్పుడూ ఏదో కీడు శంకిస్తూనే ఉంటుంది. అందుకే విశాలాక్షమ్మ అటువంటి సందర్భాలలో తను తక్కువగా మాట్లాడటమే కాకుండా విశ్వనాథాన్ని కూడా ఎక్కువగా మాట్లాడనివ్వదు.

పిల్లలు అన్నాలు తింటూ అక్క వచ్చింది అక్కవచ్చిందని సంబరపడ్డారు.

విశాలాక్షమ్మ వాళ్ళ అమాయకపు సంతోషాన్నిచూసి నిర్లిప్తంగా నవ్వు కున్నది.

విశ్వనాథం లోపలికి వస్తూనే ''వడ్డించు వడ్డించు'' అంటూ కాళ్లు కడుక్కుని పీటమీద కూర్చున్నాడు. అతడేదో అమెను అడగాలని నోరు తెరవబోతూ ఉండగా కాంచన చెదిరిన తలవెంట్రుకలు చేత్తో సర్దుకుంటూ వచ్చి పీటమీద కూర్చుంది. తలవంచుకుని పళ్లెంలో చెయ్యిపెట్టి అన్నం కలిపినట్టే కలిపి పక్కకునెట్టి లేచింది.

విశ్వనాథం, విశాలాక్షమ్మ అదంతా చూసి ఒకరి ముఖంలోకి ఒకరు చూసు కున్నారు. ఆ రాత్రి ఆశ్చర్యార్థకాలతో సందేహదృక్కులతో ముగ్గురూ గడి పారు.

ఉదయం కాంచన లేచి స్నానంచేసి ఇస్త్రీ చీర కట్టుకుని బైటికి వెళుతూ తండ్రి కుర్చీదగ్గర ఒక నిమిషంసేపాగింది. తండ్రితో ఏదో చెప్పాలని ఆమె పెదవులు కదిలాయి.

''బైటికి వెళ్లుతున్నావా అమ్మా?'' పత్రికలోంచి ముఖాన్ని పైకెత్తుతూ అడిగాడు విశ్వనాథం.

"అవును నాన్నా. టెలిఫోను ఆఫీసుకు వెళ్ళి ఒక అప్లికేషన్ పడేయాలనుకుంటున్నాను. అట్లాగే మందుల కంపెనీలోకూడా ఒకటి పడేయాలని బయలుదేరుతున్నా" అన్నది చేతినంచి ఊపుతూ.

విశ్వనాథం నిర్ఘాంతపోయాడు. కాని పైకి వ్యక్తంచేయటం ఇష్టంలేక "పడేసి త్వరగా వచ్చెయ్యి. భోజనంచేద్దాం'' అన్నాడు మామూలు స్వరం తెచ్చుకోటానికి ప్రయత్నిస్తూ.

పన్నెండు గంటలు దాటాయి. ఆనాడు విశ్వనాథం కూతురు వచ్చేవరకూ భోజనం చెయ్యదలుచుకోలేదు. విశాలాక్షమ్మ రెండుసార్లువచ్చి అడిగింది భోజనానికి లేవమంటూ. ఆయన లేవలేదు.

ఒంటిగంటా-రెండుగంటలూ దాటాయి

విశ్వనాథం భార్యను లేపకుండా రెండుసార్లు బిందెలోనుంచి ముంచుకుని మంచినీళ్లు తాగాడు. రిటైరయిన తరువాత గ్రంథపఠనం ప్రారంభించాడు. నాలుగురోజులనాడు మొదలుపెట్టిన పుస్తకం ముగించి వాకిటివరకూవెళ్ళి చూసి వెనక్కు-తిరిగి మళ్ళీ పడక్కుర్చీలో మేను వాల్చాడు. కళ్ళు వాటంతట అవే మూతలుపడ్డాయి.

మూడుగంటలు దాటుతూ ఉండగా వాడిపోయిన మొహంతో కాంచన వచ్చింది. ఏదో చికాకు-అశాంతి ఆమె ముఖంలో ప్రస్ఫుటంగా కనబడ్డది.

"అమ్మా, భోజనానికిరా. నాన్నకూడా అలాగే కూర్చున్నారు. చాలా పొద్దుపోయింది" విశాలాక్షమ్మ లేచి పీటలువేసి పళ్ళేలు పెట్టింది.

మాట్లాడకుండా ముగ్గురూ భోజనానికి కూర్చున్నారు.

"అయితే ఏమయిందమ్మా?'' అడిగాడు విశ్వనాథం ముద్ద నోట్లో పెట్టుకుంటూ.

"నేను వెళ్ళినచోట ఖాళీ లేదన్నారు. అక్కడినుంచి మూడు నాలుగు ఆఫీసులకు వెళ్ళాను. ఎక్కడికెళ్ళినా ఒకటే మాట-ఖాళీ ల్లేవన్నమాటే" తలవంచుకుని మంచినీళ్ళ గ్లాసు నోటిదగ్గర పెట్టుకుంటూ అన్నది.

"అయితే రమణకు ఇక్కడికి బదిలీ అవుతుందనుకుంటున్నారా ఏమిటి?" అన్నాడు విశ్వనాథం.

"దానికీ దీనికీ సంబంధం లేదు నాన్నా." విసురుగా లేచి వెళ్ళిపోయింది కాంచన.

కాంచన స్వభావం విశాలాక్షమ్మకు బాగా తెలుసు విశ్వనాథానికి కూతురంటే ఎక్కడలేని అభిమానం. రంగూ-పోలికా-మూర్తి అంతా కాంచన విశ్వనాథం తల్లి బంగారమ్మ పోలిక. ఆ స్వభావంకూడా ఆమెదే. అంతలోకి తననెవరో అవమానించారని కుంచించుకుపోతుంది. అందరికంటె తన తక్కువేమిటని పదేపదే బాధపడుతుంది. అయినా విశ్వనాథానికి కాంచనంటే తల్లిమీదకంటే కూడా అధికంగా అభిమానమూ ప్రేమానూ. అతడికెంత కోపం వచ్చినా ఆమె ముఖం చూడగానే చల్లబడిపోతుంది.

కాని-కాంచన వచ్చినప్పటినుండీ అతడి మనసులో తారట్లాడుతున్న ప్రశ్నకు సమాధానం దొరకటంలేదు. ఎట్లా రాబట్టాలో అతడికి అర్థంకావటంలేదు.

భోజనం ఆలస్యంగా చేసినా కాఫీ తొందరగా తీసుకుని, వాకిటి వరండాలో కుర్చీలు వేసుకుని కూర్చున్నారంతా.

"అమ్మాయీ, అల్లుడికేమయినా ప్రమోషన్ దొరికిందిటమ్మా?" పడక్కుర్చీలో పడుకుని కాళ్ళూపుతూ ప్రశ్నించాడు.

"నాకు తెలియదు నాన్నా!" తప్పించుకోటానికి తల పక్కకు తిప్పుకున్నది కాంచన.

విశాలాక్షమ్మకు ఈ పైపై మాటలు నచ్చవు. గట్టిగా ప్రశ్నించి సరైన జవాబు రాబట్టుకోవటం ఆమె పద్ధతి. నసుగులాటంటే ఆమెకు ఒళ్ళుమంట.

"నీకు తెలియకుండా ఎట్లా ఉంటుందే? నిరుడే ప్రమోషన్ రావలసిందని అతడంటేను?" విశాలాక్షమ్మ కంఠంలో కరుకుదనం ధ్వనించింది.

"అటువంటి సంగతులు నాకు తెలియవమ్మా. నా అంతట నేను అడగను. ఒకరిని అడిగి తెలుసుకోవాలన్న ఆసక్తి అంతకంటే లేదు." ముఖం ముడిచింది కాంచన.

"ఏమిటా సమాధానం? ఒకరంటే? ఎవరే ఆ ఒకరు? అతడి ప్రమోషను సంగతి నీకక్కర్లేదా?" సూటిగా ప్రశ్నించింది విశాలాక్షమ్మ.

"చెబితే వింటాను. చెప్పకపోతే వెంటబడాల్సిన అవసరమేముంది?"

ఈ జవాబుతో విశాలాక్షమ్మకూ, విశ్వనాథానికీ ఎవరి మనుస్సుల్లో వాళ్ళకు



అంతకుముందు లీలగా మెదులుతున్న అనుమానం స్పష్టమవుతూ వచ్చింది. అయినా కాంచనను ఇంకేమీ ప్రశ్నించకుండా చూస్తూ ఊరుకున్నారు.

కాంచన వచ్చిన పదిహేనురోజులపాటు అదేపనిగా ఆఫీసులకు తిరగడమూ అప్లికేషన్లు పడెయ్యటమూ ఇంటికి రాగానే ఎవరితో మాట్లాడకుండా మంచంమీద వాలిపోవటమూ-ఇదీ ఆమె కార్యక్రమము.

నెలరోజుల తరువాత రెండుచోట్లకు ఇంటర్వ్యూలకు కూడా వెళ్ళివచ్చింది. బి.ఎ.లో క్లాసు తెచ్చుకున్న కాంచన టైపురైటింగ్ షార్టుహాండు కోర్సుల్లో ప్రావీణ్యత సంపాదించింది. ఎక్కడయినా ఒకచోట ఉద్యోగం రాకపోతుందా అని ఎదురు తెన్నులు చూస్తున్నది.

రోజులు గడుస్తున్నకొద్దీ కాంచన సంగతి అంతుపట్టలేదన్న బాధ విశాలాక్షమ్మను లోలోపల పీడించటం మొదలుపెట్టింది. ఆ మాట పైకి అంటే విశ్వనాథం బాధపడతాడని లోపల్లోపల అణచుకుంటోంది. ముగ్గురాడపిల్లలూ ఇద్దరు మగపిల్లలుగల ఆ సంసారంలో విశ్వనాథం రిటైరయిన తరువాత చేసిన మొదటి శుభకార్యం కాంచన పెళ్ళి పాతిక సంవత్సరాల సర్వీసుచేసి ఆయన మిగల్చకలిగింది ఖర్చుచేసి కాంచనకు పెళ్ళిచేశాడు. విశ్వనాథానిది ఒకదే

పద్ధతి. ఎప్పటి సంగతి అప్పుడు ఆలోచించాలిగాని-ముందే తలబద్దలు చేసుకో వటమెందుకు అని. ఆ పద్ధతిలోనే మిగతా ఆడపిల్ల లిద్దరిమాట అటుంచి ఉన్న దంతా ఊడ్చి కాంచనను ఒక యింటిదాన్ని చేశాడు.

పాతికేళ్ళ ఉద్యోగ ఫలితాన్ని పెట్టి ఒక్క పిల్లకు పెళ్ళిచేస్తే మిగతా ఇద్దరాడ పిల్లలమాట? వాళ్ళకేంపెట్టి పెళ్ళిచెయ్యాలి? మగపిల్లల చదువులెట్లా సాగుతాయి? ఈ ప్రశ్నలతో తలపగిలిపోతూ ఉంటుంది విశాలాక్షమ్మకు. ఈ పరిస్థితుల్లో అత్తవారింటికి కాపరానికి వెళ్ళిన కాంచన హఠాత్తుగా చెప్పాపెట్టాకుండా వచ్చింది. వచ్చినపిల్ల సంగతీ సందర్భమూ చెప్పకుండా చిర్రుబుర్రులాడుతూ ఆఫీసులవెంట తిరుగుతోందని ఆమెకు బాధగా ఉంది. కాలమహిమ! ఆమె ముక్కుమీద వేలేసుకుంది.

## 2

"రమణా ఈవేళప్పుడు ఇక్కడున్నావేం?'' భద్రం ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"ఏం ఉండకూడదా? ఏ వేళప్పుడు ఎక్కడుండాలోకూడా నీకు తెలియాలా ఏం? చెప్పు?" కొద్దిగా కనుబొమలు ముడిచాడు రమణ.

"అది కాదురా నాయనా. ముక్కుమీద కోపం ఉంటే ఎట్లా చెప్పు? ఈ వేళప్పుడు నీవూ మా చెల్లెలు సరదాగా కబుర్లు చెప్పుకొంటూ పార్కులో ఉంటారు కదా?" సౌమ్యంగా సర్దటానికి ప్రయత్నించాడు.

''నీకెట్లా తెలుసు?"

గొల్లున నవ్వాడు భద్రం. "నేను ఎన్నోసార్లు నీతో పనుండి మీ యింటికి వచ్చాను ఈ వేళప్పుడు. ఎన్నిమార్లు చూసినా ఇంటికి తాళం వెక్కిరిస్తూ జవాబిచ్చేది. ఒకటి రెండుసార్లు మిమ్మల్నిద్దరినీ గలగల మాటల మధ్యన పార్కులో—అంటే లయన్సు క్లబ్బువారి పార్కులో చూశాను. ఈ నిదర్శనాలు చాలా? ఇంకా ఉదహరించాలా?" రమణ భుజంమీద చెయ్యేశాడు.

ఆట్లాగా అన్నట్టు చూశాడు రమణ.

"మా చెల్లెలు ఊళ్లో లేదనుకుంటాను. నాకు మేనల్లుడిని ఎత్తుకు వస్తుందా? అయినా రమణా, ఆమె వెళ్ళేటప్పుడు నాకు చెబితే నేనూ స్టేషనుకు వచ్చేవాడినిగా! అమ్మాయికి ఒక కప్పు కాఫీ, రెండరటిపళ్ళు ఇప్పించేవాడినిగా," నిష్ఠూరంగా అన్నాడు.

''అబ్బే, అట్లాంటిదేమీ లేదు." ముక్తసరిగా జవాబిచ్చి ముఖం పక్కకు తిప్పుకున్నాడు.

"అయితే ఊరికెనే వెళ్ళిందా? వాళ్ళ నాన్నమీద బెంగగా ఉందేమో పాపం. ఆడపిల్లలంతేరా రమణా. ఇక్కడెంత ప్రాణమిచ్చే వాళ్ళున్నా తల్లిమీదో తండ్రి మీదో బెంగ-ఒకదే బాధపడిపోతారు'' మెల్లిగా ఇద్దరూ వై. యం. సి. ఏ. నుంచి రమణ యింటికి వచ్చారు.

రమణ భద్రంతో ఆఫీసు సంగతులు మాట్లాడటం మొదలుపెట్టాడు. భద్రం ఊఁ ఆఁ అంటూ ఇల్లు నాలుగుమూలలా కళ్ళతో పరీక్షచేయటం మొదలు పెట్టాడు.

అనాసక్తంగా వింటున్న భద్రాన్ని చూసి గతుక్కుమన్నాడు రమణ. భద్రం కళ్ళతో ఎక్స్‌రే తీసేస్తాడు అన్ని విషయాలను. ఎంత జాగ్రత్తగా ఉన్నా ఎలాగో పసికట్టేస్తాడు.

"భద్రం నీవు నన్ను సాయంత్రపు వేళల్లో పార్కుల్లోచూసి ఎన్నాళ్లయిందిరా? నిజం చెప్పు? నా కళ్లల్లోకి చూసి చెప్పు." అర్థించాడు.

నీళ్ళు నమిలాడు భద్రం.

"అట్లా దారికి రా. నా మాటలకూ చేతలకూ ఎక్కువ తేడా ఉండదు. నేను ఎం. ఏ. ఎకనామిక్సు చదివి పరీక్ష వ్రాశాను. ఒక నెలలో రిజల్ట్సు రావచ్చు."

"అరే? నీవు ఎం. ఏ. పరీక్ష-చదివి వ్రాశావా? నాకు ఆశ్చర్యంగా ఉందే?" భద్రానికి అంతుపట్టలేదు.

"అవును. చదివే వ్రాశాను. చదవకుండా పరీక్షలెట్లా వ్రాస్తారు?''

''కోప్పడకురా నాయనా! చదివి అంటే ఎప్పుడు చదివావని నా ప్రశ్న. ప్రశ్న కాదనుకో-అడుగుతున్నాను."

పగలబడి నవ్వాడు రమణ. ఎప్పుడు చదివాననా నీ ప్రశ్న ? నైట్ కాలేజీలో చదివాను. ఆఫీసునుంచే కాలేజీకి వెళ్తాను. సరేనా? నీక్కావలసినదంతా చెప్పానా? ఇంకా ఉన్నదా?"

"అది కాదురా నాయనా. కాస్త శాంతించు. నేనేమో మామూలు మనిషిని. ఆఫీసుపని మిగల్చకుండా ఏరోజుకారోజు చేసి, కాలేజీలో చదివి, పరీక్ష వ్రాశావంటే సామాన్యమా మరి? నావంటివాళ్లు ఊహించలేనిది. డిపార్టుమెంటల్ పరీక్షలు కూడా అలాగే అనుకోకుండా వ్రాసి పాసయ్యావు. నిన్ను సామాన్యుడనైన నేను

అంచనా వెయ్యలేకపోయాను ఇంతకాలం." గట్టిగా తృప్తితీరా వీపుమీద చరిచాడు.

"సరేగాని భోజనం వేళయింది. ఎక్కడ భోజనం చేస్తున్నావు?" అడిగాడు భద్రం.

"నేనా? అదిగో-ఆ మూల స్టౌ చూడు. వంట చేసేస్తాను రెండు పూటలకు. చిన్నప్పుడు మా అమ్మ పచ్చళ్ళు చేస్తుంటే చూశాను. అవికూడా చేసుకుంటాను. నన్ను గురించిన సమాచారం అంతా సేకరించినట్లేనా నీవు?" నవ్వాడు రమణ.

"రమణా, నీ అంత ఎత్తు నేను ఎదగలేదురా బ్రదర్. నీవులోతైన మనిషివి. ఎటువంటి సమయంలోనూ బయటపడవు. నిన్ను స్టడీచేయటానికి నా జీవితం చాలదు. నేను చేసిన తప్పుకు క్షమాపణ కోరుకుంటున్నాను" టపటప చెంపలు వేసుకున్నాడు.

"భద్రం, నాలో గాంభీర్యం ఎక్కువోయ్. అది ఒక్కొక్కప్పుడు అనర్థాలకు కూడా దారితీస్తుంది. అయితే నేనేం చెయ్యను? నా స్వభావమది.'' భద్రం రెండు చేతులూ తనచేతుల్లోకి తీసుకుని ''ఇవాళ నాతో భోజనం చేస్తావా? నా వంట రుచిచూడు,'' అన్నాడు. కాని వెంటనే ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలా చటుక్కున చేతులు వదిలేసి "భద్రం. మీవాళ్ళంతా-అంటే నీ భార్య ఎదురు చూస్తూ ఉంటుంది. ఇక్కడ ఉన్నావని తెలిస్తే నన్ను తిట్టుకుంటుంది. పోనీలే. వెళ్లు వెళ్లు'' అన్నాడు

అసలు భద్రం వచ్చినపని వేరు. మాటల్లోపడిఅప్పటినుంచీ మరిచిపోయాడు. ఇంటిమాట వినగానే చటుక్కున జ్ఞాపకం వచ్చింది. అది పాతికరూపాయల చేబదులు. ఆ డబ్బుతీసుకొని వెళ్ళిపోయాడు.

రమణ తలుపులు వేసుకుని కాళ్ళూ చేతులూ కడుక్కునివచ్చి భోజనం చేశాడు అతడి కిష్టమయిన చింతకాయపచ్చడి-వంకాయకూర-సరిగ్గా తల్లి చేసినట్లే చేసుకున్నాడు. అక్కడ శుభ్రంచేసి పడగ్గదిలోకివచ్చి, బల్లముందర కూర్చున్నాడు. ఆ క్రిందటిరోజు తెచ్చిపెట్టుకున్న ఐ.ఏ.యస్. పరీక్షకు కావలసిన పుస్తకాలు ఒకసారి చూసుకున్నాడు "రేపటినుంచే చదువు ప్రారంభించాలి" అనుకుంటూ మంచమ్మీద పడుకుని ఆ రోజు పత్రిక చేతిలోకి తీసుకున్నాడు. అప్రయత్నంగా కళ్ళు గోడవారగా ఉన్న పెట్టెమీద పడ్డాయి. చూపు అట్లాగే కొంతసేపు నిలిచిందక్కడ.

అతడి దృష్టి నిలిచినది శూన్యప్రదేశం. అక్కడ వారంరోజుల క్రిందటి




వరకూ ఒక నల్లటి ట్రంకుపెట్టె ఉండేది. అది ఇప్పుడు ఆ ప్రదేశాన్నే కాకుండా ఆ యింటినే కాకుండా అతడి హృదయాన్నికూడా శూన్యం చేసింది. దాని తాలూకు జ్ఞాపకాలు మాత్రం హృదయం చుట్టూ చెరువులో నాచులా చుట్టుకు పోతున్నాయి.

కాంచన ఎందుకు వెళ్ళిపోయిందో అతడికేమీ అర్థంకావటంలేదు. తను ఆమెకు ద్రోహం చెయ్యలేదు. అవమానపరచలేదు. ఆమెను పల్లెత్తుమాటయినా అనలేదు. ఉన్నట్టుండి హఠాత్తుగా పెట్టె సర్దుకుని వెళ్ళిపోయింది. వెళ్ళేటప్పుడు తిరిగి ఎప్పుడు వచ్చేదీ చెప్పలేదు. తన సామాన్లు అన్నీ తీసుకు వెళ్ళిపోయింది. ఐల్లమీది ఫోటో దగ్గర్నించి. వెళ్లిన తరువాత ఉత్తరం వ్రాస్తుందనుకున్నాడు. అదీ లేదు. ఏమిటి ఆమె అంతర్యం?

ఆమె అలా వచ్చిందని తండ్రికూడా వ్రాయలేదు. అయినా వాళ్లకేం తెలుసు చెప్పాపెట్టాకుండా హఠాత్తుగా పిల్ల అలా వచ్చేస్తే అడిగి కారణం తెలుసుకో వలసిన బాధ్యత తల్లి దండ్రులది కాదా? ఏ కారణం చెప్పిందో కాంచన! ఆడ వాళ్ళు ఏ మాట చెప్పినా చక్కగా అతికినట్టుగా చెప్పగలరు-అందరినీ నమ్మిం చనూ గలరు. జాతిమహిమ.

అతడు చేతిలోఉన్న పేపరు కిందపడేసి షెల్ఫులో ఉన్న పుస్తకమొకటి తీసుకుని పేజీలు తిప్పటం మొదలుపెట్టాడు. కాని మనసు ఎటో ఆలోచిస్తు న్నది.

ఆరేళనాటి మాట. హైదరాబాదు రేడియోనుంచి తను లలితసంగీతం పాడుతూ ఉండేవాడు. నాటికలలో అప్పుడప్పుడు నటిస్తూ ఉండేవాడు. ఆ

డబ్బుతో తను బట్టలు కుట్టించుకుని కాలేజీకి వెళుతూ ఉండేవాడు. సరిగ్గా ఆ రోజుల్లో విజయవాడ రేడియో స్టేషన్‌నుండి స్వర్ణఅనే అమ్మాయి పాడిన లలిత సంగీతం ప్రసారమవుతూ ఉండేది. ఆ అమ్మాయి కంఠము వినటానికి ఎంతో హాయిగాఉండేది. ఆ పాట వింటుంటే ప్రాణము ఎక్కడో ఏ లోకంలోనోవిహరిం చేది. ఆపాట విన్ననాడు అతడికి ఎంతో ఉత్సాహము కలిగేది. చెప్పలేనంత సంతోషం కలిగేది. అట్లా ఉత్సాహానందాలలో మునిగి తేలుతున్నరోజున విజయ వాద రేడియో స్టేషనుకు ఆమె పేరున ఒక ఉత్తరం అభినందిస్తూ రాసేశాడు. ఇష్టమయితే_అపార్థం చేసుకోకపోతే ఒక చిన్న ఉత్తరం ముక్క వ్రాసిపడేస్తే సంతోషిస్తానని అర్థించాడు కూడా చివరన. ఆ ఉత్తరాలలో తన కలంపేరు పాణిగా పేర్కొన్నాడు.

స్వర్ణ కంఠం కిన్నెర కంఠం. అట్లా అని అందరూ పొగుడుతుంటే ఆమె మరింత సాధనచేసి మరీ మరీ మధురంగా పాడటానికి ప్రయత్నించేది. తండ్రి దగ్గర ఎంతో చనువు. ఆయన దగ్గర గారాలుపోయి రేడియోస్టేషనుకు వెళ్ళ టానికి పర్మిషను సంపాదించేది. ఆయన తన కూతురు గొప్ప గాయని అవు తుందని సంబరపడుతూ అనుమతించేవాడు. కాని తల్లికి ఇటువంటి వ్యామో హాలు లేవు. ఒకనాడు సాయంత్రం ఏమెన్సు కాలేజీనుంచి ఇంటికి రాగానే చెడా మడా తిట్టింది.

"ఏమిటమ్మా? నేనేం తప్పుచేశానని అట్లా తిడుతున్నావు?" పుస్తకాలు కింద పడేసి గోడకానుకుని చేతివేళ్ళు విరుచుకుంటూ నిలబడ్డది.

"ఏం చేశానని ఇంకా అడుగుతున్నావా? నాకడుపున చెడపుట్టావుకదే?" ముఖం ఎర్రపడేటట్టు అరిచింది.

"చెప్పరాదూ అట్లా అరవకపోతే?" మెల్లగానే అడిగింది స్వర్ణ.

"నీవు పేరు మార్చుకుంటే నేను నీకంఠధ్వని అంత తెలుసుకోలేని వాజమ్మ ననుకున్నావా?" చెయ్యి పైకెత్తబోయి ఆగిపోయింది.

"అమ్మా నన్ను కొట్టాలని చెయ్యెత్తి ఆగిపోయావేం? నేను చేసిందేమిటో చెప్పి-తరువాత నీయిష్టం వచ్చినట్టు కొట్టూ తిట్టూ" అన్నది స్వర్ణ.

"ఆపడుచు పిల్లలతో కలిసి యుగళగీతాలు పాడతారా? ఎవరితో పడితే వాళ్ళతో కలిసి పాటలు పాడెయ్యటమేనా ఆటువంటి పాటలు? రేపు పెళ్ళెట్లా అవుతుందే పిచ్చిముఖమా? అయినా నాకు చెప్పకుండా ఎట్లా వెళ్లావు? ఎందుకు

వెళ్ళావు అక్కడికి?" అరిచి అరిచి అలిసిపోయి-చెమటపట్టిన ముఖాన్ని పైట కొంగుతో అద్దుకుంది తల్లి.

"నాన్న నడిగే వెళ్ళాను. ఆయన ఒప్పుకున్నారు" ధైర్యం పుంజుకుని జవాబు చెప్పింది కాంచన. .

"నాన్న నీవన్నట్టల్లా ఆడతారు. నీకసలు ఆయనిచ్చినదే ఈ అలుసు" పైటకొంగు విసురుకుంటూ అక్కడినుండి వెళ్ళిపోయింది.

స్వర్ణ, పాణి అనే యువకుడు హైదరాబాదు రేడియో స్టేషన్‌నుంచి వ్రాసిన ఉత్తరం పుస్తకాల మధ్యన పెట్టుకుని, దాచుకుని దాచుకుని చదువుకునేది. జవాబులు వ్రాస్తూఉండేది. చక్కటి ఇంగ్లీషు-టైపు అక్షరాలతో మురిపిస్తూ జవాబులిచ్చేది. అట్లా వ్రాస్తూ వ్రాస్తూ ఒక ఉత్తరంలో తల్లికీ తనకూ రేడియోలో పాటలుపాడే విషయంలో జరుగుతున్న ఘర్షణలను గురించి వివరించింది ఎంతో ఘనంగా.

వారానికొక లేఖ అటునుంచీ-అది చేరిన వెంటనే ఇటునుంచి ఒకలేఖ రైళ్ళు మారుతూ తిరుగుతూ ఉండేవి. స్నేహలత గబగబా పాకి పందిరెక్కింది. ఇప్పుడది ప్రేమలతగా మారింది. వాళ్ళిద్దరి మధ్య నడిచినవి వట్టి ఉత్తరాలు కావు-ప్రణయకావ్యాలని మురిసిపోయేవారు. మళ్ళీ మళ్ళీ చదువుకుని పదింతలయిన ఉద్వేగంతో లేఖలు ఖండకావ్యాలుగా అటునుంచి ఇటూ ఇటునుంచి అటూ పయనిస్తూ ఉండేవి. అతడు టైపు చేయడం నేర్చుకున్నాడు కనుక ఉత్తరాలు టైపు చేసేవాడు. ఆమె టైపు అక్షరాలతో ముత్యాల కూర్పులా అక్షరాలను పేర్చి పేర్చి వ్రాసేది.

ఆ ఉత్తరాలు చేతికి అందనంత పెద్దకట్ట అయింది.

రమణ స్టెనోగా చేరగానే తల్లి ప్రతిరోజూ పోరుతూ ఉండేది-పెళ్ళి చేసుకొమ్మని. వచ్చిన సంబంధాలను గురించి ప్రతిరోజూ రాత్రిళ్ళు భోజనాలవేళ వర్ణించిచెప్పేది. అతడు తలవంచుకుని భోజనంచేస్తూ ఊఁకొడుతూ ఉండేవాడు. తనకు సరియైన జవాబు చెప్పటం లేదనీ-తన మాటలను అతడు లక్ష్యపెట్టటం లేదనీ ఆమె బాధపడుతూ ఉండేది. అప్పుడప్పుడు అతడిమీద విరుచుకుపడేది.

"ఒరే రమణా! నీకోసం తిరిగి నాలుగు సంబంధాలు చూడటానికి పదిచోట్లకు తిరగటానికి నీకు తండ్రి లేరు. నాలుగేళ్ళ పిల్లవాడిని ఇంతవరకూ పెంచి బి.ఏ. వరకూ చదువు చెప్పించి-చిన్నదో పెద్దదో ఒక ఉద్యోగంలో నీవు స్థిరపడే

వరకూ నేను ప్రాణాలు బిగబట్టుకుని కాలక్షేపం చేశాను. డబ్బు ఇబ్బందులు ఎన్ని వచ్చినా ఎదుర్కొన్నాను. ఇంక నీవు తొందరగా ఈ సంబంధాలలో ఒక పిల్లను చేసుకో. నా బాధ్యత తీరిపోతుంది."

"నీకు నేను పెళ్ళిచేసుకోవటం ముఖ్యం కదా? ఏ పిల్లనయినా చేసుకో వచ్చునా?" రోజూ ఆమె పెళ్ళిసంబంధాల సంగతి అనగా ఒకనాడు జవాబిచ్చాడు రమణ. అతడి జవాబులో ఒక ప్రశ్న ఉండటంవల్ల ఆమె త్రుళ్ళిపడ్డది.

"పెళ్ళిచేసుకోవటమూ ముఖ్యమే. ఈ నాలుగు సంబంధాలలో ఒక పిల్లను ఏరుకోవటమూ ముఖ్యమే" ఖండితంగా చెప్పింది.

"అయితే నీవే నిశ్చయించావన్నమాట!" అన్నాడు తలఎత్తి.

"అవును. పిల్ల బాగుంటుందని మధ్యవర్తి చెప్పాడు. బి. ఏ కూడా చదివిందట. అదికాక-నాలుగువేల రూపాయల కట్నం కూడా ఇస్తారట. ఆ పిల్లను నీవొకసారి లాంచనప్రాయంగా చూస్తే నిశ్చయం చేస్తాను."

"అదీ అసలుసంగతి! ఇప్పుడు బయటపడిపోయావు. నీక్కావలసింది డబ్బన్నమాట!" అన్నాడు.

"అవునురా డబ్బే. నాలుగేళ్ళపిల్లవాడిని ఇంతవరకూ ఎట్లా తీసుకువచ్చానను కున్నావు? నా నగలు ఖర్చయితే ఖర్చయ్యాయి. నేనుఊరగాయలూ అప్పడాలూ వడియాలూ చేసి అమ్మితే అమ్మాను. కాని మీ నాన్న కట్టిన ఇంటిమీద నాలుగు వేలు అప్పుతెచ్చాను. ఇప్పుడా అప్పు తీర్చాలి, తప్పదు" అన్నది.

"ఏం? నేను నా జీతంలో తీర్చలేనా?"

"తీర్చలేవు. నీ జీతంలో సంసారం గడవవచ్చు. ఈ అప్పెవరు తీరుస్తారు?"

"అయితే ఇదొక్కటే ఉపాయమా?''

"అంతేరా. నీవు నా మాట వినకతప్పదు" కఠినంగా అని అవతలికి వెళ్ళి పోయింది.

''అయితే ఈ భాగ్యానికి నేను చూడటంకూడా ఎందుకు? అనవసరం. నిశ్చయం చేసెయ్యి. పెళ్ళిచేసెయ్యి. నీ పని అయిపోతుంది. తరువాత నా ఏడుపు నేను ఏడుస్తాను.'' ఆమె వెళ్ళినంత విసురుగా అతడూ లేచి చెయ్యి కడుక్కున్నాడు.

నాలుగురోజు లాగి తల్లి మళ్ళీ ఆ ప్రస్తావన తెచ్చింది.

"రమణా! రేపు వెళ్లి ఆ పిల్లను చూడాలి.'' ఆజ్ఞాపించింది.

తప్పనిసరిగా తలవంచుకుని వెళ్ళి పిల్లను చూశాడు. వాళ్ళు చేసిన మర్యాద




లను అయిష్టంతోనే స్వీకరించాడు. మధ్యవర్తి అన్నాడు "ఏమయ్యా రమణా! పిల్లను గురించి ఏదయినా అడుగుతావా? చిన్నపిల్లలు కారు. ఏమయినా మాట్లాడుకోండి."

తనకు తెలియకుండానే ఒక అందమయిన నవ్వు నవ్వాడు రమణ, ఏమీ అవసరం లేదంటూ.

మాట్లాడకపోయినా ఆ నవ్వు చూసింది కాంచన. అప్పుడే-ఆ నిమిషంలోనే అతడిపట్ల ఒకవిధమయిన ఆకర్షణ ఆమె హృదయంలో మొలకెత్తినట్టుగా కళ్ళు మెరిశాయి.

తల్లి ఎంతో ఆనందంతో ఉత్సాహంతో పెళ్ళికి ఏర్పాట్లుచేసింది. పెళ్ళిచేసిన తరువాత కోడలు ఇంట్లో పాదం పెట్టగానే కట్నండబ్బుతో ఇల్లు తాకట్టు విడిపించి అక్కడే తాను కాపరం పెట్టాలని ఆమె సంకల్పం.

ఉన్నది అద్దె ఇల్లయినా సున్నంకొట్టించి తోరణాలు కట్టించింది. అడ్వాన్సుగా తీసుకున్న కట్నండబ్బులో కొడుక్కు ఒక సూటు కుట్టించింది.

రాత్రి పదిగంటల బస్సులో ప్రయాణం. అతడి మనసు కలవరపడుతున్నట్టు తల్లి గ్రహించింది. కొడుకును దగ్గరకూర్చోబెట్టుకుని "రమణా, నీవు ఇష్టపడే చేసుకుంటున్నావు కదూ ఈ పిల్లను? తరువాత బాధపడవుకదూ?" అడిగింది.

ఆమెకూ తెలుసు కాళ్ళూ చేతులూ కట్టి పెళ్ళిచేస్తే అతడే సర్దుకుంటాడని. కాని మనసులో మళ్ళీ ఏదో ఆందోళన. తరువాత అతడు సర్దుకోలేక జీవితాన్ని నరకంచేసుకుంటే? మళ్ళీ ఆమె అన్నది "నాయనా! నీకిష్టం లేకపోతే ఇప్పుడే చెప్పు. తరువాత బాధపడ్డదానికంటే ఇప్పుడే చెబితే నయం" అని.

శూన్యంలోకి చూస్తున్నవాడల్లా చటుక్కున తన దృష్టిని తల్లివైపుకుతిప్పి "అమ్మా! ఇది జీవితం. సినిమాకాదని నీవే ఎన్నోసార్లు చెప్పావు. అంతే" అన్నాడు.

తల్లి తృప్తిగాలేచి లోపలికి వెళ్ళింది.

రమణ తన పుస్తకాలమధ్య పెద్ద కవరులో భద్రపరచిన ఉత్తరాలు పెరట్లో గోడవారగా కుప్పపోసి అగ్గిపుల్ల వెలిగించాడు.

బరువెక్కినట్టుగా ఉన్న హృదయం కాంచనకు సూత్రధారణ చేసేసమయంలో తేలికపడుతున్నట్లనిపించింది అతడికి.

అప్పటికప్పుడు మళ్ళీ స్వర్ణవైపు దృష్టి మళ్ళిందతడికి. స్వర్ణకు ఎప్పుడు పెళ్ళయిందో? తనలాగే సర్దుకునిజీవిస్తోందేమో? ఆడవాళ్లుతొందరగామరిచిపోతారు. అయినా తనుమటుకు ఏంచేశాడు? ఈ మధ్య స్వర్ణ అసలు జ్ఞాపకానికి వచ్చిందా? ఉత్తరాలు కాల్చిననాడే ఆమె స్మృతిపథంలోనుండి జారిపోయింది. పెళ్ళిచేసుకున్న తరువాత ఆమె స్మృతులను ఉంచుకోదలుచుకోకనే ఉత్తరాలు కాల్చేశాడు. ఇల్లు గృహిణిరాజ్యం. ఆమె తన సామ్రాజ్యంలో తన కిష్టంలేని వాటినీ తనకు నష్టం కలిగించేవాటినీ ఉండనివ్వదు. ఎప్పుడయినా ఆ ఉత్తరాలు తన భార్య కంటపడితే ఇంట్లో చిచ్చురేగుతుంది. తల్లికి తను మాట ఇచ్చినట్టుగా జీవితంలో రాజీపడాలనుకుని అట్లా చేశాడు.

కాని తన హృదయ కవాటాలు అప్పటినుంచీ ఓరవాకిలిగా ఉన్నాయేగాని బాహాటంగా తెరుచుకుని ఉన్నాయా?

ఎప్పుడో తెల్లవారుఝామున రెండుగంటలకు నిద్రపట్టింది రమణకు.

## 3

తిరిగి తిరిగి వచ్చిన రెండు నెలలకు కాంచన మందుల ఫ్యాక్టరీలో పేకింగ్ గర్ల్‌గా ఉద్యోగం సంపాదించింది. ఎక్కడలేని ఉత్సాహంతో గంతులు వేసుకుంటూ ఉద్యోగంలో చేరింది.

విశ్వనాథం విశాలాక్షమ్మ ఒకరినొకరు కళ్ళతోటే పలకరించుకుంటున్నారు. "ఆయనతోటి చాలా మాట్లాడాలి కాంచనను గురించి. ఈ గుండెబరువు తగ్గించుకోవాల"నుకుంటుంది విశాలాక్షమ్మ. కాని పిల్లల్లో ఎవరో ఒకరు ఆయనతో కూడా ఉంటారు. "ఏమిటే కాంచన సంగతి? తల్లితో ఏమయినా చెప్పిందా? ఏం సంగతో ఇవాళ విశాలిని అడిగి తెలుసుకోవాలి" అనుకుంటాడు విశ్వనాథం. కాని వాళ్ళిద్దరూ ఒంటరిగా కలుసుకోవటమే అపురూపంగా ఉంది. ఒకవేళ ఎప్పు

దయినా కలుసుకోవటం తటస్థించినప్పుడు హృదయాలు పలకరించుకోలేక మూగవోతున్నాయి.

కాంచన ఇంటికి రాగానే పిల్లలతో ఏవో కబుర్లుచెబుతూ తల్లికి పనిలో సహాయంచేస్తూ రాత్రి భోజనాలయిన తరువాత తండ్రితో ఏదో లోకాభిరామాయణం మాట్లాడుతూ ఉంటుంది. ఆయనను నవ్వించాలని ఎన్నో కబుర్లు చెబుతుంది. ఆయన పైకి నవ్వినట్టే కనబడతాడు కాని ఆ నవ్వు మనసారా నవ్వింది కాదని కాంచన కనిపెట్టేస్తుంది.

"నేను సుఖంగా ఉద్యోగంచేస్తూ హాయిగాఉంటే వీళ్లిట్లా బాధపడతారేం? ఇష్టంలేని కాపరాలు చేసి బ్రతుకు నరకం చేసుకున్నదానికంటే ఇది నయంకాదూ? ఈ సమాజం-ఈ మనుషులూ ఎప్పుడు మార్తారు? కొత్తనాగరికత ఉప్పెనలా వచ్చి మీదపడుతున్నా వీళ్ళు గ్రహించుకోరేం? పాత పట్టాలమీద కొత్త రైలు నడవటంలో సౌలభ్యం ఉంటుందా? దీని కొలతలూ దాని కొలతలూ సరిపోయినప్పుడే రైలు సాఫీగా నడవగలుగుతుంది. స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు లేని అంధకార యుగంలో కాళ్లూ చేతులూ ముడుచుకుని బ్రతికిన అమ్మ తనను చూస్తే రుసరుసలాడుతుంది. కొంతకాలం పడుతుంది అమ్మవంటివాళ్ళు సర్దుకోడానికి" అనుకుంటుంది కాంచన.

కాంచన మొదటి జీతము తీసుకున్ననాడు తోబుట్టువులందరికీ మిఠాయి తెచ్చింది. తలిదండ్రులకు బట్టలు తెచ్చింది.

తండ్రిచేతికి బట్టలు ఇచ్చి కాళ్ళకు నమస్కరించబోయింది. ఆయన ఆమెను వారిస్తూ ఒకవెర్రిచూపు చూశాడు. తల్లికితెచ్చిన చీరె చేతికివ్వగానే ఆమె బావురుమన్నది కాంచనను గుండెకు హత్తుకుంటూ.

చెమర్చిన కళ్ళద్దుకుంటూ "అమ్మా, ఈ చీరె కట్టుకోవూ? నేను పెద్దకొడుకు ననుకొని సంతోషించమ్మా" అన్నది.

"నిజంగా కొడుకువైతే సంతోషించనుటే? కాదుకనుకనే నాకీ దుఃఖం" మళ్ళీ కడుపులోంచి దుఃఖం పొంగింది.

"అమ్మా, నీవు మారాలి. పరిస్థితులు నన్ను కొడుకుగా భావించమన్నా నీవలా అనుకోవా? కాలం మారిందమ్మా" తల్లిచేత బలవంతగా చీరెకట్టించి పాదాలకు నమస్కరించింది.

కాంచన తన వైవాహిక జీవితం మరిచిపోవడానికి ప్రయత్నాలు చేస్తున్నది. పెళ్ళికాకముందు తను రేడియోలో లలితసంగీతం పాడుతూ ఉండేది. ఆ కాల

క్షేపంకూడా తిరిగి కలిగించుకోవాలనుకుంటూ ఒకనాడు రేడియో స్టేషనుకు వెళ్ళి అందరినీ కలుసుకుని తిరిగి కాంట్రాక్టు సంపాదించింది. మొట్టమొదటే కృష్ణ శాస్త్రిగారి గేయాలు పాడటానికి కాంట్రాక్టు ఇచ్చారు. అది మొదలు ఆమె నటించిన నాటికలూ అడపా దడపా లలితసంగీతం ప్రసారమవుతున్నాయి.

ఆనాడు ఉదయం లేవగానే ఒళ్ళు తూలుతున్నట్లనిపించింది కాంచనకు. కడుపులో వికారం మొదలయింది. కాఫీ తాగగానే వాంతిచేసుకుంది. కళ్లు తిరుగు తున్నట్లయి పడుకుంది. వంటఇంట్లో పనిచేసుకుంటున్న విశాలాక్షమ్మ ఏమిటేమి టని గాభరాపడుతూ గదిలోకి వచ్చింది.

"కాంచనా, వాంతిచేసుకున్నావా." దగ్గర కూర్చుని తలవెంట్రుకలు సవరిం చింది. ఆమెకు కాంచనను చూడగానే మనసులో ఏదో మెదిలింది. అసలు కాంచన వచ్చినప్పటినుంచీ ఆమెకేదో సందేహంగానే ఉంటూ వచ్చించి. ఇప్పుడది నిర్ధా రణ అయిపోయింది.

"కాంచెంసేపు కళ్ళుమూసుకుని పడుకో. ఇవాళ మందుల కంపెనీకి వెళ్ళే ఓపిక లేకపోతే వెళ్లకు" అంటూ లోపలికి వెళ్లింది. అక్కడే విశ్వనాథం కనబడ్డాడు. ఆమె ఇంక ఆపుకోలేకపోయింది.

"ఇప్పుడైనా కాంచన విషయం బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రండి. అది ఇక్కడికి వచ్చి రెండు నెలలు దాటింది. అది ఉత్తరాలు రాస్తోందోలేదోగాని అతడి దగ్గర్నించి ఒక్కటైనా ఇంతవరకూ రాలేదు. ఎన్నిసార్లుచెప్పినా మీరూ వ్రాయలేదు. ఇప్పుడు దానికి మూడోనెలో నాలుగోనెలో నడుస్తున్నట్లున్నది. ఈకబురైనా ఆయనకు వ్రాయాల్సిన బాధ్యత మీ మీద ఉన్నది. కొంప సాంతం మునగకముందే మేలుకోండి" మందలించినట్లుగా అన్నది.

"ఆఁ" అంటూ ఆశ్చర్యపడ్డాడు విశ్వనాథం ఆ పగలంతా ఆలోచించి అల్లు డిని ఒకసారి రమ్మనమని ఉత్తరం వ్రాశాడు.

విశ్వనాథం ప్రతిరోజూ వాకిలికెదురుగా కుర్చీవేసుక్కూర్చుని పేపరు చదువుతున్నట్టు నటిస్తూ పోస్టుమన్ కొరకు ఎదురుచూసేవాడు. తన ఆదుర్దా విశాలాక్షమ్మ కనిపెట్టకూడదని ఎంతో ప్రయత్నించేవాడు. అబ్బ! ఏమిటీ ఆడవాళ్ళు? మనసులను పుస్తకం చదివినట్టు చదివేస్తారు. ఇంటికి సంబంధించిన విషయాలలో వాళ్ళదే పైచెయ్యి. అతడికెప్పుడూ ఓటమే.

విశ్వనాథం పడుతున్న అవస్థ చూసి విశాలాక్షమ్మ నవ్వుకునేది.

కాంచన రోజుకు రెండుసార్లయినా వాంతిచేసుకునేది. మనిషి చిక్కిపో యింది. కళ్లూ పళ్లూ బైటికి వచ్చాయి.

విశ్వనాథం ఒక నిశ్చయానికి వచ్చాడు. ఏకాఏకీ హైదరాబాదు రైలు ఎక్క టమే. విశాలాక్షమ్మ నాటిన అనుమానబీజాలు మొలకలెత్తటం మొదలు పెట్టాయి. ఆఫీసుల్లో ఆడా మగా కలిసి పనిచేస్తున్నారు ఈ రోజుల్లో. పరిచ యాలు కలగటం-చనువులేర్పడటం అసహజమేంకాదు. తనూ అటువంటి చిక్కులో పడ్డాడొకసారి.

పంకజం అనే అమ్మాయి తన ఆఫీసులో పనిచేసేది. ఏమంత అందగత్తె కాదు కాని మంచి పరువంలో ఉంది. రెండు జడలు ఊపుకుంటూ కొంగు ఝాడించుకుంటూ తిరిగేది. విసురుగా నడిచేది. వెనకనుంచి ఎవరైనా నవ్వుతు న్నట్టు పసికట్టినప్పుడు అడుగులో అడుగులేసుకుంటూ నడిచేది. వెనక్కి తిరిగి ఓరచూపులు చూసేది. అల్లా చూసినప్పుడు తను నిగ్రహం సడలిపోయి ఆమె వలలో పడిపోయాడు. ఉమ్మడి ఖర్చులు భరించి జల్సాగా తిరిగేవాడు. తండ్రి పసికట్టి ఇంటికి లాక్కొచ్చి మూడుముళ్లూ వేయించాడు. తనుమళ్ళీ ఉద్యోగంలో ప్రవేశించేటప్పటికి పంకజానికి రెండో పెళ్ళి సంబంధం నిశ్చయమైనది. పెళ్ళి చేసుకుని ఆ ఊరినుంచి వెళ్ళిపోయింది. ఆ అనుభవం చిన్నప్పటి సరదా. పెళ్ళ యిన తరువాత తను కొన్నాళ్ళు బుద్ధిమంతుడుగానే ఉన్నాడు. కాని ఆఫీసులోకి సరోజ రావటంతో కొంత అపత్యం జరిగినమాట నిజమే. అయినా తను ఇంట్లో ఏమీ జరగనట్టే ఉండేవాడు. తనకు అటువంటి స్నేహాలు పిల్లలు పెద్దవాళ్ళయ్యే వరకూ కూడా ఉండేవి.

మరునాటి ఉదయం ఆరుగంటలకే లేచి గోలకొండ ఎక్స్‌ప్రెస్‌కుబయలుదేర టానికి నిశ్చయం చేసుకుని ఒంటరిగా పొయ్యిదగ్గర కూర్చున్న విశాలాక్షమ్మ పక్కనే పీటవేసుకుని కూర్చుని చెప్పాడు మెల్లగా.

కాంచన ఆరోజు చాలా బలహీనంగా ఉంది. కంపెనీలో ఒకసారి కళ్ళు తిరిగి పడిపోయింది. పక్కనున్నవాళ్ళు వేడివేడి కాఫీ తెచ్చిఇచ్చారు. బస్సు దిగి కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి వచ్చేసరికి తల్లీ దండ్రీ వంటయింట్లో కబుర్లుచెప్పుకుంటు న్నారు తననుగురించేనేమో ననుకుంటూ గడపదగ్గర నిలబడ్డది.

"మీరు తిన్నగా ఆఫీసుకే వెళ్ళండి. అక్కడ తప్పకుండా కలుస్తాడ అతడు కలవకపోయినా తోటి ఉద్యోగులైనా కలుస్తారు. అతడిని గురించి అన్ని సంగతులు తెలుసుకోవచ్చు" తల్లి సలహాలిస్తోంది.

"ఎట్లాగయినా సలహాలివ్వటానికి ఆడవాళ్ళదే పైచెయ్యిసుమా!" అంటు న్నాడు తండ్రి.

"ఏం లాభం? ఏదయినా చెప్పిచేయించాల్సిందేగాని స్వయంగా చెయ్యటానికి వీలులేదుగా?" అన్నది.

"పోనీ నువ్వెళ్ళావేమిటి?" అన్నాడు నవ్వుతూ.

"నేను వెళ్ళలేననేగా మీ ప్రతిపాదన?"

"చూడు విశాలీ! చేయటంలో నేర్పులేదు. చెప్పిచేయించటంలోనే ఉంది నేర్పంతా. అదీ గాక-కొన్ని పనులు చేస్తే అందం-కొన్ని చేయిస్తేనే అందం. ఏమంటావు?"

"అంతేలెండి."

కాంచన మాట్లాడకుండా మంచంమీదికి చేరుకుంది.

తండ్రి గదిలోకివచ్చి పడుకున్నదెవరా అని చూసి కాంచన కనబడగానే గతుక్కుమన్నాడు.

"కాంచనా! ఎంత సేపయిందమ్మా వచ్చి? లేచి కాఫీతాగి అమ్మ చేసిన మినప రొట్టె తిను."

విశ్వనాథం మాటలు వింటూనే విశాలాక్షమ్మ కాఫీగ్లాసుతో గదిలో అడుగు పెట్టింది.

"కాఫీ తాగాలని లేదమ్మా" అన్నది కాంచన కళ్ళు మూసుకుని.

తాగాలని ఉండదు కాని తాగాలి. కొన్నాళ్ళు నిన్ను గురించి నీవు ఆలోచించటం మానెయ్యి. నేను చెప్పినట్లు చేస్తూండు" విశాలాక్షమ్మ మంచమీంద కూర్చుని కాంచనను లేవదీసి కూర్చోబెట్టింది.

విశాలాక్షమ్మ చూడకుండా నవ్వుకుని బైటికి వెళ్ళాడు విశ్వనాథం.

ఆ రాత్రి తల్లి బలవంతాన కాంచన చారన్నంతిని మజ్జిగతాగి మళ్ళీ మంచం చేరుకున్నది. అంతా పదిగంటలు కాగానే నిద్రపోయారు. ఆమెకెంతకూ కన్ను మూతపడలేదు. ఒకటే కలవరం మనసులో.

తను వచ్చి మూడునెలలు దాటుతోంది. ఆ నాడు ఉత్తరంవ్రాసి బల్లమీద పెట్టి పక్కయింట్లో తాళాలు ఇచ్చి రైలు ఎక్కింది. ఎందుకు వెళ్ళిందోనన్న ఆలోచన రాలేదా ఆ పెద్దమనిషికి? తనకు ఒంట్లో బాగాలేకపోతే ఊరికి వెళ్ళటమెందుకని పించలేదా? ఎవరికైనా ఒంట్లో బాగాలేక వెళ్ళితే ఎట్లా ఉందనయినా వ్రాయద్దూ?



ఆయినా ఎవరిసంగతి వారికి తెలియకుండా ఉంటుందా ఎప్పటికయినా? నోరు వద్దన్నా అంతరాత్మ ఊరుకుంటుందా?

ఒకనాడా రెణ్ణాళ్లా? మూడు సంవత్సరాలపాటు ఓపికపట్టింది. ఒక సరదా లేదు—సంతోషంలేదు. ప్రొద్దున తొమ్మిదింటికి వెళ్ళితే రాత్రి పదిగంటలకా ఇల్లు చేరుకోవటం? ఈ లోపల తనే చావు చచ్చినా కనుక్కునేవాళ్ళు లేరు. ఒకనాడు అంతే జరిగింది. తనకు విపరీతమైన తలనొప్పి-మంచంమీదినుంచి లేవలేక పోయింది. ఒంటిగంటకు పడుకున్న మనిషి రాత్రి పదిగంటలకు అతడొచ్చే వరకూ అలాగే ఉంది. తలుపు కొట్టగానే రేగినతలతో ముఖం వేలాడేసుకుని తీసి మళ్ళీ వెళ్ళి పడుకుంది.

వంటయింట్లోకెళ్లి చూసివచ్చినట్లున్నాడు. ప్రొద్దుటి అంటుగిన్నెలూ భోజనం చేసిన పళ్లెమూ అవీ అలాగే ఉన్నాయి.

"ఏమిటి జ్వరమా?" మంచంమీద కూర్చుని అడిగాడు.

ఆ మధ్యాహ్నంనుంచీ అతడిని ఎన్నో అడగాలనీ దులపాలనీ అనుకున్నది కాని అతడిని చూడగానే దుఃఖం ముంచుకువచ్చింది. ఆ ఏడుపులో చెప్పేసింది తలనొప్పి వచ్చిందని.

అతడు నవ్వుకుంటూ బైటికివెళ్ళి రెండు తలనొప్పి మాత్రలు టిఫిన్ కారియర్‌తో భోజనమూ తెచ్చాడు.

ఆ రాత్రి అన్నది "నా తలనొప్పి ఇట్లాపోదు. మనిద్దరమూ కలిసి బైటికివెళ్ళి తలనొప్పిమాత్రలు కొనుక్కొని హోటల్లో భోజనంచేస్తే పోతుంది. లేకపోతే మాంచి తెలుగు సినిమా చూస్తే పోతుంది.

ఇద్దరూ నవ్వుకున్నారు. తను తలనొప్పిమాత్రలు వేసుకోలేదు. అసలు తలనొప్పికాదు అది. మరింకేదో.

కాని నోటితో చెప్పినా అతడు గ్రహించుకోడే! మరునాడు మళ్ళీ మొదలు. ఎప్పటి అదే.

పైగా ఒకనాడు అన్నాడు. "నీకు కాలక్షేపం లేనట్టుంది. నైట్ కాలేజీలో లా చదువుతావా? పోనీ టీచరు ఉద్యోగానికి దరఖాస్తు పెడతావా?"

తనకు ఒళ్ళు మండిపోయింది.

ఎవరో స్నేహితురాళ్ళతో రాత్రి పదిగంటలవరకూ తను తిరిగి తిరిగి ఇంటికి వస్తాడా, కాలక్షేపానికి తను ఉద్యోగం చెయ్యాలా? కాకపోతే చదువుకోవాలా? కాలం ఎట్లా ఉంది?

"నిలదీసి అడిగితే ఒకనవ్వు నవ్వుతాడు. తనింక మాట్లాడలేదు. తనకో బలహీనత. ఆ నవ్వుకే అన్నీ మరిచిపోతుంది. అతడు లేనప్పుడు ఒళ్ళు మండిపోతుంది. అతడి సమక్షంలో తన్మయత్వం. క్రమంగా అదికూడా తనకు వినుగొచ్చింది. అరికాలిమంట తలకెక్కిందొకనాడు. వెంటనే ఉత్తరంవ్రాసిపెట్టి బయలుదేరింది పుట్టింటికి గోలకొండ ఎక్స్‌ప్రెస్‌లో. ఉద్యోగం దొరికి హాయిగా ఉన్నదనుకుంటే ఈ మార్పేమిటి?"

"అమ్మ అంటోంది తను తల్లికాబోతున్నదని. నిజమా? ఒకవేళ నిజమే అయితే? తన రాకకు వేరు వేరు అర్థాలు కల్పించబడతాయా? అసలేనిర్లక్ష్యంగా ఉన్నవాడు ఎందుకు అనుమానించడు? తన మాట ఎవరు నమ్ముతారు?" ఆమె గుండె గుబగుబలాడింది.

అయినా న్యాయం తన పక్షంఉంటే ఎందుకు నమ్మడు? అంతగా నమ్మకపోతే పోనీ! తన బిడ్డను పెంచలేదా? ఆమాత్రం తను పోషించలేదా? తనూ ఉద్యోగం చేస్తున్నది.

అయినా యింకో సంగతి. అతడి తల్లి ఉందిగా ఆ పల్లెటూళ్ళో ఆ పుట్టిన వాళ్లను ఆమెకిస్తే సరి. ఆమెకు ఈపాటికి తనకొడుకు సంగతి తెలిసే ఉండాలి.

కాంచనకు తెల్లవారుఝామున నాలుగుగంటలకు నిద్రపట్టింది. మరునాడుఉద్యోగానికి వెళ్ళలేకపోయింది.

## 4

విశ్వనాథం గోలకొండ ఎక్స్‌ప్రెస్‌లో దిగి తిన్నగా ఆఫీసుకు వెళ్ళాడు. సెక్షను కనుక్కొని లోపలికివెళ్ళి విచారించాడు. అక్కడ భద్రం కలిసి రమణను గురించిన వివరాలన్నీ చెబుతూ "అతడు సెలవుపెట్టి ఢిల్లీ వెళ్ళాడండీ" అన్నాడు.

"ఎంతకాలం సెలవు పెట్టాడు?"

"ఒక ఏడాది పెట్టాడు."

నీరుకారిపోయాడు విశ్వనాథం. కాళ్ళీడ్చుకుంటూ బస్సెక్కి వియ్యపురాలి దగ్గరికి వెళ్ళాడు ఆమె విశ్వనాథాన్ని చూసి నివ్వెరపోయింది. కాళ్ళు కడుక్కోటానికి నీళ్ళిచ్చి వేడి వేడిగా అన్నం వండిపెట్టింది.

విశ్వనాథం గడుసుగా తను యాదగిరి నరసింహస్వామి దర్శనంకోసం వచ్చాననీ దారిలోనే ఉన్న వియ్యపురాలిని చూడాలని దిగాననీ అన్నాడు.

"మీరు నాయనమ్మ కాబోతున్నారు. ముఖ్యంగా ఈకబురు మీ చెవిన వెయ్యాలనే దిగాను."

"అలాగా! ఏదో నలతగా ఉంటే విజయవాడ పంపానని రమణ వ్రాశాడు. ఇప్పుడు ఎన్నో నెల?" అన్నది.

"నాలుగు కాబోలు. మీ వదినగారు కాంచనతో తంటాలు పడుతోంది. వేవిళ్ళు-ఏమీ తినదు నీరసం."

నవ్వుకున్నది వియ్యపురాలు.

"మీరు వచ్చి ఒకసారి చూడకూడదూ?"ఆశగా ఆమె ముఖంలోకి చూశాడు.

"వస్తాను లెండి. రమణ ఢిల్లీ వెళ్ళినట్టు వ్రాశాడు. వాడు రాగానే వస్తాను."

విశ్వనాథం ముఖంలో నిరాశ ద్యోతకమవుతుంది. రమణ ఏడాదివరకూ రాడని ఆమెకు తెలియదా? తెలిసినా తను చెప్పదలుచుకోలేదు. ఆమె అట్లా అనటానికి గల కారణం అతడే వద్దని వ్రాశాడేమో? విశ్వనాథం కొండంత ఆశతో ఇల్లు బయలుదేరి వచ్చాడు. గంపెడు నైరాశ్యాన్ని నెత్తిన వేసుకుని ఇంటికి వెళ్ళాడు.

"నాన్నా! మన వీధిచివర్న ఉన్న స్కూల్లో టీచరు ఉద్యోగం వచ్చింది. మందుల కంపెనీలో పని మానేశాను" అన్నది కాంచన.

"మరీ మంచిది. ఇంటికి దగ్గరగా ఉంటుంద"న్నాడు చాలా మామూలుగా విశ్వనాథం.

ఒంటరిగా కలిసినప్పుడు విశాలాక్షమ్మతో చెప్పాడు విశ్వనాథం హైదరాబాదు కబుర్లు. వియ్యపురాలిని చూసివచ్చినట్టుకూడా చెప్పాడు. ఆమె మాట్లాడకుండా పెదవి విరిచింది.

"కాంచనతో చెప్పాను మీరు హైదరాబాదువెళ్ళినట్టు మీరు రాగానే ఏమయిందని అడుగుతుందేమో ననుకున్నాను. ఏమీ పట్టనట్టు వెళ్ళిపోయింది కదూ?" బుగ్గలు నొక్కుకున్నది విశాలాక్షమ్మ.

కాంచన రమణలలో ఏదో మసలుతున్నదనుకున్నాడు విశ్వనాథం. తనడిగినా కాంచన ఎట్లాగూ చెప్పదు. అందుకే తప్పనిసరి మౌనం వహించాడు.

కాంచనకు స్కూలు పిల్లలతో మంచి కాలక్షేపంగా ఉంది. వాళ్ళకు పాటలు నేర్పుతున్నది. నాటకాలు వేయించుతున్నది వాళ్లచేత, కాని కడుపులో పాపాయి కదులుతున్నప్పుడల్లా భావాల సుడిగుండంలో పడిపోతున్నది. ఆనాడు రేడియోలో ఒక యుగళగీతానికి రికార్డింగ్ ఇచ్చింది. రేడియోస్టేషనులో తన పేరు స్వర్ణ.

భయపడుతూ ఇంటికి వచ్చింది కాంచన. తనపెళ్ళికి ముందు ఒక యుగళ గీతం పాడినందుకే తల్లి చివాట్లు పెట్టింది. అటువంటితల్లి పెళ్లయిన తరువాత ఒక యువకుడితో యుగళగీతం—అందులో శృంగారం-సరసాలు ఆమె వింటే ఊరుకుంటుందా? తన మనసులో ఎటువంటి మాలిన్యమూ లేదని చెప్పినా ఆమె వినదు. ఆమె తనను సమాజదృష్టితో తప్ప తల్లి మనసుతో చూడదు.

ఆనాడు రేడియోస్టేషనులో అందరూ అన్నారు "స్వర్ణా, నీ కంఠంలో మెలొడీ రోజు రోజుకూ అధికమవుతోంది. నీవు ప్లేబాక్ మ్యూజిషియన్‌వి కావాలి" అని. తను నవ్వింది ఎలా కావటమా అన్న ఆలోచన కళ్లల్లో మెరుస్తుండగా. దానికి పెద్ద ప్రయత్నంచేయాలి. అందుకు తల్లీ తండ్రీ సహకారంకావాలి. తల్లి ఒప్పుకోవాలి. తండ్రి తన వెంటరావాలి. ఇదంతా జరిగే పనా?

చటుక్కున జ్ఞాపకం వచ్చింది పెళ్ళిలో జరిగిన ఒక చిన్న సంఘటన. తన స్నేహితురాళ్లు రిసెప్షన్ సమయంలో పాటలు పాడుతూ తననూ పాడమని బలవంతం చేశారు. "వద్దు" అంటూ పెళ్లికొడుకు చేత్తో వారించాడు. పాటలు విని ఆనందించలేని హృదయం కాబోలు అనుకున్నది. ఎంత తోసివేసినా ఆ మాట ముల్లులా హృదయంలో గుచ్చుకుపోయింది. అప్పుడప్పుడు కలుక్కుమంటూ



యువ




ఉంటుంది. సంగీతంపట్ల మంచి అభిరుచీ అభినివేశమూ గల గాయనికి దానిపట్ల వైముఖ్యంకల పెనిమిటి లభించటం ఇది దేవుడువేసిన శిక్షకాకపోతే ఏమిటి? బరువుగా నిట్టూరుస్తుంది కాంచన. తన మూడు సంవత్సరాల కాపరంలో అందుకే ఒక్కనాడయినా మరిచిపోయికూడా తాను గొంతెత్తలేదు. తన పాటలు-తన ఆనందం-తన మధురోహలు తన ఆశలు-ఆశయాలు-అన్నీ మనసులోవి మనసులోనే దరిద్రుడి ఆశల్లా అణగారిపోయాయి.

కడుపులో కదిలినట్లయింది.

తన తల్లి అనుకుంటోంది మనమడో మనుమరాలో పుడితే ఎత్తుకు తిరగాలని.

ఆమెకేం తెలుసు తన ప్రాణసంకటం? మనసువిప్పని మొగవాడితో కాపురం ఎంత కంటకప్రాయంగా ఉంటుందో పాపం తన తల్లికి తెలియదు. తండ్రి మనసు విప్పినా విప్పకపోయినా కాపరం చేసింది. తనకు ఆయన అంత ప్రాధాన్యత ఇచ్చినా ఇవ్వకపోయినా అంతగా పట్టించుకోని మనిషి అమ్మ. తనకేదో అధికారం ఉందనుకుంటుంది ఆ అధికారపరిధిలో మసలుకుంటుంది. పిల్లలను కన్నది-పెంచి పెద్దవాళ్ళను చేస్తోంది.

కాంచన ఆలోచనలకు దరీ దాపు కనబడటంలేదు. తల్లికాబోతున్న స్త్రీలకు-ఆ పాలిపోయిన చెక్కిళ్లలోనే ఆనందం కనబడుతూ ఉంటుంది. గుంటలు పడిన ఆ కళ్ళలోనే సంతోషం వెల్లివిరుస్తూ ఉంటుంది. కాని కాంచనకు ఆ మాట తలపుకు రావటంతోనే ఒక విధమయిన వైముఖ్యము కొట్టవచ్చినట్టు ముఖంలో కనబడుతున్నది. ఆమెకు తల్లి కావలెనన్న ఆశ ఏకోశానాలేదు. ఒకనాడు రమణతో ఈ విషయంలో పెద్ద ఘర్షణ జరిగింది.

"జీవితంలో దేనికి మీరిచ్చే ప్రాధాన్యత?" భోజనాల సమయంలో అడిగింది కాంచన. ఆ సమయం తప్పితే అతడు అంత తీరికగా ఒకచోట కూర్చుని మాట్లాడడు.

ఆమె ప్రశ్నకతడు తలఎత్తి చూశాడు. ఆమె కళ్ళు అతనివైపు కుతూహలంతో ఒకసారీ—తీక్షణంగా ఒకసారీ చూస్తున్నాయి

"నాకా?" అన్నాడు కనుబొమలు పైకెత్తి.

"అవును మీకే. ఇంకెవరి సంగతో నాకెందుకు?" అన్నది

"నాకయితే విను. నాకు మొట్టమొదట నా వృత్తిని గురించీ, దానిని వృద్ధి చేసుకునే విషయాలమీదా తప్పితే మరొకదానిమీద మనసు లగ్నంకాదు. జీవితంలో మిగిలిన విషయాలన్నీ వీటిమీద ఆధారపడివున్నవే. వాటి తరువాతనే ఇతర విషయాలకు ప్రాధాన్యత" భోజనం ముగించి లేచాడు.

ఇటువంటి మాటలు అతడి నోటివెంట వస్తాయనుకోలేదు కాంచన. ఆమె అభిమానం దెబ్బతిన్నది. తన మనసునిండా ఉన్న కోరికలూ ఆశలూ ఆశయాలూ అన్నీ సమాధిచేసినట్లయింది. అయ్యో, ఈ యంత్రంతో కాపరం చేయటం ఎట్లా? మజ్జిగన్నం తినకుండానే చటుక్కున లేచింది.

అతడు తన పుస్తకంలో తలదాచుకున్నాడు. ఆ పుస్తకం చూడగానే ఒళ్ళు మండింది కాంచనకు. విసురుగా వెళ్ళి పక్కమీద పడుకుని దిండులో తలదాచుకున్నది. తనకూ తనకు పుట్టబోయే పిల్లలకూ అతడు ప్రాధాన్యత నివ్వడు. అటువంటి నిస్సారమయిన జీవితం గొడ్డులా జీవించవలసిందేనా? తన కక్కర్లేదంటే అక్కర్లేదు అటువంటి జీవితం. రోషమెక్కువయినకొద్దీ కన్నీళ్ళు పొంగుకుంటూ వస్తున్నాయి.

ఈ అక్కరలేని బిడ్డలుపుట్టి-నిర్లక్ష్యంతో విస్కుంటూ కసురుకునే తల్లిదండ్రుల పెంపకంలో ఏం సుఖపడతారు? వాళ్ళ భవిష్యత్తెం బాగుంటుంది? లోకంలో దొంగలూ హంతకులూ పెరిగిపోరూ? తిక్కమనుష్యుల సంఖ్య అధికంకాదూ? అటువంటి బిడ్డలకు నేను తల్లికావటమా? ఈ ఆలోచనల రైలుబండి గుప్పుగుప్పుమని పొగవిడుస్తూ తెల్లవార్లూ ఆమె గుండెల్లో పరుగులు తీసింది.

నాలుగుగంటలకే స్కూలునుంచి వచ్చిన కాంచన స్నేహితురాలిని చూడబోతున్నాననిచెప్పి రిక్షాలో బయలుదేరి డాక్టరు మాధవిని కలుసుకున్నది. ఆమె మామూలుగా పరీక్షచేసి "తల్లివి కాబోతున్నావు. ఈపాటికి నీకు తెలిసేఉండాలి.

బలహీనంగా కనబడుతున్నావు ఈ మందులు తీసుకుంటూ నెలకొకసారి కనబడు" అన్నది.

కాంచన మనసు కుంగిపోయినట్లయింది. "అయ్యో ఈమె కెట్లాచెప్పి ఒప్పించను?" మనసు మూలిగింది.

"అదికాదు డాక్టర్, మేమిద్దరం ఇప్పుడే పిల్లలు వద్దనుకున్నాం మేమిద్దరం ఒకనిర్ణయానికి వచ్చేసరికి సమయం మించిపోయింది. నన్ను మావాళ్ళింటికి పంపించి వారు చదువుకోటానికి ఢిల్లీ వెళ్లారు. నేనుకూడా చదువు సాగించాలనే అనుకుంటున్నాను. మా ప్రోగ్రామ్‌లకు అడ్డంకదా డాక్టర్? అందుకని గర్భస్రావం కోరుతున్నాను"తలవంచుకుని చెప్పింది.

"మంచి పనులకు ఎక్కువ ఆలోచించకపోయినా ఫరవాలేదు. ఇటువంటి పనులకు బాగా ఆలోచించాలి. చట్టరీత్యా చెడ్డపని కాకపోవచ్చు. కాని-ఇది కూడా హత్యక్రింద లెక్క. అయినా ఈ బాధంతా ఎందుకు? కని మీ అమ్మగారికిచ్చి వెళ్లకూడదూ ఎక్కడికయినా? మీ చదువులయ్యేసరికి పెరిగి పెద్దవాళ్ళవుతారు కదా? అప్పుడు వాళ్ళ చదువులసంగతి ఆలోచించవచ్చు?" ఇలా వాదించింది మాధవి.

నీరసంవల్ల చెమటపోసింది కాంచనకు.

"ఇష్టంవచ్చినప్పుడు పిల్లలను కనే స్వాతంత్ర్యంలేదా నాకు? మీరు ఇంత పెద్దడాక్టరయి ఉండీ వ్యక్తిస్వాతంత్ర్యాన్ని ఆమోదించరా? ఇది వెనుకటి తరం కాదు కళ్ళుమూసుకుని పిల్లలను కనటానికి! ఈ తరం ఆడపిల్లలు చదువుకుంటున్నారు. స్వాతంత్ర్యప్రియులు. జీవితమంతా ప్లాను ప్రకారం నడవాలంటారు. వ్యక్తి స్వాతంత్ర్యానికి ఎక్కువ ప్రాధాన్యత నిస్తారు. సంసారంలోనే మునిగి తేలాలని కోరుకోరు. ఇష్టమయితే స్త్రీలు ఒంటరిగా స్వతంత్రంగా జీవించాలనుకుంటారు. దానికెవరూ అభ్యంతరం చెప్పకూడదు." ఉద్రేకంతో అరిచినట్టుగా మాట్లాడింది కాంచన.

డాక్టరు నవ్వుకుంది.

"అయితే రేపు ఈవేళకు వచ్చెయ్యి" అన్నది

"రేపటివరకూ వాయిదా ఎందుకు వేస్తున్నారు?" సహనం కోల్పోతోంది కాంచన

"రేపటివరకూ నీ మనసు మారకపోతే అలాగే నీవు కోరినట్టే మందిస్తాను." చాలా నెమ్మదిగా మాట్లాడింది డాక్టరు మాధవి.

"తెలుసుకున్నప్పటినుంచీ నేనీ గర్భాన్ని పోగొట్టుకోవాలనే అనుకుంటు న్నాను" గంభీరంగా అన్నది కాంచన.

"ఆహాఁ! అయితే ఇంత ఆలస్యం ఎందుకు చేశావు?" నిలదీసినట్టుగా అడిగింది డాక్టరు

నిజమే! ఎందుకు తను ఆలస్యంచేసింది? అమ్మకూ నాన్నకూ భయపడా? లేక రమణకు భయపడ్డదా? రమణంటే తనకు భయమా? తనను లెక్కచేయని మనిషంటే తనకు భయమూలేదు. భక్తి అంతకంటే లేదు. అయినా ఇది తన స్వంత విషయము. అతడి ప్రసక్తేముంది దీనిలో? ఆలోచనలను ముఖంమీద కనబడనీయకుండా మెల్లగా అన్నది "డాక్టర్. మీరే అన్నారుకదా ఇటువంటి పనులకు చాలా దూరం ఆలోచించాలని! ఇన్నాళ్లూ అందుకే ఆలోచించాను. ఇక తప్పనిసరి అనుకుని మీదగ్గరికి వచ్చాను. ఏదో ఉద్రేకంలో అనేశానుగాని- పాపాయినెత్తుకుని ముద్దుపెట్టుకోవాలని నాకు మాత్రం ఉండదా? పరిస్థితులకు లొంగి - మనసును అదిమిపెట్టి - ఈ పనికి తలఒగ్గాను. మీరు సహాయం చేయాలి" రెండుచేతులూ జోడించింది.

గర్భస్రావం కావాలంటూ తనదగ్గరికి వచ్చే తల్లుల చరిత్రలెన్నో డాక్టరు మాధవికి తెలుసు. ఆమె ప్రాక్టీసంతా ఇంచుమించుగా దీనివల్ల వచ్చేదే. ఏ బాధా లేకుండా ఎటువంటి ప్రమాదమూ రాకుండా ఇంజక్షను ఇస్తుంది. మందులూ మాత్రలూ వాడి నెల్లాళ్ళకే ఎప్పటి మనిషిని చేస్తుంది. అయినా అటువంటివాళ్లు రాగానే రెండు గంటలసేపయినా ఎదురుతిరిగి మాట్లాడుతుంది. వాళ్లు బ్రతిమి లాడి బ్రతిమిలాడి ఫీజు ఎక్కువచేస్తారు.

కాని భర్తగానీ తండ్రిగానీ వెంటరానిదే డాక్టరు మాధవి గర్భస్రావానికి మందు ఇవ్వదు. ఆ మాట కాంచనతో చెప్పింది.

"మా నాన్నకు తీరుబడి తక్కువ డాక్టర్. నన్ను గురించి మిమ్మల్ని ప్రశ్నించేవారులేరు. మావారు ముందుగానే నాకు పర్మిషను ఇచ్చారు. ఆయన ఇచ్చిన తరువాత మా నాన్న ఎందుకు అభ్యంతరం తెలుపుతారు?" డాక్టరు ఎందుకు సందేహిస్తున్నదో కాంచనకు అర్థంకావటంలేదు.

''అయితే సరే. మీ అడ్రసు ఏమిటి? కాగితంమీద రాసివ్వు" అన్నది.

సందేహిస్తూనే కాంచన కాగితంమీదవ్రాసి చేతికిచ్చింది.

మరునాడు సాయంత్రం కాంచన డాక్టరు దగ్గరికి బయలుదేరుతుండగా



పోలికలు

విశ్వనాథం లోపలికివస్తూ "డాక్టరు దగ్గరకా కాంచనా? వెళ్ళు. ఆమె చాలా మంచిది," అన్నాడు.

కాంచన గతుక్కుమన్నది. ఆయనకెట్లా తెలిసింది? సందేహంగా ముఖంలోకి చూసింది. "మీకెట్లా తెలుసు నేను డాక్టరు దగ్గరికి వెళ్లుతున్నట్టు?" నసిగింది.

"ఆమె నా స్నేహితుడింటికి తరచుగా వచ్చిపోయే డాక్టరే. నాకు చాలా రోజులుగా తెలుసు. గంట కిందటే చెప్పింది నీ సంగతి." లోపలికి వెళ్ళిపోయాడు.

తండ్రికికూడా అభ్యుదయ భావాలున్నాయన్నమాట. తనే పొరపడింది. కాంచనకు కొండంతబలం వచ్చినట్లనిపించింది. ఉత్సాహంతో బయిలుదేరింది.

డాక్టరు మాధవి నవ్వుతూ కాంచనను గదిలోకి తీసుకువెళ్ళింది. బల్లమీద పడుకోమనిచెప్పి సిరంజి చేతిలోకి తీసుకుంటూ "చూడమ్మా, నీవు పదిరోజులు బాధపడటం-నలుగురూచేరి ఏమిటేమిటని అడగటం-నీవు అవమానంగా భావించటం నాకిష్టంలేదు. నీకిప్పుడు మత్తుమందిచ్చి-పిండాన్ని తీసేస్తాను. రెండు మూడు గంటల తరువాత నిన్ను మీయింటికి క్షేమంగా నా కారులో చేరుస్తాను. నాలుగురోజులు రెస్టుతీసుకో, చాలు. దీనికి నీవు ఒప్పుకుంటే పదినిమిషాలపని" అన్నది.

కాంచనకు ఇది బాగానే అనిపించింది. తనకు కావలసింది కూడా ఇదే. అనవసరంగా నలుగురు నోళ్ళల్లోపడటం ఇష్టంలేదు. సరేనని తల ఊపింది.

రాత్రి ఎనిమిదిగంటలకు డాక్టరు మాధవి తన కారులో కాంచనను తీసుకువచ్చి ఇంట్లో దింపి ఫీజు తీసుకునివెళ్ళింది. విశాలాక్షమ్మ కూతురిని మెల్లగా నడిపించు కుంటూ మంచంమీదికి చేర్చింది. కాంచనకు మత్తుమత్తుగా ఉంది. తల్లి ఇచ్చిన వేడి వేడి కాఫీ తాగి కళ్ళుమూసుకుని పడుకుంది.

## 5

రమణ స్టౌమీద అన్నం, కూర తయారుచేశాడు. స్నేహితుడు స్నానంచేసి రాగానే ఇద్దరూ భోజనాలకు కూర్చోవాలని అన్నం సిద్ధంచేస్తున్నాడు

రమేష్ భోజనానికి ముందు రేడియో ట్యూన్ చేశాడు పాడిపంటల కబురు లయ్యాక లలితసంగీతం వినబడుతోంది. ప్రాణం లేచివచ్చినట్లయింది రమణకు. ఆ తన్మయత్వంలో చేతిలోఉన్న పళ్ళెమక్కడపడేసి రేడియోదగ్గర నిలబడి వింటున్నాడు

"భోజనాలుచేస్తూ వినకూడదురా రమణా. నీకు అప్పటి పాటలపిచ్చి ఇంకా ఉందా?"

"ఉందా అంటావేం? అసలు పోయిందా? ఇప్పుడు తీరికలేకగాని రేడియోలో పాడేవాణ్ణి కదరా" ఆ పాట వింటుంటే అతడి ముఖం చేటంతయిపోతున్నది.

"అయ్యో, నీ పాటల సంగతి నాకు తెలియనిదా? పాట విని ప్రేమించావు కూడా కదూ ఒక అమ్మాయిని? నీ ప్రణయలేఖలు ఒక పెట్టెనిండి ఉండాలి." వడ్డించుకుంటూ అన్నాడు.

అంతలో రమణ ముఖం అదొక మాదిరిగా ముడుచుకుపోయినట్లయింది. జీవితంలో ముఖ్యమనుకున్నదాన్ని పోగొట్టుకున్నట్టుగా బాధ ముఖంలో ద్యోతకమయింది. పళ్ళెంలో చెయ్యిపెట్టి ఇంటికప్పుకేసి చూస్తున్నాడు.

"రమణా! నేను అడగకూడని విషయమెత్తి నిన్ను బాధపెట్టానా చెప్పు? క్షమించరా. ఎంత ప్రాణస్నేహితుడనయినా ఆంతరంగిక విషయాల నడక్కూడదని తెలుసుకోలేకపోయాను. క్షమిస్తావుకదూ?" భుజంమీద చెయ్యేసి కుది పాడు.

రమణ బరువుగా నిట్టూర్చి "నీవడిగినందుకు కాదురా నాబాధ! నాకు జీవి తంలో కావాలనుకున్నది చేతికందలేదురా. దాన్ని తలచుకుంటే బాధ కలిగింది. అంతేకాని మరొకటికాదు. ఇప్పడీ పరీక్ష చదువుతున్నానా? ఇదే కావాలన్న ఆశతో చదవటంలేదు. మొండిగా దీనిలో తలదూర్చి చదువుతున్నాను. నా పరి స్థితులనూ నన్నూ మరిచిపోవటానికి చదువుతున్నాను. చదువును

తప్ప మిగతావన్నీ మిథ్య అనుకుంటూ చదువుతున్నాను. వస్తున వస్తే రావచ్చు కూడా. ఈ పరీక్షలయిన తరువాత-రిజల్ట్సు తెలిసేవరకూ మళ్ళీ నరకమనుభ విస్తాను." గటగట గ్లాసెడు మంచినీళ్ళు తాగి లేచాడు.

చంగునలేచి రమణ చెయ్యిపట్టుకుని కూర్చోబెట్టాడు రమేష్. "నీవు అన్నం తినకుండా లేచిపోతే నామీద ఒట్టేరా. నీవు తినకపోతే నావల్ల ఉపోషం ఉన్నా వని నా మనసు బాధపడుతుంది. ప్లీజ్, అన్నం తిను."

అన్యమనస్కంగా తిని లేచాడు రమణ. అతడి మనసులో పేరుకుపోయిన బాధంతా బైటికి వెళ్ళగ్రక్కించాలనుకున్నాడు రమేష్. ఒకసారి బాధను ఎవరితో నయినా చెప్పుకుంటే మనసు తేలికపడుతుందనిపించింది. అదే-అదే-ఎట్లా చెప్పించటం రమణచేత?

రమణ మరి పుస్తకం తెరవలేదారాత్రికి.

రమేష్ ఆలోచిస్తున్నాడు. ఆ యుగళగీతంలో అమ్మాయి కంఠము తేనె సోనలు కురుస్తున్నది. అబ్బాయిది మంద్రస్థాయిలో గంభీరంగా పౌరుషోచితంగా ఉన్నది. ఇద్దరి కంఠాలు మేళవించిపాడిన ఆ గీతం చాలా అసామాన్యంగా ఉన్నది. ఈ పాట విన్న తరువాతనే రమణ మనసు చలించింది. దిగ్గునలేచి కిటికీగుండా చూస్తున్న రమణను తనవైపుకు తిప్పుకుంటూ "ఇందాక రేడియోలో ప్రసారమైన యుగళగీత మెవరిదిరా? ఇదివరకెప్పుడైనా విన్నావా?'' అడిగాడు.

"ఆ పాటా?" విషాదస్వరంతో విచలితుడై గొణిగినట్టుగా అన్నాడు రమణ.

"ఆఁ, ఆ పాటే ఇదివరకెప్పుడైనా విన్నావా?" నొక్కి నొక్కి అడిగాడు.

"విన్నాను. ఆ అమ్మాయి కంఠధ్వని కొంతకాలం క్రిందట విన్నాను. ఆశలతో మేడలు కట్టాను. బంగారు కలలు కన్నాను. అవి కలలు కనుక కరిగి పోయాయి. నిరాశా నిస్పృహలతో నయినా ముందుకు సాగదామని జీవితంతో రాజీపడదామనుకున్నాను. అప్పటికిప్పుడు ఈ పాట మళ్ళీ నా హృదయాంతరాళం లోని మంటలను పైకెగసన తోస్తున్నది'' శూన్యంలోకి చూస్తూ తనలో తాను మాట్లాడుకుంటున్నట్టుగా అన్నాడు.

"అయితే-ఒక మాటరా రమణా. జీవితంతో రాజీపడదామనుకున్నానన్నావు. మరి ప్రయత్నించావా? నీ ప్రయత్నాలు సఫలమయితే ఈ పాటకంతగా నీ మనసు చలించదు. ఏమంటావు?''

నుదుటిమీద చెయ్యేసుకున్నాడు రమణ. "ఏంచెప్పను? ఎలా చెప్పను? ప్రయత్నాలు మొదలుపెట్టాను. నా ప్రయత్నాలకు తగిన సమాధానం లభించ

లేదు. ఒక పక్షము ప్రయత్నిస్తే లాభం ఉంటుందా? నిజంగా నా ప్రయత్నాలు ఫలించినట్లయితే ఈ బాధను సమూలంగా పెరికిపారేసేవాడిని. జీవితంలో సర్దుకుపోదామన్నా అదృష్టం కలిసిరాలేదు. ఏంచెయ్యను?"

ఇక రమణను ఆ విషయంలో కదిలించదలచుకోలేదు రమేష్. రమణ మరింత బాధపడిపోతున్నాడు.

"పిక్చర్‌కు పోదాంరా రమణా" లేచి బుష్‌షర్టు తీసుకున్నాడు రమేష్.

"ఎందుకురా? మనసు మళ్ళించుకోటానికేనా? ఇంత విషాదాన్నీ పుస్తకం పట్టుకుని మళ్ళించుకోగలనులే. నన్ను గురించి చేమాలోచిస్తావుగాని – నీవుకూడా ఏదయినా చదువుకో. లేకపోతే పడుకో. అవునుగాని–నీకున్న ఒక్క గదిలో నాకాశ్రయమిచ్చావు. శ్రీమతి ఎప్పుడు వస్తుంది? నేనెక్కడయినా గది చూసుకోవాలిగా. కాస్త ముందుగా చెప్పు." రమణ పుస్తకం చేతపట్టుకున్నాడు.

"మా శ్రీమతా? ఇంకా రెండు నెలలయితేనేగాని పురుడురాదు. బిడ్డకు కనీసం ఏడు ఎనిమిది నెలలు వస్తేగాని ఇక్కడికి తీసుకురాను."

"ఎందుకు? నాకోసం ఆమెను పుట్టింట్లో ఉంచుతావా?"

"ఛా, ఛా! నీవిక్కడ ఉండకపోయినా ఆమె కొన్నాళ్ళక్కడే ఉంటుంది. క్రిందటిసారి ఆత్రపడి నెలబిడ్డతో ఆమెను పిలిపించాను. కాని–ఆ నెలబిడ్డను పెంచటం మాకిక్కడ చేతకాలేదు. పోగొట్టుకున్నాం. అందుకని ఆమె ఇప్పుడప్పుడే రాదు. కనుకనే నిన్ను నాకు తోడుగా ఉండమన్నాను. ఆమె రాక ముందే పరీక్షలయిపోతాయి. కనుక నీవు నిశ్చింతగా ఉండు."

రమణ పుస్తకం తెరిచాడు గాని– మనసక్కడలేదు. ఎక్కడెక్కడో విహరించటం మొదలుపెట్టింది. ఆ స్వర్ణ కంఠం తిరిగి అప్పటికిప్పుడు రేడియోలో వినబడ్డది. అదృష్టవంతురాలు. తన కన్ని ప్రణయలేఖలు వ్రాసినా–జీవితంలో అదే కావాలని పట్టుబట్టి కూర్చోకుండా పెద్దలుచెప్పినట్టు విని పెళ్ళిచేసుకుని సుఖపడుతున్నట్టే ఉంది. ఇంకా తన అభిమాన కళను ఆరాధిస్తూ మనసును ఆనందింపచేసుకుంటోంది. తనో? హృదయంలో ముల్లుగుచ్చుకున్నట్టయింది రమణకు. తను గడచినదానిని మరిచిపోదామన్నా కాంచన ప్రతిక్షణం తలుచుకునేటట్టు చేస్తోంది.

తనకు ప్రతిదీ అందంగా ఆనందదాయకంగా ఉండాలి ఇంట్లో. తన బట్టలు సర్దినట్టే ఉండాలి. తన పుస్తకాలు పేర్చినట్టే ఉండాలి. తను కూర్చునే కుర్చీ–వ్రాసుకునేబల్ల దుమ్ములేకుండా అద్దంలా శుభ్రంగా ఉండాలి. తన పక్క నలగ

కూడదు. దానికెదురుగా ఉన్న కిటికీతలుపులు తెరిచీతెరవనట్టుగా ఉండాలి. తన ఇల్లు రెండు గదులదయినా సరే - శుచిగా - శుభ్రంగా కళాత్మకంగా సర్ది ఉండాలి. దీనికి భిన్నంగా ఉంటే అతడు సంహించలేడు. భోజనం ఒకగంట ఆలస్యమైనా సరే - అతడికి బాధలేదు. ఇటువంటి విషయాలలో కూడా కాంచన తనతో సహకరించలేదు. ఆమె స్త్రీ స్వాతంత్ర్య నినాదంతో ఇంట్లో అడుగు పెట్టింది. జీవితంలో బాధ్యతలను పంచుకుందామంటే స్త్రీ స్వాతంత్ర్యం అడ్డు వచ్చిందామెకు. బాధ్యతలకూ స్వాతంత్ర్యానికీ పోటీపెట్టి వాదించేది. ముందుకు నడిచిన స్త్రీలే జాతిని ముందుకు నడిపించగలర్న అభ్యుదయభావాలు గలవాడు తను. కాని-కాంచన ఉద్దేశ్యంలో స్త్రీ స్వాతంత్ర్యమంటే ఉన్న అర్థంవేరు. ఆమె కోరిన స్త్రీ స్వాతంత్ర్యములో స్త్రీ - ఒక మంచి ఇల్లాలిగా-భర్తను ప్రేమించే భార్యగా-అమృతం కురిపించే మాతృమూర్తిగాఉండదు. పురుషుడు ఏ హోదాలో నయినా పలకరించితే బూడిద అయేటట్టు శపించే రౌద్రమూర్తి. కళ్ళల్లో నిప్పులు కురిపిస్తూ తన పరిస్థితికి ప్రతి మనిషీ కారకుడేనన్నట్లు కొరకొరచూస్తూ ఉండే మూర్తి. అందరూ బానిసలు కావాలి. స్త్రీలు మాత్రం సింహాసనమెక్కాలనే కాంక్షకలది.

ఒకనాడు తను ఊరుకోలేక "కాంచనా, స్త్రీలకు పురుషులతో సమాన హక్కులు కావాలా? లేక అధికంగా కావాలా?" అన్నాడు నవ్వుతూ.

"అధికంగానే కావాలి. స్త్రీ అంటే బానిస అనుకున్నారా?" విదిలించినట్టు మాట్లాడింది.

నవ్వాపుకోలేకపోయాడు రమణ. "అయితే కొన్నాళ్ళకు పురుష స్వాతంత్ర్యంకోసం పోరాటం తప్పదు దేశానికి" అన్నాడు.

"మీకు నవ్వెందుకు వస్తున్నది? ఆడది బానిసన్న భావం మీ రక్తంలో జీర్ణించి ఉండకపోతే తొమ్మిదిగంటలకు వంటకాలేదని చిరచిరలాడతారేం? ఇల్లంతా సర్ది అద్దంలా ఉంచలేదని రుసరుసలాడతారేం? మీరు వచ్చేటప్పటికి నేను శుభ్రమైన చీర కట్టుకుని తల్లో పూలతో ఎదురుగా రాలేదని మండిపడతారేం? ఏమిటి మీ అధికారం చెప్పండి. మీకు నచ్చినట్టుగా నేనెందుకు నడుచుకోవాలి? మీ ఇష్టాన్ననుసరించి నా అలవాట్లను ఎందుకు మలచుకోవాలి?" కంఠధ్వని హెచ్చించినందువల్ల ముఖం ఎర్రబడి మెడమీద నరాలు ఉబ్బాయి. అంతే. ఆ రాత్రి వంట లేదు. ఇద్దరికీ భోజనాలు లేవు. మరునాడు కాంచన పక్కమీదినుంచి లేవలేదు.

రమణకు అర్థమయింది కాంచన ధోరణి. వ్యక్తి స్వాతంత్ర్యాన్ని పెడర్థం

చేసుకుంటోంది. ఈ ధోరణి కలవాళ్లెప్పటికయినా బాగుపడతారా? తనతో సమానంగా అన్ని విషయాలలోనూ తన భార్యకూడా ఉండాలన్న తన అభిప్రాయాలను మల మల మాడ్చివేస్తున్నది కాంచన. ఈ పిడివాదంతో తన జీవితాన్నే కాకుండా కాంచన ఎదుటివారి జీవితాన్నికూడా నాశనం చేస్తున్నది.

ఆలోచించి ఆలోచించి రమణ బుర్ర వేడెక్కిపోయింది. అయితే పెళ్ళికాక ముందు తను సర్దుకుని జీవిస్తానని తల్లికి మాట ఇచ్చాడు దాని నతిక్రమించ దలచుకోలేదు పొద్దున్నే లేస్తూనే "కాంచనా, ఇంకా లేవలేదేం? ఒంట్లో బాగుందా?" సాధ్యమైనంత మెల్లగా అడిగాడు.

"ఏం? ఒంట్లో బాగుంటే లేచి వండిపెట్టాలని ఉందా?" చీదరించుకుంది.

తానే సర్దుకుపోదలుచుకున్నవాడు కనుక-గబగబా ఇద్దరికీ కాఫీచేశాడు. ఆమెకు మూసిపెట్టి తను తీసుకుని నీళ్ళు కాగబెట్టి స్నానంచేశాడు. వంటచేసి తను భోజనించేసి ఆమెకు మూసిపెట్టి ఆఫీసుకు వెళ్ళాడు. అంతే. తను తిరిగి ఆఫీసునుంచి వచ్చేటప్పటికి కాంచనలేదు.

కాంచన వచ్చిందా? అని తను మామగారికి ఉత్తరం వ్రాయలేదు. తను మరీ అంత బెంబేలుపడి తనను తాను న్యూనతపరచుకోదలచలేదు. తల్లి కంతకంటే విప్పిచెప్పలేదు. ఎప్పటికయినా కాలమే సహకరించాలన్న ఉద్దేశ్యంతో గంభీరించాడు.

కాంచనమీద కలిగిన విరక్తివల్ల రమణకు స్వర్ణపైన పదేపదే పోతున్నాయి ఆలోచనలు స్నేహపూరితమైన జాబొకటి స్వర్ణకు వ్రాస్తే తన మనసుకు ఊరట కలుగుతుందన్న ఆశ జనిస్తోంది. తన ఉత్తరం ఆమె పచ్చని కాపరంలో నిప్పులు పోస్తుందేమోనన్న వెరపు కలుగుతోంది ఆశా నిరాశల మధ్య ఉయ్యాల లూగింది మనసు.

ఒకనాడు పట్టలేక వ్రాశాడు స్వర్ణకు ఉత్తరం. దానిలో బ్రతుకులో ఎంతో నిరాశ-జీవితంమీద ఎంతో విరక్తి-మనసుకు ఎట్లా ఊరట కలుగుతుందా అన్న ఆవేదన ప్రస్ఫుటమయేటట్టు వ్రాశాడు.

పదిహేనురోజుల తరువాత వచ్చిన ఉత్తరంచూసి ఆశ్చర్యపడిపోయాడు రమణ. స్వర్ణ తనకు నిజంగా జవాబిస్తుందని అతడు కలలోనయినా ఊహించలేదు. ఆమెకూడా తన మాదిరిగానే జీవితంలో ఓడిపోయిందేమో! మనశ్శాంతి కరవై తనలాగే పరితపించిపోతోందేమో? అందుకే తిరిగి తన అభిమాన కళను ఆరాధించటం మొదలుపెట్టిందేమో? మనసొకచోట-మాంగళ్యమొకచోట-విధాత విచిత్రలీలలు కాకపోతే ఏమిటి?



రమణ కిప్పుడు వారానికొక ఉత్తరమయినా స్వర్ణకు వ్రాయకపోతే తోచటం లేదు. ఆమె దగ్గరినుంచి వచ్చిన జాబులు చదువుకుని ద్విగుణీకృతమైన ఉత్సాహంతో చదువును సాగించగలుగుతున్నాడు.

ఆమె ఉత్తరాలు, ఇదివరకు అంటే తన వివాహానికి ముందు వ్రాసినట్టుగా లేవు. ఈఉత్తరాలు వ్రాయటంలోను-వీటికి వచ్చిన సమాధానాలు చదువుకోవటంతోనే మనిషికి ప్రాణం లేచివచ్చినట్టవుతున్నది. ఎక్కడలేని సత్తువ మనిషికి చేరుతున్నట్లనిపిస్తోంది.

ఇద్దరి పరిస్థితీ ఒకమాదిరిగానే ఉన్నట్టుంది. విధి ఇట్లా ఇద్దరినీ ఎడా పెడా విసిరేసిందేమిటి?

అతడి కిప్పుడు ఈ ఉత్తరాలన్నీ కాల్చివేయాలన్న ఉద్దేశములేదు. ప్రతి రోజూ పడుకోబోయే ముందు వాటినొకసారి-మరొకసారి చదువుకుంటాడు. గుండెలనిండా గాలి పీల్చుకుని-హాయిగా నిశ్చింతగా నిద్రపోగలుగుతున్నాడు. శ్రద్ధగా చదువుకోగలుగుతున్నాడు.

పరిపరివిధాల పోతున్న మనసుతో-స్కూలుపిల్లల మధ్య తన ఆవేదనంతా మరచిపోతూ-ఇంటికి రాగానే ముడుచుకుని పడుకునే కాంచన ఇప్పుడు మరీ అంత నిరుత్సాహంగా ఉండలేకపోతున్నది. పెళ్ళికాకముందు ఉన్నట్టుగానే ఉండటానికి ప్రయత్నం చేస్తోంది. తల్లి కష్టసుఖాలు కనుక్కుంటోంది. తండ్రికి కష్టం కలిగించకుండా నడచుకుంటోంది అప్పుడప్పుడు ఉత్సాహంగా పాటలు ఇంట్లోకూడా పాడుకుంటోంది. చెల్లెళ్ళమీద, తమ్ముడిమీద విసుక్కోవటంగాని కోపగించుకోవటంగాని లేదు.

అందుకు సమాధానం ఆమె మనసుకు తెలుసు అదంతా పాణిదగ్గర్నుంచి మళ్ళీ రావటం మొదలుపెట్టిన ఉత్తరాల మహిమ అని తెలుసు. అతడి కష్టసుఖాలను అతడు వెళ్ళబోసుకుంటే తన మనసు కరిగిపోతున్నది. తన కష్టసుఖాలను ఉత్తరాలలో వ్రాస్తుంటే అతడి హృదయమూ స్పందిస్తున్నది. తన జీవితంలో మిగిలినవి-తన కూరట కలిగించేవీ ఈ ఉత్తరాలు-ఈ పాటలు!

ఆమె తన వివాహం కాకపూర్వం పాణి వ్రాసిన ఉత్తరాలు నశింపచేయలేదు. ఒక దంతపు పెట్టెలో భద్రపరచుకుంది. దానికి పచ్చరంగు రిబ్బను కట్టింది. ఆ పచ్చరంగు రిబ్బను చూడగానే ఆమె హృదయం పురివిప్పిన నెమలిలా అవుతుంది.

వివాహానికి ముందు వ్రాసుకున్న ఉత్తరాలలో ప్రేమ-ఆకర్షణ-వ్యామోహం -పట్టరాని తమి-కాంక్ష-ముంచెత్తినట్టుండేవి. ఇప్పుడవి అంత ఉడుకుగాలేవు. ఆవేదనతో-బాధతో-కష్టాలు ఒకరితో ఒకరు చెప్పుకుంటున్నట్టుగా ఉన్నాయి.

ఆమెకు ఈ మధ్య భారంగా ఉంటున్న విషయంకూడా పరిష్కారమయి పోయింది డాక్టరు మాధవి దయవల్ల. తనిప్పుడన్నివిధాలా స్వతంత్రురాలు. అందరినీ ఎదిరించి స్వేచ్ఛ సంపాదించుకున్నది.

ఆనాడామె హృదయం ఎంత పొంగి పరవళ్ళు త్రొక్కిందో? పాణి వ్రాశాడు —"స్వర్ణా, మనిద్దరి బ్రతుకులూ భగవంతుడు వేరుచేయాలని చూశాడు చేశాడు. కాని మంచి ఫలితాలను చూడలేకపోయాడు. నీ విషయంలోకూడా ఇంతే జరిగినట్లనిపిస్తోంది నీవు పునర్వివాహం చేసుకోదలచుకున్నావా? పచ్చటి బ్రతుకెందుకు పాడుచేసుకుంటావు?" అని.

పరవశించిన హృదయంతోనే వ్రాసింది సమాధానం-నేను ఆశించినట్టుగా జరగకపోతే మళ్ళీ చేసుకున్నా లాభంలేదు" అంటూ తన హృదయాన్ని విప్పింది.

స్కూలునుంచి తిరిగి వస్తున్న కాంచనదృష్టి అనుకోకుండా కడుపుమీదికి పోయింది. "ఇదేమిటి?" అనుకుంది తడిమిచూసుకుంటూ. గర్భస్రావం నిశ్శేషంగా కాలేదా? నిపుణురాలైన డాక్టరు మాధవి గర్భస్రావంచేస్తే దానిలో అనుమానం ఉంటుందా? గబగబా అడుగులేస్తూ నడిచింది. ఇంటికి వచ్చేటప్పటికి తనతో చిన్నప్పుడు ఆడుకున్న మాణిక్యం చాపమీదకూర్చుని తల్లితో కబుర్లు చెబుతున్నది.

"అదిగో అమ్మాయి వచ్చేసింది మాణిక్యం. వెళ్తా వెళ్తానని తొందరపడిపోతున్నావు ఉరికే. కాఫీ తాగుతూ స్నేహితురాళ్ళిద్దరూ కబుర్లు చెప్పుకోండి'' ఇద్దరికీ చెరొక గ్లాసు అందించింది.

మాణిక్యం కాంచనవైపు చూస్తూ "కాంచనా! జ్ఞాపకం ఉన్నానా? ఇక్కడికి వచ్చి పదిరోజులయింది నీ దగ్గరికి రావాలని వచ్చినప్పటినుంచీ అనుకుంటున్నాను. ఇల్లు కదిలితే పిల్లల ఆరోగ్యం చెడిపోతుందనుకో. ఇక్కడికి రాగానే చిన్నవాడికి దగ్గూ జలుబూ పట్టుకుని జ్వరంలోకి దిగింది. దాంతో తండ్రికోసం ఏడుపు. టెలిగ్రాం ఇచ్చి ఆయన్ను పిలిపించగానే వాడిజ్వరం మాయమయింది. అందరం కలిసి రేపు వెళ్ళిపోతాము. ఈ పిల్లలతో ఇంతే కాంచనా. ఎప్పుడు వచ్చినా స్థిమితంగా వారంరోజులయినా ఉండనివ్వరు. అమ్మకూడా అదే అంటోంది నిన్నటినుంచీ" తనను గురించి మాణిక్యం రాళ్లవర్షంలా అంతా చెప్పేసింది.

కాంచన ఓ చిన్న నవ్వు నవ్వింది. "పిట్ట వలలో చిక్కుకుపోయినట్టు సంసారంలో చిక్కుకుపోయావు. నీ చదువూ, సంగీతమూ అన్నీ సంసారంలో జ్ఞాపకమయినా వస్తున్నాయా?" అంది అదొకమాదిరిగా ముఖంపెట్టి.

పకపక నవ్వింది మాణిక్యం.

"నీవెంతవరకూ జ్ఞాపకం చేసుకుంటున్నావు?" నవ్వుతూనే ప్రశ్నించింది మాణిక్యం.

"సంసారంలో నీలా ఏకమైపోలేదు వ్యక్తిత్వాన్ని నిలుపుకుంటున్నాను." విజయం సాధించినట్టుగా అన్నది.

"అంటే?" అమాయకంగా అడుగుతూ కాంచన కడుపువైపు చూసింది మాణిక్యం.

"నేను ఇదివరకు ఎట్లా ఉన్నానో ఇప్పుడూ అలాగే ఉన్నాను. నా పాటను నేను మరిచిపోలేదు- సాధన చేస్తున్నాను. రేడియో ప్రోగ్రాములు ఇస్తున్నాను.

ఉద్యోగంచేస్తూ చదువును సార్థకం చేస్తున్నాను. మన అమ్మలు ఉన్నట్టుగా ఒకరిమీద ఆధారపడక ఉద్యోగంచేస్తూ నా కాళ్లమీద నేను నిలబడ్డాను. మనము కాలేజీలో చదివేటప్పుడు డిబేట్సులో మాట్లాడినట్టే స్త్రీలకు స్వాతంత్ర్యము కావాలంటున్నాను." ముఖానికి పట్టిన చెమట తుడుచుకుంది

"ఓ అదా?" విరగబడి నవ్వింది మాణిక్యం.

"ఎవరి వ్యక్తిత్వాలు వాళ్ళు నిలుపుకుంటూ మేకుల్లా నిలబడితే సంసార మెట్లా సాగుతుంది? ఇద్దరూ చెరికొంతా వదులుకుంటేగాని మూడోవాళ్ళకు భవిష్యత్తు ఉండదు. ఏ ఎద్దుకా ఎద్దు కాడి మెడమీద పెట్టుకునికూడా వ్యక్తి స్వాతంత్ర్యం అంటూ నిలబడితే సేద్యము జరుగుతుందా? నాకు తెలిసింది ఇంతే కాంచనా!" చీరెకుచ్చెళ్లు సరిచేసుకుంటూ లేచింది.

"అయితే రేపు వెళ్ళిపోతున్నా వన్నమాట?" అన్నది కాంచన

"అవును కాంచనా. ఆయనకు సెలవులేదు. అందరం కలిసే వెళ్తాము" అన్నది.

"ఉండాలనుకుంటే ఉండలేవా? రాక రాక వచ్చావు. వాళ్ళందరినీ పంపేసి ఉండరాదూ?"

"నేనలా అనుకోను కాంచనా. నా బాధ్యతలు నాకున్నాయి" అర్థింపుగా అన్నది మాణిక్యం.

"ఏం బాధ్యతలు? బాధ్యతలు బాధ్యతలంటావు? ఓ పదిరోజులు పుట్టింట్లో స్వేచ్ఛగా ఉండే స్వాతంత్ర్యం లేదా నీకు? పిల్లలను ఆ మాత్రం ఆయన పది రోజులపాటు చూసుకోలేడా?"

"ఎందుకు చూసుకోవాలి? వాళ్ళను చిన్నప్పుడు చూసుకునే బాధ్యత నాది కాదా? సంపాదించే బాధ్యత ఆయనపైన వేసుకున్నప్పుడు పిల్లలను పెంచే బాధ్యత నాదకాదా? ఏమో కాంచనా. బాధ్యతలులేని స్వాతంత్ర్యం–బాధ్యతలను ఏమారిన స్వాతంత్ర్యం నాకు వద్దు కాంచనా. నేనింతే అనుకో" చెప్పులు వేసుకుని వెళ్ళిపోయింది మాణిక్యం

మాణిక్యం వెళ్ళేవరకూ గడపనానుకుని నిలబడ్డ విశాలాక్షమ్మ విస్ఫుటించింది. "నీమాటలకేమయినా అర్థముందీ? చక్కగా అది పిల్లలకోసలా పుట్టింటికి వచ్చింది. పదిరోజులుండి దానింటికి అది వెళ్తుంది. దానికి ఆనందంగానూ ఉంది. చూసేవాళ్లకు అందంగానూ ఉంది తాచెడ్డకోతి వనమెల్లా చెరిచిందట." నాలుగూ దులిపి లోపలికి వెళ్ళిపోయింది.




''అవును. నీవిట్లా అనక ఇంకేమంటావు!'' చివాలున లేచి లోపలికివెళ్లి పర్సు తీసుకుని వాకిట్లోకి ఎదురుగా వచ్చిన రిక్షా ఎక్కింది కాంచన. డాక్టరు మాధవి ఇంటిముందు దిగి గబగబా లోపలికివెళ్ళి "డాక్టర్" అన్నది

చేతులు కడుక్కుంటున్న డాక్టరు "ఏమిటిలా వచ్చావు కాంచనా? కూర్చో ఆయాసపడిపోతున్నావు విశ్రాంతిగా కూర్చో. ఇప్పుడే వస్తాను" లోపలికివెళ్ళి పదినిమిషాలలో వచ్చింది తిరిగి

కాంచనను తన గదిలోకి పిలుస్తూ "ఏమిటి సంగతి?" అడిగింది డాక్టరు మాధవి.

''డాక్టర్! మీరు ఆపరేషన్ చేశానన్నారు. కాని - నాకు కడుపు ఎత్తు తగ్గ లేదు. నాకు ఇంకా ఎదుగుతున్నట్టుగా ఉంది. సరిగా చూడండి డాక్టర్ నాకేదో భయంగా ఉంది". జాలిగొలుపుతున్నాయి కాంచన మాటలు.

బల్లమీద పడుకున్న కాంచనను పరీక్షచేసింది డాక్టరు పెదవులపైకి రాబో తున్న నవ్వును బిగించిపెట్టింది.

కాంచన లేచి చీరెసర్దుకుని కుర్చీలో కూర్చుని డాక్టరు ముఖంలోకి చూసింది.

''కాంచనా! నీకు నేను అప్పుడు నిజం చెప్పలేదు. కాని-ఇప్పుడు చెపుతు న్నాను. నీవు గర్భమనుకుని గర్భస్రావము చేయమన్నావు. నిజానికది గర్భం కాదు. కడుపులో ఏదో ఎదుగుతున్నది. నేను అన్ని పరీక్షలూచేసి ఆపరేషను చేసి తీసేస్తాను. కొన్నాళ్ళాగు. ఏదయినా తొందరపడి చేయగూడదు. మందు లతో తగ్గుతుందేమోచూడాలి. తగ్గకపోతే ఆపరేషనునిశ్చయమనుకో. నలుగురూ ఏమేమిటో అంటారు కాని-నీవు ఆ మాటలను లక్ష్యపెట్టకు. నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డువేస్తాను" అన్నది ధైర్యం చెబుతూ.

ఇంటికి తిరిగివస్తున్న కాంచనకు ఏవేవో ఆలోచనలు సుడిగుండంలా తిర గటం మొదలుపెట్టాయి. కాని-డాక్టరు చెప్పిన ధైర్యం బాగా పనిచేసినట్టుంది. ఎనిమిదిగంటలు కాగానే భోజనంచేసి హాయిగా నిద్రపోయింది.

మరునాడు స్కూలునుంచి వచ్చిన కాంచనకు చిన్నతమ్ముడు అందించాడు-ఆ ఉత్తరం-దస్తూరినిబట్టి కాంచన గుర్తుపట్టగలదు. దానిని చూడగానే సూర్య రశ్మి సోకిన అరవిందంలా ముఖం విప్పారింది.

అరవిందమూ సూర్యుడూ ఎప్పుడైనా కలుసుకుంటారా? కలుసుకోవటమే తటస్థించితే అరవిందము పరిస్థితి ఎలా ఉంటుంది?

ఈ సమస్యను గురించి కాంచన ఎప్పుడూ ఆలోచించలేదు. కాని-ఆమె ముఖ పద్మము మాత్రము రేకులు విచ్చుకుంటుంది పాణి దస్తూరి చూసినా-అతడు వ్రాసిన ఉత్తరం చూసినా-అతడిని గురించి ఆలోచించినా.

ఆ రోజు సాయంత్రము స్కూలునుంచి రాగానే కాంచన మెల్లగా తండ్రి దగ్గర చేరింది.

"ఏమిటమ్మా, ఇప్పుడు నీ వంట్లో కులాసాగానే ఉందికదూ? మీ స్కూల్లో పరీక్షలెప్పుడు?" నవ్వుతూ ఆప్యాయంగా వలకరించాడు.

"నాన్నా, నన్నొకసారి మెడ్రాస్ తీసుకువెళ్ళండి" బ్రతిమిలాడుతున్నట్టుగా అడిగింది.

"మెడ్రాసా? ఎందుకమ్మా?" అదిరిపడ్డాడు.

"రేడియోస్టేషనులో అందరూ సినిమాలో పాడటానికి ప్రయత్నం చేయ మంటున్నారు నాన్నా. నీకు తెలిసినవాళ్ళు మెడ్రాసులో ఉంటే తీసుకెళ్ల నాన్నా "

"తీసుకువెళ్తాననుకో. కాని మనకోసం సినిమావాళ్ళతో ప్రయత్నం చేసేదె వరు?" ఆలోచనకోసం ఆమెవంక చూశాడు.

"అసలు మనము ఆ ఊరంటూ వెళ్తే మార్గాలు కనబడకపోతాయా నాన్నా? నీకిష్టమేనా చెప్పు? అమ్మకు నా సంగీత మంటేనే కోపం. అందుకే అమ్మతో చెప్పలేదు."

"నీవు పాడతానంటే నేను వద్దంటానా కాంచనా. పిల్లలందరిమీదకంటే నీమీద నాకు కాస్త అభిమానమెక్కువ. నాకు శక్తిలేకపోయినా నీవడిగింది కాదన లేని బలహీనత నాలో ఉంది. ఆలోచిద్దాంలే" అనుకోకుండా ఆమె గర్భం మీదికి అతడి దృష్టి మళ్ళింది. గతుక్కుమన్నాడు. కాంచన ఆలోచనలకూ

పరిస్థితికి పొత్తులేకుండా ఉన్నది ఇట్లాగే ఇక్కడే ఉండి పాటలు పాడుకుంటూ కాలక్షేపం చెయ్యాలనా? ఈ పురుడు? పుట్టినబిడ్డ? రమణ కబుర్లు తెలియటం లేదు ఈ సమస్యనింతటితో వదిలివెయ్యటమా? ఇది ఎప్పుడు-ఎట్లా పరిష్కార మయేటట్లు? తను ఒంటరివాడయి నట్లనిపించింది ఆయనకు విశాలాక్షమ్మతో ఈ విషయం ఆలోచించటానికి వీలులేదు. ఇంక—కాంచన ఆమెతోనూ ఆలోచనలు చేయటానికి వీలులేదు-ఆమె చెప్పినట్టు వినటంతప్ప.

బరువుగా ఊపిరి పీల్చుకున్నాడు విశ్వనాథం. ఏమీ తోచనప్పుడు కండువా భుజమ్మీద వేసుకుని అలా నాలుగు బజార్లూ తిరిగి పొద్దుపోయిన తరువాత ఇంటికి రావటం ఆయనకు అలవాటు. లేచి చెప్పులువేసుకుని బయలుదేరుతూ "కాంచనా, అలా వెళ్లొస్తాను తలుపేసుకో అమ్మా". ఆమె తలుపు వేసుకున్న తరువాత కదిలాడు.

డాక్టరు మాధవి గేటుదగ్గరే కలిసింది. ఆమె సాధారణంగా ఎవరినీ సాగ నంపటానికి రాదు స్నేహితులో-ఆప్తులో అయి ఉండాలి ఆ వచ్చినవాళ్ళు. మెల్లగా లోపలికివెళ్ళి బల్లమీద కూర్చున్నాడు ఆమె తిరిగివచ్చేవరకూ.

"మా అమ్మాయి కాంచన ఎట్లా ఉందంటారు డాక్టరుగారూ!'' చేతులు జోడిం చాడు ఆమె లోపలికి రాగానే.

"ఇటీవల వచ్చి పరీక్షచేయించుకుంది. ఆరోగ్యంగానే ఉంది. మీరు చెప్పమన్నట్టుగానే చెప్పాను " ఆమె ఒక కుర్చీ దగ్గరకు లాక్కుంది

"నా పరిస్థితి అయోమయంగా ఉంది డాక్టరుగారూ మా కాంచన దాని మాట తప్ప మన మాట ఆలోచించదు ఈ తిక్కపిల్లతో ఈసమస్య పరిష్కార మెట్లా అవుతుందో అర్థంకావటంలేదు ఇంటావిడతో ఆలోచించటానికి వీల్లేదు. ఆమెదొక్కటేపట్టు. ఇటు కాంచనదీ ఒకటే పట్టుదల". రెండు చేతులతో తల పట్టుకున్నాడు.

"ఇప్పుడు కాకపోతే పురిటిసమయానికయినా కాంచనకు చెప్పాల్సిందే కదండీ. గర్భస్రావాన్ని ప్రభుత్వం చట్టం చేస్తున్నదంటే అందరికోసమా? విషమపరిస్థితులలో గర్భస్రావం చేసుకోవచ్చు బాంగ్లాయుద్ధంలో సంభవించిన విపత్తులో ఎందరో గర్భస్రావాలు చేయించుకున్నారు. నేను ఈ సంగతులన్నీ కాంచనకు చెప్పాను. తనకేం ఖర్మ అంటూ వాదించాను " డాక్టరు లేవబో యింది.

"ఏంచెయ్యను డాక్టర్. ఏంచెయ్యను? దానికీ పిచ్చి ఎట్లా పోతుందోగాని-నేను

చెప్పి వినిపించలేకుండా ఉన్నాను." డాక్టరు తీరికగా ఉన్నట్టు తోచింది విశ్వనాథానికి అక్కచెల్లెళ్ళతో చెప్పుకున్నట్టుగా తన సొదంతా చెప్పుకుని ఊరట పొందాలనిపించింది.

"ఇప్పుడు తనను ఉన్నదాన్నున్నట్టుగా మెడ్రాసు తీసుకెళ్ళి సినిమాలో పాడటానికి ఛాన్సు ఇప్పించమంటుంది. నేనేం చెయ్యాను చెప్పండి డాక్టరుగారూ?" నొసలుపట్టుకున్నాడు.

"దీనికంత బాధపడతారేం? సినిమాలలో పాడటానికి ప్రయత్నాలు చెయ్యటం ఒకనాడూ రెండునాళ్లూ అనుకుందేమో. కొందరు సంవత్సరాల పర్యంతమూ చేస్తూనే ఉంటారు. నెత్తిమీద చేతులుపెట్టుకుని తిరిగి వచ్చేవరకూ డబ్బుకూడా ఖర్చుచేస్తూనే ఉంటారు. మీరు ఉద్యోగం వదలుకుని వెళ్ళాల్సిన పనిలేదు కనుక ఎన్నాళ్ళయినా ఉంటారనుకోండి. ఇంకా నాలుగునెలల్లో పురుడు వచ్చేస్తుంది. కొత్తచోట ఎట్లా వీలవుతుంది? ఇదంతా అమ్మాయికి చెప్పండి."

"పురిటిమాటే ఆలోచించాలిగాని-కాంచన పాటను గురించి ఆలోచించాల్సిన పనిలేదు డాక్టరుగారూ. దాని పాట వినగానే సినిమాలలోకి తీసుకుంటారు. నాకేం సందేహంలేదు. కాని దాని జీవితానికి పాట ముఖ్యంకాదు" విశ్వనాథం కాంచనను గురించి పూసగుచ్చినట్టు చెప్పాడు.

అంతా విన్న తరువాత డాక్టరు నవ్వింది. పురుడు అయ్యేవరకూ కాంచనను ఆపమని చెప్పింది

ఇంటికి తిరిగివస్తూ విశ్వనాథం తలగోక్కున్నాడు. పెళ్ళికానివాళ్ళకు పెళ్ళి సమస్యలను గురించి ఏం తెలుస్తుంది? పరిష్కారమార్గాలు వాళ్ళకెట్లా తెలుస్తాయి? దిగువ మధ్యతరగతి కుటుంబీకుడూ-ఆయన సాంసారికసమస్యలూ ఆమెకెట్లా తెలుస్తాయి? ఆమె సూచించిన పరిష్కారమార్గాలు వీళ్ళకు సరిపడతాయా?

విశ్వనాథం వచ్చేటప్పటికి పిల్లలంతా భోజనాలుచేసి పడుకున్నారు. విశాలాక్షమ్మ వంటఇంటి గడప దగ్గరగా కూర్చుని మరునాటి కూరకోసం గోరుచిక్కుడుకాయలు తుంచుతున్నది.

ఇంట్లో అడుగుపెడుతుండగానే సన్నగా వినబడుతున్నది కాంచన పాడుతున్న అష్టపది.

అనుకోకుండానే ఆయన తల అడ్డంగా ఊగింది రెండుసార్లు

7

పరీక్షలకు ముందు రమణ తల్లి వ్రాసిన ఉత్తరమందుకుని ఇంటికి వెళ్ళాడు.




"నీ చేతి కమ్మని భోజనం ఇవాళ చేశానమ్మా ఇన్నాళ్ళకు." రమణ మాటలకు ఆమెకు కళ్ళనిండా నీళ్లు తిరిగాయి. తన కొడుక్కు కమ్మటి భోజనం కరవైందంటే ఆమెకు కడుపులో శూలం గుచ్చినట్లయింది. ఈ కొడుకును తను కంట్లో వత్తులు వేసుకుని పెంచింది. కొడుకూ కోడలు సుఖంగా ఉన్నారనుకుంటే పరీక్ష చదువు పెట్టుకున్నాడు. ఒంటరిగా కానిదేశాలలో ఉండి కడుపునిండా తిండిలేక నల్లబడి చిక్కి సగమైనాడు. ఆమె అతడి తల తడిమి కళ్లు తుడుచుకుంది. అంతలో ఆమె కళ్ళు సంతోషంతో మిలమిల్లాడాయి.

"రమణా! మీ నాన్న మళ్ళీ పుట్టబోతున్నారు. కాంచనను చూసివచ్చావా?" కొడుక్కు మంచంమీద పక్క వేసింది.

ఉలిక్కిపడ్డాడు రమణ. నాన్న పుట్టటమేమిటి? వింతగా చూశాడు తల్లి ముఖంలోకి.

"వెర్రి నాయనా! అర్థంకాలేదూ? కోడలు కడుపుతో ఉన్నదని మీ మామగారు వచ్చి చెప్పివెళ్ళారు. రెండు మూడు నెలల్లో పురుడు వస్తుంది. ఈలోపల వెళ్లు" తన పక్క కూడా వేసుకుని పడుకున్నది

రమణ గుండెల్లో రైళ్లు పరుగెత్తుతున్నాయి. మనసులో లెక్కలు కడుతున్నాడు-కాంచన వెళ్ళి ఎన్నాళ్లయింది? తనకు ఉత్తరం వ్రాయదేం? అసలీమాట నిజమా? మాటా పలుకూ లేకుండా నిర్లక్ష్యంగా వెళ్ళిపోయిన కాంచన – వెళ్ళి ఉత్తరమ్ముక్కయినా వ్రాయటానికి ఇష్టపడని కాంచన ఎట్లా ఉంటే తనకేం?

సర్దుకుపోతున్నాడు కదా అని చెవులకు పిడకలు కట్టింది. తప్పదు – అమ్మకు పెళ్ళికాకముందు ఇచ్చినమాట మీరక తప్పదు. నిద్రలోకి జారిపొయ్యాడు

తల్లిదగ్గర ఉన్న వారంరోజులు రమణ అన్యమనస్కంగానే ఉన్నాడు. ఇంటి వ్యవహారాలు తల్లిచెప్పినవేవో విన్నాడు. పరిష్కారమార్గాలు ఆమెపైననే పెట్టాడు. అతడు తిరిగి వచ్చేటప్పటికి స్వర్ణ వ్రాసిన ఉత్తరాలు రెండు బల్లమీద ఉన్నాయి.

మొదటి ఉత్తరంలో సినిమాలో పాటలుపాడే ప్రయత్నాన్ని గురించి వ్రాసింది. తప్పకుండా ఛాన్సు లభిస్తుందనే నమ్మకంతో ఉన్నదట. ఆ ఒక్క ఆశయమూ ఫలిస్తే తన జీవితం ధన్యమైనట్లే ననుకుంటోందట.

రెండో ఉత్తరం చాలా దీర్ఘంగా ఉన్నది. తనకంతా ఏమిటో–అయోమయంగా ఉందట సినిమాలో పాటలుపాడే ఛాన్సు రాకముందే చచ్చిపోతానేమోనని పిస్తోందిట. ఇంతవరకూ నిస్సారంగా ఉన్న తన జీవితంలో సినిమాఛాన్సు కలిసివస్తే బ్రతుకుపండినట్లనుకుంటుందట. మధ్య మధ్య ఏదేదో వేదాంతం వ్రాసింది. చివరకు "నా మనసులోనిమాట చెప్పుకోవటానికి ఎవరున్నారు మీరు తప్ప!" అంటూ ముగించింది.

రమణకు కడుపులో చెయ్యిపెట్టి కలిపినట్లయింది పాపం! ఎవరో రసవిహీనుణ్ణి కట్టుకుని ఉంటుంది. ఆమె కళాహృదయాన్ని ఆరాధించలేని, అర్థంచేసుకోలేని జడుడు దొరికి ఉంటాడు. చల్లటి–తియ్యటి పలకరింపులకు కరిగిపోయే స్త్రీ హృదయాన్ని పురుషుడు ఎప్పుడు అర్థంచేసుకుంటాడు! సుకుమారమైన స్త్రీల హృదయాలెన్ని ఈ మొరటు పురుషుల కర్కశపాదాల క్రింద నలిగిపోతున్నాయో! రమణకు అప్పటికప్పుడు స్వర్ణదగ్గరికి రెక్కలు కట్టుకుని వాలాలని పించింది.

రమణ పరీక్షలు సమీపిస్తున్నకొలదీ చదువుమీద ధ్యానం ఎక్కువచేశాడు. మిగతా విషయాలన్నీ పక్కకు నెట్టివేశాడు. కాంచనమాట పూర్తిగా మనసులో నుంచి తుడిచివేశాడు. స్వర్ణను గురించి పరీక్షలయిన తరువాత ఆలోచించి ఒక నిర్ణయానికి రావాలని నిశ్చయించుకున్నాడు

వారంరోజులు గడిచీ గడవకముందే తల్లి వ్రాసిన ఉత్తరం వచ్చి కలవరపెట్టింది. కాంచనకు ఏడవనెల వచ్చింది కనుక ఒకసారి వెళ్ళి చూడమని పదే పదే వ్రాసింది. అతడికి ఆ కార్డు చూడగానే నరాలు బిగుసుకుపోయినట్లయింది. అందులోనే ఏదో కుతూహలం–తన వస్తువేదో ఎక్కడో మెదులుతున్నదన్న



భావన-తనకేదో గొప్ప పదవి-హోదా కలగబోతున్నాయన్న సంభ్రమం-అతడి కేమీ తోచకుండా చేశాయి. మరి కాంచన? అర్థంలేని వాదన-పెడమతం - జీవితంలో తనకు నిజంగా ఏంకావాలో తెలుసుకోలేని ఆడది! తను సుఖపడలేని-ఎదుటివారిని సుఖపెట్టలేని చాదస్తపు ఆడది! తలా తోకా తెలుసుకోలేని మనుష్యులను ఎందుకు సృష్టిస్తాడో దేవుడు?

కాంచనతో కాపురంచేసిన రోజులు తలుచుకుని తలుచుకుని అతడు అలసిపోయాడు. రెండు రోజులవరకూ చదువు సాగలేదు-మనసూ కుదటపడలేదు. మధ్య మధ్య విశ్వనాథం జ్ఞాపకం వస్తున్నాడు. రమణకు ఆయనమీద గౌరవం -అభిమానం పెళ్ళిమాటలు జరిగినప్పటినుంచీ కలుగుతూ వచ్చాయి. ఏ విషయంలోనూ ఆయనకు బాధకలిగేటట్టు నడవటానికి అతడి మనసు అంగీకరించదు. ఆయనవంటి తండ్రి తనకుండే బాగుండుననుకుంటూ ఉంటాడు. కాని-ఆయన కోసం ఆ పొగరుబోతు కాంచనను భరించటమా? రమణకు తలలోని నరాలు చిట్లిపోతున్నట్టు బాధ-కీళ్ళన్నీ సడలిపోతున్నట్లు-మెలితిప్పినట్లు బాధ-నరక యాతన అనుభవించాడు.

## 8

స్కూలునుంచి సరాసరి తన స్నేహితురాలు నీరజ యింటికి వెళ్ళి చీకటి పడేవరకూ ఉండి ఇంటికి వచ్చింది కాంచన. నలుగురు బిడ్డల తల్లి అయిన

నీరజ కాంచనను ఎగాదిగా చూసి "ఇంత ముందుగా పంపించారా పురిటికి మీ వారు? మొదటిసారి కనుక భయపడుతున్నావా కాంచనా?" అడిగింది.

కాంచనకు ఒంటిమీద తేళ్ళూ జెర్రులూ పాకినట్లయింది. అంతలో రోషము పొడుచుకువచ్చింది. అందరిలా తను కూడా ఇష్టంలేకపోయినా పిల్లలను కంటా ననుకుందేమో నీరజ? నీరజ కూడా చాలామంది ఆడవాళ్ళ మాదిరిగా తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోలేని వట్టి సామాన్యురాలు. అలాకాక ఇంకేమనుకుం టుంది మరి?

"నీరజా! అందరి దృష్టిలో ఎంతో మంచివనుకున్నవాటిని కూడా నా దృష్టిలో విలువలేకపోతే ఆదరించను. నీవు నన్ను చూసి ఏమేమో అనుకుంటు న్నావు-కాని అంతా ఉత్తది. కడుపులో ట్యూమరువంటిదేదో పెరుగుతున్నది. ఇంకా రెండు మూడు నెలల్లో నాకు పెద్ద ఆపరేషన్ చేస్తానంది డాక్టరు. ఈ లోపల మందులతో తగ్గించటానికి ప్రయత్నిస్తానని చెప్పింది. వీటికి అలవి కాక పోతే ఆపరేషను ఉండనే ఉంది." నసుగులేకుండా చెప్పింది జవాబు కాంచన.

పగలబడి నవ్వింది నీరజ. "పిచ్చిదానా! ఎవరే నీకట్లా చెప్పింది?"

కాంచన ఉక్రోషము పట్టలేకపోయింది. "అందరిలా నేను ఏ మాట పడితే ఆ మాట నమ్మే మనిషిననుకున్నావా?" విసురుగా లేచివచ్చిన కాంచన మరు నాడు ఉదయము స్కూలుకు వెళ్ళకుండా గవర్నమెంటు హాస్పిటల్‌కు వెళ్ళి డాక్టరుతో సంప్రదించింది.

"తప్పు లెక్కపెట్టుకున్నావమ్మాయీ. ఏడవనెల నిండబోతున్నది." చీటీ మీద వారాలు వ్రాసి కాంచనచేతి కిచ్చింది డాక్టరు.

పాలిపోయిన ముఖంతో ఆ గుంపులోనుంచి బైటపడ్డది కాంచన. ఏమయినా తన కక్కర్లేదీ గర్భము. తన కీ సంతానం వద్దు లేదు లేదు అంటూ డాక్టరు మాధవి తనను మోసంచేసింది. లాభంలేదు-ఆమె తనకింక సహాయము చేయదు. తలవంచుకుని విసురుగా నడుస్తున్న కాంచనకు గేటుదగ్గరే బస్సు దొరి కింది.

పన్నెండు గంటలకు ఇంటికివచ్చిన కాంచన అన్నం తినకుండా మంచంమీద వాలిపోయింది. విశాలాక్షమ్మ రెండుసార్లు వచ్చి ఒంటిమీద చెయ్యేసి పలకరిం చింది.

"అమ్మా నన్ను పడుకోనియ్యమ్మా" విసుక్కుంది కాంచన.

"నీవు ఇప్పుడు పొద్దుపోయి భోజనం చేయకూడదమ్మా. నీకెంతతోస్తే అంత

చేస్తావు కాని ఒకరు చెప్పింది వినవు. నీవేం వట్టిమనిషి వనుకుంటున్నావా?" తటా లున అని నాలుక కొరుక్కున్నది విశాలాక్షమ్మ.

మంచంమీద గోడవైపుకు తిరిగి పడుకున్న కాంచన అదిరిపడి లేచి కూర్చుంది.

"ఏమిటేమిటే? మళ్ళీ అను!" కేకపెట్టింది.

"అమ్మా కాంచనా! నీతో ఏదొల్చినా కష్టమేనే తల్లీ. అసలే నీకు ఒంట్లో ఒకమాదిరిగా ఉంటోంది కదా—తొందరగా అన్నం తిన మన్నాను. ఇదికూడా తప్పుమాటేనా చెప్పు?" నడుముమీద చేతులు పెట్టుకుని నిలబడిపోయింది విశాలాక్షమ్మ.

గదంతా చీకటిచేసుకుని కళ్ళమీద చేతులు పెట్టుకుని - అతలాకుతలమైపో తున్న మనసును అదుపులో పెట్టుకోటానికి ప్రయత్నించి అలిసిపోయింది కాంచన. కళ్లు మంటలు పుడుతున్నాయి నాడి వేగంగా కొట్టుకుంటోంది. పక్క మీద అటూ ఇటూ దొర్లుతున్నది. పరిష్కారమార్గము తోచలేదు. ఆవేదన మాత్రము ఎక్కువవుతున్నది.

ముఖంమీద వెలుగు పడినట్లయి తటాలున కళ్లు తెరిచింది కాంచన. ఎదు రుగా పనిమనిషి ఎల్లమ్మ. ఎల్లమ్మనుచూస్తే కాంచనకు ఎంత చిరాకో ఎల్లమ్మకు కాంచనంటే అంత ఇష్టము అమ్మాయిగారూ అమ్మాయిగారూ అంటూ వెంట వెంట తిరుగుతూ ఉంటుంది. ఎల్లమ్మను వదిలించుకోటానికి కాంచన పావలా అర్ధా ఇస్తూ ఉంటుంది. ఎల్లమ్మ అమ్మాయిగారూ అనగానే లేచి కూర్చుంది కాంచన.

"ఇదిగో పావలా. తమలపాకులు కొనుక్కో." చేతిలో పెట్టింది. విప్పారిన ముఖంతో ఎల్లమ్మ డబ్బులు కొంగున ముడివేసుకుంటుంటే కాంచన కేదో ఆశ గలిగింది.

"ఎల్లమ్మా ఇట్లా రా." దగ్గరికి పిలిచి చెవిలో చెప్పింది. అరగంటవరకూ ఇద్దరూ గుసగుసలాడుకున్నారు. కాంచన పర్సులోనుంచి తీసి పదిరూపాయలు ఎల్లమ్మ చేతిలో పెట్టింది. మరో పదిరూపాయలు తరువాత ఇస్తానని మాట ఇచ్చింది.

గబగబా ముఖం కడుక్కొని తలదువ్వి బొట్టుపెట్టుకుని అన్నం వడ్డించు కుంటున్న కూతుర్ని చూసి విశాలాక్షమ్మ నవ్వుకుంది. "అన్నం చల్లారిపోయింది

గాని—చారు వేడిచేస్తానుండు కాంచనా" అంటూ చారు వేడిచేసి తీసుకువచ్చింది. చిక్కటి మజ్జిగకప్పుతో పళ్లెందగ్గర పెట్టింది.

"అమ్మాయీ, ఇవాళ స్కూలుకు వెళ్ళలేదేం? నీవు లేనప్పుడు ఇద్దరు పిల్లలు వచ్చివెళ్ళారు" అన్నది విశాలాక్షమ్మ.

"లేదమ్మా. నా స్నేహితురాలు ఏవో బట్టలు కొనాలని నిన్న చెప్పింది. ఇవాళ వెళ్ళి బట్టలు కొన్నాం" అతికినట్టే చెప్పింది చక్కటి అబద్ధాన్ని.

తల్లి వంటింటి కడపముందర కూర్చుంది. కాంచన తలవంచుకుని అన్నం తింటుంటే విశాలాక్షమ్మ తలలో అనేకరకాల ఆలోచనలు అల్లిబిల్లిగా అల్లుకు పోవటం మొదలుపెట్టాయి. కాంచన పురిటికి తనకు సహాయంగా వియ్యపురాలిని పిలవటమా? లేక ఇరుగుపొరుగులతోనూ ఇంట్లో పిల్లలతోనూ గడుపుకోవటమా? కాంచన ఒకరు చెప్పితే వినేపిల్ల కాదు—కాంచన కిష్టంలేకపోతే వియ్యపురాలిని పిలవటమెట్లా? ఆమెను అవమానపరచి పంపించివెయ్యగల పిల్ల. ఆలోచనలు ఒక రూపానికి రాకముందే విశ్వనాథం పిలిచాడు గ్లాసెడు చల్లటి మంచినీళ్ల కావాలంటూ.

రాత్రి పన్నెండుగంటల సమయంలో విశాలాక్షమ్మ అదిరిపడి లేచింది. కాంచన కాళ్లు మంచానికేసి కొట్టుకుంటున్నది. రెండుచేతులతో కడుపు పట్టుకుని బాధపడుతున్నది. ఆపుకోలేక మూలుగుతున్నది.

"ఏమిటమ్మా!" తల్లి ప్రాణం తల్లడించింది. ఆమెకు కాళ్లు గజగజ వణుకు తున్నాయి.

"కడుపునొప్పెమ్మా" మెలికలు తిరిగిపోతున్నది కాంచన.

విశాలాక్షమ్మ వెళ్ళి విశ్వనాథాన్ని పిలుచుకువచ్చింది.

"డాక్టర్ని పిలుచుకువస్తారా? బిడ్డ ఆగలేక తన్నుకుంటున్నది." విశాలాక్షమ్మ కళ్ళల్లో నీళ్ళు విశ్వనాథాన్ని పరుగులు తీయించాయి. ఆ రాత్రివేళ వచ్చిన మగడాక్టరు ఒక ఇంజక్షను ఇచ్చి తెల్లవారిన తరువాత మళ్ళీ వస్తానన్నాడు.

విశాలాక్షమ్మ కూతురు మంచంమీద కూర్చుని ధైర్యము తెచ్చుకోటానికి ప్రయత్నిస్తున్నది. కాంచన మూలిగినప్పుడు—అమ్మా అని కేకలు పెట్టినప్పుడు చేతులతో ముఖం మూసుకుంటున్నది. విశ్వనాథం సావడిలో ఇటునుంచి అటూ —అటునుంచి ఇటూ పచార్లుచేస్తున్నాడు. కాంచన పెడుతున్న కేకలు అయనను అదలగొడుతున్నాయి.

తెల్లవారుఝామున వచ్చిన విశ్వనాథానికి తలుపుతీస్తూ డాక్టరు అడిగాడు "ఎలా ఉందండీ అమ్మాయి?"

"పిల్లపడే బాధ మేము చూడలేకుండా ఉన్నాము డాక్టరుగారూ!"

"అది ఇంక నిలవదండీ. బాగా కదలిక వచ్చేసింది. ఈ మాత్ర ఇవ్వండి. నిద్రపట్టవచ్చు" చేతిలో పెట్టాడు.

విశ్వనాథానికి డాక్టరు చెప్పిన మాటలవల్ల తృప్తి కలగలేదు. "డాక్టరుగారూ నిలవటానికి మరొక ఇంజక్షను ఇస్తారన్న ఆశకొద్దీ వచ్చాను." ఇంకా అక్కడే నిలబడ్డాడు.

"లాభంలేదండీ. నేను తెల్లవారగానే వచ్చి చూస్తాను" కాంచనకు కాన్పు అయిపోతుందని వివరాంలోసహా చెప్పాడు డాక్టరు.

విశ్వనాథం కాళ్ళీడ్చుకుంటూ వాకిట్లోకివచ్చి రిక్షాకోసం చూశాడు. అతడు దిగిన రిక్షా వెళ్ళినట్టున్నది. ఆ రెండుమైళ్ల దూరం కాళ్ళీడ్చుకుంటూ నడిచాడు.

విశ్వనాథం ఇంటికి వచ్చేసరికి ఇంటినిండా దీపాలు వెలుగుతున్నాయి. పిల్లలుకూడా లేచినట్టున్నారు. సందడిగా ఉన్నది. ఎల్లమ్మకూడా వచ్చి కాంచన గదిలో కూర్చున్నది.

"ఆకారమంతా ఏర్పడిందమ్మగారూ. కాంచనమ్మలాగే ఉండది."

"ఎట్లా ఉంటేనేం? దక్కనిదానికి." విశాలాక్షమ్మ కళ్ళు ఒత్తుకుంటూ గదిలో నుంచి ఇవతలికి వచ్చి విశ్వనాథాన్ని చూసి బావురుమన్నది.

డాక్టరు వస్తూనే కాంచనకు ఒక ఇంజక్షను ఇచ్చాడు. వేడి వేడి కాఫీ ఇప్పించి వెళ్ళిపోయాడు. అప్పుడు పడుకున్న కాంచనకు సాయంత్రం ఐదుగంటలకు మెలకువ వచ్చింది. ఒళ్లంతా అలసటగా ఉంది. ఏదో బాధగా ఉంది.

కాంచన గర్భంమీద చెయ్యివేసుకుని చూసుకుంది. పచ్చిపుండులా ఉంది. కాని—కాని—తాను తలచుకున్నపని జరిగిపోయింది. తను రమణతో కాపురంచేసిన చిహ్నాలేవీ లేవు. దాని నాసరగాచేసుకుని రమణ తనను లోబరచుకోలేడు. ఇప్పు డతనికీ తనకూ ఎటువంటి అనుబంధాలూలేవు. ఈ మూడేళ్ళ కాపురం ముచ్చట్లూ తాను మరిచిపోగలిగితే తాను ఎప్పటి కాంచనే.

ఆమె మనసు చాలా నిర్మలంగా ఉన్నదిప్పుడు. ఈ పదిరోజులూ గడచిన తరువాత తన సంగీతకార్యక్రమాలను గురించి ఆలోచించాలి. ఈ రేడియో స్టేషనులోనే పాటలు పాడుకుంటూ గుడుగుడు గుంజంలా ఉంటే ఏం లాభం? తండ్రిని ఒప్పించి చిత్రసీమలో అడుగుపెట్టాలి. అన్నిటికంటే ముఖ్యమయినది

పాణికి ఉత్తరం వ్రాయటం. పాణికి సంగీతమంటేనూ అందులో తన గాత్రమంటే ప్రాణము. అతడికి ఉత్తరంవ్రాస్తే అతడే తన వెంట మెద్రాసు రావచ్చు. తనకు కావలసిన ఏర్పాట్లు అతడే స్వయంగా చేయవచ్చు. తిరిగి నిద్రలోకి జారిపోయింది కాంచన.

తెల్లవారి లేచేసరికి ఒళ్ళంతా ఖారకించినట్టుగా ఉంది కాంచనకు. కణతలు కొట్టుకుంటున్నాయి. కళ్ళు ఎర్రబడ్డాయి. తపనగా ఉంది. థెర్మామీటరు నూట నాలుగు డిగ్రీల ఉష్ణాన్ని చూపించింది.

ఈసారి డాక్టరు మాధవిని తీసుకువచ్చాడు విశ్వనాథం

"కాంచనా! అనుకున్నపని సాధించావే? కాని చాలా పాతపద్ధతి - అనాగరిక మైన పద్ధతి-అలగాజనం అవలంబించే పద్ధతిని అవలంబించావు ప్రాణాలుకూడా పోతాయి ఒక్కోసారి. తరువాత ఎన్నో బాధలు కలుగుతాయి ఒక్కోసారి. ఇది సెప్టిక్ అయి వచ్చిన జ్వరం." డాక్టరు మాధవి తన వైద్యం ప్రారంభిం చింది.

డాక్టరు వెళ్ళిపోయిన తరువాత అన్నిసంగతులూ విశ్వనాధానికి చెప్పి కూతురు అఘాయిత్యానికి తెగ తిట్టిపోసింది విశాలాక్షమ్మ.

పాలిపోయిన చెక్కిళ్ళతో పలచబడిపోయిన తలకట్టుతో నల్లబడిపోయిన కాంచన బాగా కోలుకునేసరికి దాదాపు నెలరోజులు దాటింది. ఊరికే పక్కమీద పడుకుని ఆలోచిస్తూ ఉంటుంది. స్కూలుటీచరు ఉద్యోగం పోయినట్టు తెలిసినా ఆమె మనసు బాధపడలేదు. తానీ స్థితిలో ఉండగా రేడియో ప్రోగ్రాం వచ్చింది. ఆమెకు వెంకట్ తో కలిసి యుగళగీతాలు పాడటమంటే ఎంతో ఇష్టం తమ ఇద్దరి కంఠాలు కలిస్తే అమృతసోనలు కురిపిస్తాయి. పాణి వింటే ఎంత ఆనంద పడతాడు! తనకెంత తృప్తి?

కాని రేడియో ప్రోగ్రాము చెయ్యిదాటిపోయింది. కాంచనకు చాలా బాధ కలిగింది.

కాంచన వ్రాసిన రెండు ఉత్తరాలకు పాణి జవాబులు అనుకున్నట్టుగా వేళకు రాలేదు.రానిసందర్భాలలోకాంచన తలుపులువేసుకుని-గదిలో ఒక్కతేకూర్చుని-పాణి దగ్గర్నించి తనకు వచ్చిన ఉత్తరాలను చదువుకుంటుంది. ప్రాణంలేని అక్షరాలు ఆమెలో నూతనోత్సాహాన్ని కలిగించి-ఉత్తేజపరచి ఏవేవోలోకాలకు తీసుకువెళ్తాయి. ఆనాడు కట్టవిప్పింది. అన్నిటిలోకి ఉద్వేగపూరితమైన ఉత్తరం చేతిలోకి తీసుకుంది.

పెద్దగజదొంగననిపించుకోవాలని
వాడి తాపత్రయం



జీవితంలో మనిషిని నిజంగా బ్రతికించేది ఏది? అన్నం-నీళ్లు-డబ్బు, కాదు. ఇటువంటి ఉత్తరాలు. వీటిలో ఉన్నదంతా అమృతం. పోయే ప్రాణాలనుకూడా నిలబెట్టగలిగిన అమృతం. తనకు జీవితంలో అందరూ కోరుకునేవి లేకపోవచ్చు -కాని అమృతాన్ని కురిపించే ఈ ఉత్తరాలు ఉన్నాయి. వాటిని హృదయాని కానించుకుని-కళ్ళకద్దుకుని తిరిగి దంతపుపెట్టెలో యథాప్రకారం సర్ది రిబ్బను కట్టి తన పెట్టెలో భద్రపరచుకున్నది కాంచన.

తన బామ్మ పేరు బంగారమ్మ. అదే కాస్త మార్చి అర్థము చెడకుండా తండ్రి కాంచన అని పెట్టాడు. దానికే పర్యాయపదమైన "స్వర్ణ"ను తన కలంపేరుగా వాడుకుంటోంది తను. కాంచన-స్వర్ణ. దాగుడుమూతలాడుతున్నట్టుగా ఉంది. కాంచనగా జీవితంలో పోగొట్టుకున్నవన్నీ స్వర్ణగా సాధించాలని ఆమె నిర్ణయం. వీటిని గురించే ఆలోచిస్తూ పడుకుంది

జూన్ నెల. ఆ రాత్రి కుంభవర్షం కురిసింది. తీక్షణమైన ఎండలకూ తాపానికీ తట్టుకోలేని జనమంతా ఆ వర్షానికి ఆనందించారు. కాలం చల్లబడిపోయింది. కాంచన మనసులో వెనుకటి కోరిక తిరిగి బయలుదేరింది. చల్లబడిన కాలం ఆ కోరికతోపాటు ఆమెలో మానుబట్టిన గాయాలను రేపటం మొదలుపెట్టింది.

ఎట్లాగయినా మెడ్రాసు వెళ్ళాలి. చిత్రజగత్తులో తానొక నేపథ్యగాయనిగా ధృవతారగా వెలగాలి. ఈలోపల ఒక్కసారి వీలయితే పాణిని చూడాలి. అతడు ప్రాణమిచ్చే గాయని చిత్రసీమకు నేపథ్యగాయని కాబోతున్నదంటే అతడికెంత గర్వంగా ఉంటుంది?

విశాలాక్షమ్మకు కాంచనను చూస్తుంటే మతిపోతున్నది. కాంచన తరువాత

పిల్ల యామినికి పెళ్ళి ప్రయత్నాలు చేయాలంటే తాడూ బొంగరం కనబడటం లేదు, ఆమె తన అన్నగారి ఊరువెళ్ళి ఆయన కాళ్ళూ కడుపూ పట్టుకుని తన కొడుక్కి చేసుకోమని వేడుకోవాలనుకుంటోంది ఏడాదినుంచీ. ఏవో అవాంతరాలు వస్తూనే ఉన్నాయి ఆమె ప్రయాణానికి. కాంచన ఆమె తొలి సంతానం. మమత ఎక్కువ. కాని విశాలాక్షమ్మ తన మమతను అందరు తల్లులవలె పైకి కనబరచే మనిషికాదు. అయినా ఈసారి ఈవిధంగా పుట్టింటికివచ్చి ఎవరికీ అర్థంకాకుండా ప్రవర్తించటం ఆమెకు చాలా చికాకు కలిగిస్తోంది. కాంచనచేసిన ఈ అఘాయిత్యానికి ఆమె కోపం తారామండలానికి చేరుకుంది.

"నేను ఈ సాయంత్రము రైలులో మా అన్నయ్యదగ్గరికి వెళ్లుతున్నాను. బట్టలు సర్దుకున్నాను. టికెట్టు ఇప్పించి నన్ను పెద్దవాడు రైలెక్కించి వస్తాడు" చెప్పులు వేసుకుని బైటికి వెళ్ళే ప్రయత్నంలో ఉన్న విశ్వనాథాన్ని ఆపి చెప్పింది విశాలాక్షమ్మ.

"ఇవాళా? ఎందుకు?" తలగోక్కున్నాడు.

"ఎందుకో మీకూ తెలుసు. ఇన్నాళ్ళూ కాంచనకోసం ఆగాను. ఇప్పుడు కాంచన కోలుకుంటోంది."

"విశాలీ! నాకూ తెలుసుననుకో. ఈ కాంచన సంగతి కాస్త తేలేవరకూ నిదానించు. అల్లుడి పరీక్షలు అయిపోవచ్చాయని తెలిసింది. కాస్త నిదానించు." వాకిట్లోకి అడుగుపెట్టాడు.

"ఆగండి ఆయన పరీక్షలయిపోగానే ఈమెను తీసుకువెళ్తాడని నమ్ముతున్నారా? తప్పంతా మనదగ్గర ఉంచుకొని అతడి పరీక్షలమీద నెపం వెయ్యటమెందుకు?" కంఠం హెచ్చించింది.

"అతడెక్కడున్నాడో తెలియందీ ఎక్కడికని వెళ్లుతుంది?" కర్కశంగా అన్నాడు విశ్వనాథం.

"ఆఁ, అలా పిల్లలను వెనకవేసుకువచ్చి పాడుచేయండి. అతడికి ఉత్తరాలు వ్రాస్తోందా? ఈ మాట మీరెప్పుడైనా అడిగారా?"

"అతడెందుకు వ్రాయడు?"

"అసలెందుకు వచ్చిందిక్కడికి? చెప్పి వచ్చిందనుకోను. మీరు దానికి తెలియచెప్పవలసిన బాధ్యతకలవారు. దానిని తీసుకువెళ్ళి అతడి తల్లికి ఒప్పగించండి. ఆమె కొడుకు ఎక్కడుంటే అక్కడికే పంపుతుంది!"

"అయితే ఆలోచిద్దాం ఆగుమరి. ఆమెకు ఉత్తరంవ్రాసి కనుక్కుందాం."

విశాలాక్షమ్మకు ఇటువంటి విషయాలలో విశ్వనాథం త్వరగా నిర్ణయాలు తీసుకోడని తెలుసు. కాని-కాంచన విషయంలో ఆమె చాలా పట్టుదలగా ఉంది. ఒకబిడ్డమీది మమత మరొకబిడ్డ భవిష్యత్తుకు అడ్డురాకూడదు. విశ్వనాథం తాత్సారం చేస్తున్నకొద్దీ ఆమెకు ఏ విషయంలోనయినా పట్టుదల హెచ్చవుతూ ఉంటుంది.

"ఉత్తరం వద్దు ఏంవద్దు. కాంచనను వెంటపెట్టుకుని వెళ్లండి. ఆమె తొందర పడే మనిషికాదు." గిర్రున వెనక్కి తిరిగి గతుక్కుమన్నది.

కాంచన తలదువ్వుకుంటూ నిలబడ్డది.

విశ్వనాథం తల వంచుకుని గబగబా ముందుకు సాగిపోయాడు పాలి పోయిన ముఖంతో. విశాలాక్షమ్మ ముఖం పక్కకు తిప్పుకుని వంటయింట్లోకి వెళ్ళిపోయింది.

అవమానంతో ముఖం ఎర్రబడిపోయింది కాంచనకు. రోషం బుస్సున తలె త్తింది. చటుక్కున గదిలోకి వెళ్ళి తలుపులు వేసుకుని మంచంమీద పడుకుని ఆలోచించటం మొదలుపెట్టింది. పాణి అడ్రసు తనదగ్గరే ఉంది. ఉన్న పళంగా అతడి దగ్గరికి వెళ్ళిపోతే? వెళ్ళి ఎదురుగా నిలబడితే అతడే తన భవి ష్యాన్ని నిర్ణయిస్తాడు.

దిగ్గునలేచి పాణికి ఒక ఉత్తరం వ్రాసింది. ఏదో పనిమీద ఆ ఊరు వస్తు న్నది కనుక అతడిని ఏ ప్రదేశంలో కలుసుకోమంటాడో వివరాలతోసహా వెంటనే తెలపమని సుదీర్ఘమైన లేఖ ఒకటి వ్రాసింది.

ఆమె ఆలోచనలకు ఒక పరిష్కారమార్గం దొరికింది కనుక మనసు ప్రశాం తంగా ఉన్నట్లనిపించింది. వెంటనే లేచి వంటయింట్లోకి వెళ్ళింది. విశాలాక్షమ్మ మసాలాపొడి దంచుతుంటే ఆమె చేతిలోనుంచి తాను తీసుకుని దంచింది.

"అమ్మా, నీవు మావయ్యగారి ఊరు వెళ్ళాలనుకుంటున్నావుగా. వెళ్ళు. వాళ్ల పార్థుకు యామినిని చేసుకోమని అడుగు. పార్థు ఇక్కడికి వచ్చినప్పుడు వాళ్లిద్దరూ స్నేహంగా తిరిగారు."

"అవున్లే. చేసుకుంటానంటేమాత్రం ఏంపెట్టి చెయ్యను?" దీర్ఘంతీసింది విశాలాక్షమ్మ.

"మీరేం చెయ్యక్కర్లేదు! పార్థు ఒక గుజరాతీపిల్లను రిజిస్టర్ మారేజి చేసుకో బోతున్నాడు. నాకు రిసర్చ్ స్కాలర్‌షిప్పు వచ్చింది. రిసర్చ్ చెయ్యబోతు న్నాను" గబగబ అనేసి వెళ్ళిపోయింది యామిని.

తలమీద చేతులుపెట్టుకుని గోడకు చేరబడ్డది విశాలాక్షమ్మ.

## 9

రమణ పరీక్షను తృప్తికరంగా వ్రాశాడు. తల్లి ఉత్తరం వ్రాసినట్టుగా ఆమె దగ్గరికి వెళ్లాడు. ఆమె అతడి క్షేమసమాచారాల తరువాత అడిగిన ప్రశ్న కాంచనను గురించి.

"పురుడు వచ్చిందనీ రాలేదనీ—ఏ మాటా రాయరేం మీ మామగారు? అక్కడికీ నేను రెండు ఉత్తరాలు రాయించాను జవాబయినా ఇవ్వచ్చుగా?" కనుబొమలు ముడుస్తూ కొడుకు ముఖంలోకి చూసింది.

"పురుడొస్తే రాయరూ? వాళ్ళే రాస్తారు. అది సరే-నీవు ఇంటి సంగతులు చెప్పు? ఈ ఏడాది నాకు జీతంలేదు స్నేహితుడిదగ్గర అప్పుచేసి గడుపుకున్నాను. నాకేమయినా దబ్బిస్తే డ్యూటీలో జాయనయిపోతాను." తల్లి వ్యవహార దక్షతమీద అతడికి బాగా నమ్మకమున్నది. ఇంట్లో ఒక గదిమాత్రమే తనక్రింద ఉంచుకొని మిగతా భాగము అద్దెకిచ్చిందని చూడగానే గ్రహించాడు.

ఆమె నవ్వుకుని కొడుకు వీపుమీద ప్రేమతో తట్టింది.

ఆమె కొడుకు వచ్చినప్పటినుంచీ కాంచనను గురించిన ఆరా తీస్తూనే ఉన్నది. అతడు తప్పించుకుని ఏవేవో జవాబులు చెపుతున్నాడు. ఆ సాయంత్రం రైలులో అతడు వెళ్ళిపోతాడనగా మధ్యాహ్నంవేళ - అతడి కిష్టమైన మినప గారెలు చేసిపెట్టింది. అతడికిష్టమైన ఊరగాయలు సీసాలలోపెట్టి సర్దింది. బట్టలు కుట్టించుకొమ్మని రెండువందలరూపాయ లిచ్చింది.

"రమణా! నీవు ఉద్యోగంలోచేరి నాకు ఉత్తరంవ్రాయి. ఇల్లు నీ స్నేహితుడు చూశాడన్నావుగా. నేను వస్తాను. నీ దగ్గర రెండునెలలు ఉండాలనుంది. కాంచనక్కూడా రాయి-ఉద్యోగంలో చేరినట్టుగా."

రమణ ఉద్యోగంలో చేరాడు. అతడి స్నేహితుడు వాళ్ళ నడుమ ఒకగది కుదిర్చాడు. అన్నీ సర్దుకుని—హైదరాబాదు నాలుగు మూలలూ తిరిగి హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు రమణ. పాత స్నేహితులనందరినీ కలుసుకున్నాడు. భద్రాన్ని గురించి ఆరా తీశాడు. అతడు సెలవుపెట్టి ఎక్కడికో వెళ్ళాడని తెలిసింది.

ఆ రాత్రి తొందరగా భోజనంచేసి పడుకోబోతూ పెట్టె తెరిచాడు. బ్రౌను కవరులోనుంచి స్వర్ణ వ్రాసిన ఉత్తరాలు జారిపడ్డాయి. వాటిని చూడగానే దేహము పులకరించినట్లయింది. మళ్ళీ ఎన్ని ఉత్తరాలు నడిచాయో ఇద్దరి మధ్య?

అన్నిటినీ తీసి ఒక్కొక్కటే తిరిగి తిరిగి చదువుకున్నాడు. ఎంత తీయటి తలపులు? ఎంత చక్కటి భావాలు! ఎంత మాటల పొందిక? ఎంత ఆలోచన? ఎంత వివేకము? మానసికోద్వేగము కనబరచినా వాటిని అదుపులో పెట్టుకున్న ట్టుగా ఎంతో నైపుణ్యంతో ఇచ్చిన తీర్పులు? ఎంత ఉన్నతమైన భావాలు! వీటికి తోడు కిన్నెర కంఠము! తన్మయుడై చాలా సేపటివరకూ తానెక్కడున్నదీ మరచిపోయాడు.

ఉత్తరాలను తిరిగి చక్కగా మడిచి కవరులోకి ఎక్కించేటప్పుడు ఆఖరు ఉత్తరంలో స్వర్ణ వ్రాసిన విషయం చదివి "అయ్యో" అనుకున్నాడు. పాప మామె అంత ప్రాధేయపడుతూ వ్రాసినదానికి తాను జవాబు ఇవ్వనేలేదు. ఆమె ఇక్కడికి వచ్చి తన ఉనికి తెలుసుకోవటానికి చాలా కష్టపడి ఉంటుంది. తను లేడని ఎంతో బాధపడి ఉంటుంది. ఆమె కోరక కోరక ఒక్క కోరిక కోరితే తను ఎట్లా ఏమారగలిగాడు?

రమణ తనను తాను ఎంతగానో శపించుకున్నాడు. ఆమెను చూసే అవ కాశాన్ని జారవిడుచుకున్నాడు చేజేతులా.

స్వర్ణకు సుదీర్ఘమైన లేఖ ఆ రాత్రి కూర్చుని వ్రాశాడు. ఒక ఏడాదినుంచీ తను పరీక్షకోసం దీక్షతో చదివి వ్రాశాడు. ఉద్యోగంలో చేరేముందర తల్లిని చూడటానికి వెళ్లాడు. తను ఊళ్లో లేనప్పుడు ఆమె దగ్గర్నించి వచ్చిన ఉత్తరం ప్రకారం నడుచుకోలేకపోయాడు. అందుకు తనను మనసారా క్షమించానని స్వర్ణచేతినుంచి ఉత్తరం వస్తేగాని మనసుకు ఊరట కలగదు. ఈసారి స్వర్ణ వస్తుందన్న ఉత్తరం వస్తే-వెంటనే హోటల్ సుమిత్రలో ఒకగది తీసుకుంటాడు. అప్పుడు అన్ని సంగతులూ మాట్లాడుకోవచ్చు. ఇంతకాలంనుంచీ ఊహాసుంద రిగా తన హృదయంలో ప్రతిష్ఠింపబడిన ప్రణయలేఖా రచయిత్రిని చూడగలుగు తున్నాడనుకుంటేనే దేహము పులకలదేరుతున్నది. ఈ విషయాలను రసార్ద్రంగా కమనీయంగా జిలుగు జిలుగు మాటలతో కవ్విస్తూ వ్రాశాడు.

గంట చూశాడు. రాత్రి ఒంటిగంట దాటుతోంది. పరీక్ష పేపరు వ్రాసినంత సేపు వ్రాశాడా? అయినా ఇంకా తృప్తిగాలేదు. భావాలకు తగిన పదాలు దొరక్క శైలి కుంటుపడినట్టుంది. ఏ మహారచయితో అయితే తప్ప మనో భావాలను చక్కగా మాటల్లోకి-వ్రాతల్లోకి అనువదించగలడా? అందుకే వ్రాసే వాళ్లంతా రచయితలు కాలేరేమో

అసంతృప్తితోనే ఉత్తరాన్ని కవరులో పెట్టి అడ్రసు వ్రాశాడు.

తెల్లవారుఝామున ఒక చక్కటి కల. తీయటి తలపులూరించే కల_తను ఐ.ఏ.యస్. పరీక్షలో నెగ్గాడట. ఎక్కడో తెలియనిచోట సబ్ కలెక్టరుగా పంపించారట. అక్కడికి స్వర్ణ వచ్చిందట. ఓ...జీవితమెంత మధురం అను కున్నాడు కలలో.

# 10

ఉదయం పదకొండుగంటలవేళ స్వర్ణ వ్రాసిన ఉత్తరం రమణకు చేరింది. తన స్నేహితురాలు టెలిఫోను ఆపరేటరు ఉద్యోగానికి ఇంటర్వ్యూకు వస్తుంటే తనుకూడా ఆ అమ్మాయితో హైదరాబాదు వస్తోందిట. తను ఆ అమ్మాయి దిగినచోటనే వాళ్ల బంధువుల యింట్లో దిగుతుందట. అతడు ఎక్కడ కలుసుకో మంటే అక్కడ కలుసుకుంటుందట. పదిహేనవతేదీ ఉదయం ఆరుగంటలకే హైదరాబాదు చేరుకుంటుంది కనుక తనకు ఏ వేళయినా అనుకూలమే.

రమణ చేత్తో ఉత్తరం పట్టుకుని మనసులో లెక్కలు కట్టాడు. అప్పటికి అయిదురోజులుంది సరిగ్గా వాళ్లు రావటానికి. గబగబా పరుగెత్తినట్టుగా వెళ్ళి హోటల్ సుమిత్రలో గదులు ఖాళీగా లేవనగానే హోటల్ రమణికి వెళ్ళి 12వ నెంబరు గది బుక్ చేశాడు. స్వర్ణ వచ్చేనాటికి తనకు మరింకేమీ పనులు లేకుండా చూసుకున్నాడు ఆమెకు_ముక్తసరిగా ఏ హోటల్లో కలుసుకోవలసిందీ-వేళతో సహా_ఒక ఉత్తరం వ్రాసి పోస్టుచేశాడు.

గదిలో అడుగుపెడుతుండగా భద్రం వచ్చాడు చెమట తుడుచుకుంటూ. చాలా రోజులకు కలుసుకున్న మిత్రులు ఆప్యాయంగా మాట్లాడుకున్నారు.

"నీవు లేనప్పుడు మీ మామగారు వచ్చివెళ్ళారు. అయితే-నీ ప్రోగ్రాం వాళ్ళ కెవరికీ తెలిపే అలవాటు లేదా! నీవు ఊళ్లో లేవనగానే ఆయన దిగ్భ్రాంతుడై పోయాడు. నీవు ఎవరికీ చెప్పకుండా పారిపోయినట్టుగా చూశాడు." కుర్చీలో సర్దుకుని కూర్చున్నాడు.

"ఆ తరువాత నేనూ వ్రాశాను-ఆయనా వ్రాశారులే. ఒక మంచిపని చేయ టానికి పూనుకుంటే అందరూ శుభం పలకరు చూడు అడగని సలహాలూ- ఎదురుచూడని సంప్రదింపులూ నాకు నచ్చవు. అందుకే అంతా అయిన తరు వాత చెప్పటమూ-వెళ్ళిన తరువాత ఉత్తరము వ్రాయటమూ చేస్తూ ఉంటాను. ఇంతేనా? ఇంకేమయినా ఉందా?" సిద్ధంగా ఉన్న జవాబు టక్కున చెప్పాడు రమణ.




''అవునులే. ఎట్లాగయినా తెలివిగలవాడివి. అంతా బాగానే ఉందిగాని-మా చెల్లెలు ఎప్పుడు వస్తున్నది?''

"నా సంగతి పూర్తిగా తేలిన తరువాత. కొంచెంసేపు కబుర్లాపు. కాఫీ తాగుదాం." లేచి ఫ్లాస్కులో ఉన్న కాఫీ కప్పుల్లో పోశాడు.

కప్పు కిందపెట్టి "మా రమణ ఏ పనిచేసినా ఏ వన్‌గా చేస్తాడు. ఇటువంటి స్నేహితుడు ఉన్నందుకు నన్ను నేనే అభినందించుకుంటున్నా. ఒంటరిగా ఉన్నా ఎంత చక్కగా సర్దుకున్నావు గది?" కనుబొమలు పైకెత్తి నాలుగుమూలలూ పరకాయించాడు.

పకపక నవ్వాడు రమణ. "భద్రం! ఎప్పుడూ ఒక్కటేతీరు మాటలు బోరు కొడుతున్నాయి. కాస్త మాట మార్చు. అలా బైటికి వెళదాం రా" లేచి నిల బడ్డాడు.

"నాకు పనిలేదనుకున్నావా నీతో తిరగటానికి? మా ఆవిడ ఆరవ సంతా నాన్ని ఇవాళో రేపో వెలుగులోకి తీసుకువస్తుంది. ఇంటిదగ్గరే ఉండమని ఉత్తరువు జారీచేసింది." లేచి నిలబడి గదంతా కలయజూచి బైటికి నడిచాడు.

అమ్మయ్య అనుకున్నాడు రమణ చాలా హుషారుగా ఈలవేసుకుంటూ ఆ సాయంకాలము ఒక ఏడాది తరువాత సినిమాకు బయలుదేరాడు.

తీయటి ఊహలు-పరుగులుతీసే పరువము-మోసులెత్తే ఆశలు-కూర్చో నివ్వక-అతడిని కుదిపి కుదిపి వదిలిపెట్టాయి.

సినిమాచూసి ఇంటికి వచ్చిన తరువాత స్వర్ణ వ్రాసిన ఉత్తరాలలోని కొన్ని వాక్యాలు మననం చేసుకుంటూ ఎప్పుడో నిద్రలోకి జారుకున్నాడు.

# 11

కింగ్‌కోఠీరోడ్డుమీద హోటలు రమణి నృత్యభంగిమలో నిలబడ్డ నర్తకిలా నిలువెల్లా అలంకరింపబడిన విద్యుద్దీపాలతో ధగధగలాడుతూ ఉంటుంది. అధు నాతనంగా నిర్మింపబడిన ఆ భవనము రమణీయమైన దృశ్యాలతో ఏ భాగానికా భాగము కళాఖండంలా ఉంటుంది. ఎయిర్ కండిషన్డు రూములు-ఆధునిక సౌక ర్యాలు. రోజుకు సుమారుగా నూరురూపాయలు ఖర్చుపెట్టిస్తాయి.

పన్నెండో నెంబరు గదిలో స్ప్రింగ్‌కాట్ కెదురుగాఉన్న కుర్చీలో కూర్చుని రెపరెపలాడుతున్న పరదా సందుల్లోనుంచి చూస్తున్నాడు రమణ. తలుపుకు దగ్గరగా ఉన్న డ్రెస్సింగ్ టేబుల్ అద్దములో నలగని టెర్రికాట్ పాంట్ టెర్లిన్ బుష్‌షర్టు కనబడుతున్నాయి. పన్నెండు గంటలకు స్వర్ణను రమ్మని అతడు వ్రాశాడు. కాని—పదకొండు గంటలకే ఆ గదికి వచ్చాడు. పన్నెండుగంటల తరువాత భోజనం గదికే పంపమని ఫోనుచేశాడు

కాళ్ళు ఊపుతూ ఆలోచిస్తూ చిరుమందహాసంతో కళ్ళార్పుతూ ఎదురుచూస్తు న్నాడు రమణ. పన్నెండు కావచ్చింది. ఎదురుచూస్తున్న వేళ సమీపిస్తున్నది. చిరకాలవాంఛ నెరవేరబోతున్నది. గుండె గబగబా కొట్టుకోవటం చూసి అతడు నవ్వుకున్నాడు. చీమ చిటుక్కుమన్నా కళ్ళెత్తి తలుపువైపు చూస్తున్నాడు.

తన చేతిగడియారంలో పన్నెండు దాటి ఐదు నిమిషాలు అయింది.

ఆతురత హెచ్చుతున్నది. కనుబొమలు సన్నగా ముడిపడుతున్నాయి. ఆమె గడియారంలో ఇంకా పన్నెండు కాలేదేమో! అవును. గడియారాలు ఒకదానితో ఒకటి ఏకీభవించవు. వాటికీ స్వాతంత్ర్యం కావాలి కాబోలు! దేనితో నన్నా ఏకీభవిస్తే బానిసత్వ మనిపించుకుంటుందేమో!

అతడికి కాంచన మాటలు చప్పున జ్ఞాపకమొచ్చాయి. ఆవేశంతో నరాలు బిగుసుకున్నట్లనిపించింది. ముక్కుపుటాలదిరాయి. స్వేచ్ఛ! స్వాతంత్ర్యము! ఈ ప్రపంచంలో స్వేచ్ఛ ఎవరికుంది? స్వాతంత్ర్యం ఎవరికున్నది?

ఆవేశంలో పరుగులుతీసే ఆలోచనలకు బలమైన ఆనకట్ట కట్టి లేచినిలబడి- ఆ గదిలోనే ఇటునుంచి అటు-అటునుంచి ఇటూ పచార్లుచేయటం మొదలు పెట్టాడు. తీయటి తలపులు సఫలము కానున్నవేళ ఈ జ్ఞాపకాలేమిటి అప శకునం!

అతడికి చప్పున సినిమాపాట జ్ఞాపకం వచ్చింది. "నిన్న మొన్నటి కల లన్నీ నిజంచేసి చూసుకుందామా!"

గోళ్లకు రంగువేసుకున్న సన్నటి పొడుగాటి తెల్లటివేళ్ళతో పరదాను తొలగిస్తూ-అడవితీగెలు అల్లిబిల్లిగా అల్లుకున్న డిజైను నైలెక్సు చీరతో సన్నటి ఆకారం లోపలికి ప్రవేశించింది.

సంభ్రమంతో కుర్చీలోనుంచి లేచినిలబడ్డ రమణ ఆమె ముఖంచూసి స్థాణువయిపోయాడు.

అతడిని చూసిన ఆమె గజగజ వణుకుతూ నిలబడిపోయింది.

కొంత సేపటికి అతడు తేరుకుని "ఏమిటి సంగతి కాంచనా! ఇలా వచ్చావు? బాగున్నావా?" అడిగాడు పొడి పొడి మాటలతో.

ఒకచేత్తో కాగితాలకట్టను గట్టిగాపట్టుకుని రెండోచేతిని గుండెలమీదికి పోనిచ్చి నోరు తెరిచింది కాంచన. మాట బైటికి పెకలటంలేదు. ఎంతో ప్రయత్నం చేసినమీదట "నా స్నేహితురాలిని చూడటానికి వచ్చాను'' అనగలిగింది

''ఈ హోటల్లో ఈ గదిలోకా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును."

"ఈ పన్నెండో నెంబరు గదిలోకా? పొరపడలేదుకదా?"

"లేదు."

అతడికి అర్థంకావటంలేదు. ఈ గది ఇంకెవరయినా బుక్ చేసుకున్నారేమో? ఎక్కడో పొరబాటు జరిగింది. కాంచనను ఇటువంటి పరిస్థితులలో చూడటం తటస్థించిందేమిటి? కాంచన ఇక్కడ ఉండగా స్వర్ణ రాదుకదా ఈ గదిలోకి?

తటాలున అతడి దృష్టి కాంచన గర్భంమీదికి పోయింది.

"నీవు మామూలుగానే ఉన్నావే? అమ్మ ఏమేమిటో వ్రాసింది నిన్ను గురించి." గుచ్చి గుచ్చి ఆమె కళ్లల్లోకి చూశాడు.

పౌరుషం తలఎత్తింది కాంచనలో. ఒక ప్రక్క భయంతో దేహము వణికిపోతున్నది. "బిడ్డను కని మీకు లొంగిపోతాననుకున్నారా?" కసిగా అన్నది నరాలన్నీ బిగబట్టుకుని.

రమణకు ఆమె ఎప్పుడో అన్నమాటలు జ్ఞాపకానికి వచ్చాయి-బిడ్డలను కన్న తల్లి తన వ్యక్తిత్వాన్ని కోల్పోయి భర్తకు బానిస అయిపోతుందని.

"అయితే నీవు...నీవు..."

"అవును. నేను ఏ పనయినా చెప్పే చేస్తాను."

"ఛీ ఛీ." అసహ్యంగా చూశాడు.

కాంచనకు నోటివెదిరింపేగాని దేహం పట్టుతప్పింది. గోడకు ఒరిగి—జారి నేలమీదపడి స్పృహకోల్పోయింది. చేతిలోఉన్న కాగితాలకట్ట విచ్చుకుని దూరంగాపడి కుర్చీకిందికి దొర్లింది.

రమణ ఆమెను జాగ్రత్తగా మంచంమీదికి చేర్చాడు. ఫ్యాన్ వేశాడు. నీళ్ళ గదిలోకివెళ్ళి దోసెడునీళ్ళుతెచ్చి ముఖంమీద చల్లాడు స్వర్ణ ఎప్పుడు వస్తుందో నన్న ఆదుర్దాతో వాకిలివైపు పదే పదే చూస్తున్నాడు.

కాంచన మెల్లగా కళ్ళుతెరిచి మళ్ళీ మూసుకుంది.

రమణ లేచి కుర్చీకిందపడిఉన్న కాగితాలకట్ట చేతిలోకి తీసుకున్నాడు. విప్పి చూడగానే అతడికి మతిపోయినంతపనైంది.

స్వర్ణకు వ్రాసిన ఉత్తరాలు కాంచన చేతికి చిక్కాయి. ఆమెద్వారా తానిక్కడికి వస్తాడని తెలుసుకుని ఆ ఉత్తరాలు పట్టుకుని తగవులాడటానికే ఈ పన్నెండో నెంబరు గదికి వచ్చింది. తెలిసే వచ్చింది. అయితే ఇంక స్వర్ణ ఎందుకు వస్తుంది? రా...దు. రా...లేదు.

పెళ్ళికాకముందు అతడు తల్లికి చేసిన వాగ్దానం - సర్దుకుని బ్రతుకుతానన్న మాట - జ్ఞాపకం వచ్చింది. అందుకే స్వర్ణ తనకు వ్రాసిన ఉత్తరాలన్నీ కాల్చి వేశాడు. ఆమె పాపం! వాటన్నిటినీ ప్రాణప్రదంగా దాచుకున్నది కాబోలు! ఈనాడీ రాక్షసికి ఆ ఉత్తరాలు చిక్కాయి.

అతడి ఆలోచనలు ఎటునుంచి ఎటో పయనిస్తున్నాయి. అలా కాంచన ముఖంలోకి చూస్తూ కూర్చున్నాడు.

అరగంట తరువాత కాంచన తెప్పరించుకుని మెల్లగా పడకమీద లేచికూర్చుని -చెదరిన తలవెంట్రుకలు సవరించుకుంటూ లేవబోయి తూలింది. చేతులు మంచానికానించి నిలద్రొక్కుకుంటూ "అయ్యో! నా కాగితాలకట్ట! నా కాగితాల కట్ట" అంటూ కళ్ళతో గదంతా వెదికింది ఆదుర్దాతో.

"ఇవిగో నీ కాగితాలు. ఇవి నీకెక్కడివి?" నిలవదీసినట్టుగా అడిగాడు కళ్లెర్రచేసుకుంటూ.

కాంచనకు దుఃఖం ముంచుకువచ్చింది. కాని అతడి ముందర కన్నీళ్ళు కార్చటం ఇష్టంలేదు. కన్నీళ్ళు కార్చటం ఒక బలహీనతగా ఆమె భావిస్తుంది. అయినా కన్నీరాగటంలేదు.

"అవి నాకు ప్రాణంతో సమానము. వాటిని చూసుకునే నేను బ్రతికేది!" కంఠంలో గాద్గద్యం స్పష్టమయింది. ఓడిపోతానేమోనన్న భయం ముఖంలో కనబడుతోంది.



రమణకు ఆమెమీద అసహ్యం, జుగుప్స మితిమీరాయి.

"ఎవరో ఎవరికో వ్రాసిన ఉత్తరాలు నీకు ప్రాణప్రదమా? ఎవరిదగ్గర్నించి దొంగిలించి తెచ్చావు వీటిని? నీవుకూడా బ్లాక్ మెయిలు చేస్తున్నావా?" పళ్ళు బిగపట్టి అన్నాడు.

కాంచన కోపం తారస్థాయికి చేరుకుంది. తనెట్లాగయినా విడాకులు తీసుకోబోతున్నది. ఇంకా ఇప్పుడు దాపరికమెందుకు? ఈ కారణంచేతనయినా విడిపోతే నెత్తిన పాలుపోసినట్టు అనుకుంది

"ఈ ఉత్తరాలు నావి. నా స్వంతం. నా హృదయంలో కలం ముంచి వ్రాసిన ఉత్తరాలు ఆయన దగ్గర ఉన్నాయి. ఆయన హృదయం ఈ ఉత్తరాలలో ఉన్నది. నన్ను ఉద్దేశించి - నాకు వ్రాసిన ఉత్తరాలు ఇవి." దాచుకోకుండా బైటికి అనేసింది.

రమణ కంగారుపడిపోతున్నాడు. ఆ ఉత్తరాలు తను స్వర్ణకు వ్రాశాడు.

ఒకరికని ఉద్దేశించి వ్రాసినవి ఒకరిచేతిలో పడ్డాయి కాబోలు! ఎంత పొరబాటు జరిగింది?

"అయితే నీకు ప్రణయలేఖలు ఇతరులకు వ్రాసే అలవాటుకూడా ఉందా? గ్రంథసాంగురాలివన్నమాట! నీ ఆ స్నేహితు డెవరు?" పళ్ళు పటపట కొరి కాడు.

"నేను పిరికిదాన్ననుకున్నారా? పేరు చెప్పటానికి భయపడతాననా మీ ఉద్దేశ్యం? అతడి పేరు పాణి. అతడు నా గాత్రాన్నీ, నా పాటనూ విని నన్ను ప్రేమించిన రసజ్ఞుడు. మా యిద్దరిమధ్య నడచిన ఉత్తరాలు ఒక పెద్దకట్ట. విధి...దుర్విధి...మమ్మల్నిద్దరినీ విడదీసి చొరొకవైపుకూ విసిరింది. అయినా సర్దుకుపోదామని ప్రయత్నించాను. మనసులేని మనుగడ నా వల్లకాలేదు. గర్భ స్రావం చేసుకున్నాను. పాణి ఇవాళ ఈ గదిలోకి వస్తానని ఉత్తరం వ్రాశాడు. ఎలాగయినా అతడిని చూసి - అతడితో మాట్లాడి - అతడి సహాయంతో నేపద్యగాయని నవుదామన్న ప్రయత్నంలో ఈ ఊరు వచ్చాను." జంకూ గొంకూ లేకుండా అనేసి - మోకాళ్ళచుట్టూ చేతులువేసుకుని మంచంమీద కూర్చుంది కాంచన. ఎట్లాగయినా ఇవాళ తెగతెంపులు కావలసిందేనని నిశ్చ యించుకుంది.

రమణ ముఖం వెలతెలాపోయింది. అతడికంతా అయోమయంగా ఉంది. ఈ కాంచనేనా స్వర్ణ? తాను పాణి. ఇద్దరూ ఒకరి ముఖం ఒకరు చూసుకోకుండా ఉత్తరాలద్వారా ప్రేమించుకున్నారు. ప్రణయలేఖలు వ్రాసుకున్నారు. కొంత కాలమాగిన తరువాత తిరిగి లేఖలు వ్రాసుకున్నారు. ఎంత విచిత్రంగా ఉంది

మొండితనం—అహంకారం-పొగరు - ఇన్ని అవలక్షణాలుగల కాంచనకు కిన్నెర కంఠమా! ఈ దురహంకారి ఎదలో అంత ప్రణయోద్వేగమా? ఎట్లా నమ్మటం? నమ్మకుండా ఉండటమెట్లా?

కాంచనను తను ద్వేషిస్తున్నాడు. కాని కాంచనలోని స్వర్ణను ప్రేమిస్తు న్నాడు. ప్రాణ మిస్తున్నాడు.

కాంచన తనను ఏవగించుకుంటోంది. కాని తనలోని పాణికి ప్రాణమిస్తోంది. ఆ ఉత్తరాలు - స్వర్ణ తనకు వ్రాసిన ఉత్తరాలు ఎంత ఉత్తేజకరమయినవి? వాటివల్ల ప్రభావితుడయే తాను ఎం ఏ. చదివాడు. ఐ ఎ.యస్. పరీక్ష వ్రాశాడు. ఎంత శక్తివంతమైనవా ఉత్తరాలు? అవి ఈ కాంచన వ్రాతలంటే నమ్మలేకుండా ఉన్నాడు.




స్వర్ణ – పాణి ప్రణయజీవులు. ఒకరికొకరు ప్రాణమివ్వగలిగినవారు. కాని ఆ యిద్దరే కాంచన రమణలుగా పెళ్ళిచేసుకుని కాపరం చెయ్యలేకపోయారేమి?

స్వర్ణ–పాణి. కొలనులో ఉన్న కలవపూవు అంతదూరాన ఉన్న సూర్యుణ్ణి చూసి పొంగిపోతూ అతడిని చేరుకోవటానికి తహతహలాడినట్టు ఒకరికోసం ఒకరు తహతహలాడారు – ఊహాప్రపంచంలో. నిజజీవితంలో చేరువ కాలేక పోయారెందుకు?

కాంచనమీద అతడికి జాలి, సానుభూతి మొదటిసారిగా కలిగాయి. కాంచన హృదయం మంచిదే. తామిద్దరి మధ్య తెరలుతెరలుగా మాయ కమ్ముకుంది. మాయ ఇప్పుడు విడిపోయింది. కాని — కాంచన జరిగిందంతా నమ్ముతుందా? కాంచనలో ఉన్న స్వర్ణను తలుచుకుని అతడి హృదయము కరిగిపోవటం మొదలుపెట్టింది.

చెప్పెయ్యాలి. జరిగినదంతా కాంచనకు చెప్పెయ్యాలి అనుకుంటూ రమణ తన జేబులు తడుముకుంటూ ప్యాంటుజేబులో ఉన్న ఉత్తరం బైటికితీసి "ఈ ఉత్తరం చదువు" అని ఆమె చేతికిచ్చాడు.

ఉత్తరం చూడగానే కాంచన చేతులు వణికాయి. పట్టుబడిపోయాననుకుంది. తెచ్చుకున్న ధైర్యంతో బింకంగా "మీకెక్కడిదీ ఉత్తరం?" ఒక్క అరుపు అరిచింది.

"ఎక్కడిదంటే ఏమన్నమాట? అది నా ఉత్తరం కనుక నా దగ్గరుంది.

నీవు దాచుకున్నట్టే నేనూ ఉత్తరాలు దాచుకున్నాను. వాటిలో నాకు నచ్చిన వాటిని కంఠస్థం చేసుకున్నాను. వాటినే ఆహారంచేసుకుని బ్రతుకుతున్నాను. వాటిని చూసుకుని జీవితంలో చేదును మింగటానికి ప్రయత్నించాను." శూన్యం లోకి చూస్తూ అన్నాడు.

ఈసారి కాంచనకు మతిపోయినంత పనైంది. ఇంతటి కర్కోటకుడి హృదయంలోనుంచి ఉత్పన్నమయిన ప్రణయోద్వేగమేనా ఆ ఉత్తరాలు? ఇతడిది అంత సున్నిత హృదయమా? అంతటి రసమందిరమా అతడి మనసు?

బలహీనంగా ఉన్న కాంచన ఈ నిజాన్ని ఎదుర్కోలేక పక్కమీద వాలి పోయింది - కళ్ళు రెండూ చేతులతో మూసుకుని.

రమణ ముఖంలో రంగులు మారుతున్నాయి మళ్ళీ తనే పాణి కాబట్టి సరి పోయింది. మరొకడయినట్లయితే? అతడి సున్నితమయిన మనసులో ముల్లులా గుచ్చుకుందా భావం. తన ప్రతిరూపాన్ని - తన బిడ్డను నాశనంచేసిన కాంచన మీద తిరిగి కార్పణ్యం తలఎత్తింది. తల చేతులతో పట్టుకున్నాడు.

అతడి మెదడుతో స్వర్ణ వ్రాసిన ఉత్తరాలు అందమైన కలువపువ్వుల్లా పంక్తులు తీర్చాయి. అతడి గుండె గుబగుబలాడింది.

ఏదో నిశ్చయం చేసుకున్నవాడిలా రమణ లేచాడు. తరుహృదయాలను చేరువకానీయకుండా మధ్యగా పెరిగిన అపోహలనూ మాయతెరలనూ తొలగించ పూనుకున్నాడు.

కాంచనా! మనిద్దరం కాంచన - రమణల అవతారాలను చాలించి పాణి - స్వర్ణలుగా బ్రతుకుదాం రా. ఆ ఉత్తరాలను స్మరించుకుంటూ ఆ వెలుగులో నడుద్దాం రా. రెండుగంటలు దాటింది భోజనం చేద్దాం లే." ఆమెను రెండు చేతులూపట్టి లేవనెత్తాడు.

కొలనులో తల ఊపుతూ కలవపూవు కిలకిల నవ్వినట్టే కాంచన నవ్వుతూ లేచింది. బాయ్ తీసుకువచ్చిన భోజనం స్వీట్ — హాట్‌లతో కానిచ్చి లేచాడు.





# అగ్నిమాల

## వాసరి సుబ్రహ్మణ్యం

(గత సంచిక **తరువాయి**)

**వా**రంరోజులు గడిచిపోయినై. ఈ మధ్యకాలంలో చెప్పుకోతగ్గ సంఘటనలేవీ జరగలేదు. తనకు శారీరక స్వాస్థ్యం చిక్కగానే, ప్రస్తుతానికి రాజా ప్రసేనుడి గృహం వదిలిపోవటమే క్షేమమని, అగ్నిపాలుడు ఆలోచించాడు. కాని, యీ వారంరోజుల్లోనూ అతడు వకుళమాలను — ఆవిడ తల్లి వెంట వుండగా — దూరాన వుండి రెండు మూడుసార్లు చూశాడు. ఆమె అందం, యౌవనం, ముగ్ధత్వం — ఆలోచించిన కొందికీ అతణ్ణి మరింతబలంగా ఆకర్షించ సాగినై. పైగా, మొదటినాడు ఆ చిరువెన్నెలలో తను ప్రథమంగా చూసిన నాటిరాత్రి—ఆమె తనపై చూపిన దయ, కరుణ అతడి హృదయంమీద బాగా ముద్రితమైపోయాయి.

అవజ్ఞవర్మతో తన పందెంమాట అటుంచి, వకుళమాలను తన భార్యగా ఏ విపత్కర పరిస్థితులలోనైనా సరే

పొందలేనినాడు, తన భావిజీవితం వృథా అనుకున్నాడు, అగ్నిపాలుడు.

ఇలాంటి సమస్యలతో సంకుల సమరంచేస్తూ, ఒకనాటి సాయంకాలంవేళ అగ్నిపాలుడు ఉద్యానవనంలో చల్లగాలికి తిరుగుతూండగా, ముఖద్వారం వైపునుంచి పెద్దగా మాటలువినిపించినై. అగ్నిపాలుడు అటుకేసి తలతిప్పాడు. రాజా ప్రసేనుడివెంట అతడి భార్య చంద్రాదేవీ, కుమార్తెగాక — మరెవరో యువకుడు, దాదాపు పాతికేళ్ళవాడు వున్నాడు అతడు చేతులు అటూయిటూ ఊగిస్తూ, పెద్దగొంతుతో మాట్లాడుతున్నాడు ప్రసేనుడు తలవంచుకొని వింటూ, మధ్య మధ్య యువకుణ్ణి ఏదో ప్రశ్నిస్తున్నాడు.

చూస్తూండగానే ఆ నలుగురూ అగ్నిపాలుడున్న చోటుకు వచ్చారు ప్రసేనుడు అగ్నిపాలుణ్ణి ఆ యువకుడికి చూపుతూ, "చెప్పానుగదా, వర్మా!... ఈయనే విష్ణుమిత్రుడు" అంటూ అగ్నిపాలుడికేసి తిరిగి, "బేతాళవర్మ... వరసకు బావమరిది అవుతాడు!" అని కొంచెం ఆగి, "విష్ణూ! వర్మ చాలా ముఖ్యమైన సమాచారం ... మనందరినీ దుఃఖసాగరంలో ముంచే వార్త తీసుకు వచ్చాడు మన కాలభోజరాజు, హనుమప్పసేనానికి బందీగా చిక్కినట్టు ధృవపడింది!" అన్నాడు.

"నేను మొదటినుంచీ అంటూనే వున్నాను..." అంటూ చంద్రాదేవి ఏమో చెప్పబోయేంతలో, ప్రసేనుడు ఆమెకేసి చిరుకోపంగా చూశాడు.

అగ్నిపాలుడు ముఖంలో కొంత విచారం కనబరుస్తూ, "ఇలా జరుగుతుందని మనలో ఎవ్వరం ఊహించలేకపోయాం. మహారాజు తిరిగి కృష్ణానదిని దాటి చాళుక్యరాజ్యంలో ప్రవేశించి వుంటారనికూడా నేననుకున్నాను," అన్నాడు.

"నన్నడిగితే — మనం యిప్పుడు ఆలోచించవలసింది ఆయన్ని గురించి కాదు. మన భవిష్యత్తు ఎలా వుండబోతున్నది? అదీ ముఖ్య సమస్య!" అన్నాడు బేతాళవర్మ.

"క్షమించాలి...యీ ధోరణి ధైర్యవంతుల లక్షణం అనిపించుకోదు," అన్నాడు అగ్నిపాలుడు.

ఈ మాటలు వింటూనే బేతాళవర్మ గతుక్కుమని, కోపం, ఆశ్చర్యం మిళితమైన ముఖకవళికలతో అగ్నిపాలుడి ముఖంలోకి సూటిగా చూశాడు. అగ్నిపాలుడు కూడా ఏమాత్రం తొణకక, అతడి ముఖంకేసి ఓమారు చిరునవ్వుతో చూసి, పక్కనే నిలబడివున్న వకుళమాలకేసి దృష్టితిప్పాడు.

వకుళమాల పెదాలమీద మందహాసం వెల్లివిరిసింది. తరవాత ఆమె బేతాళవర్మకేసి తలతిప్పి అపహాస్యంగా

చూస్తున్నట్టు అగ్నిపాలుడు గమనించాడు

"విష్ణూ, నీవన్నది నిజం! పరిస్థితులు అననుకూలంగా పరిణమించినప్పుడే మనం బెంబేలు పడిపోకుండా, సావధానులమై కర్తవ్యాన్ని గురించి ఆలోచించవలసి వుంటుంది," అన్నాడు ప్రసేనుడు.

"మనం తొణక్కుండా, బెంబేలు పడిపోకుండా వున్నంత మాత్రాన, మనను చుట్టుముట్టిన విషమ సమస్యలు పరిష్కారం అయిపోగలవా?" అన్నాడు బేతాళవర్మ

"అసలు మనమిప్పుడు ఏ విషమ సమస్యల్లో చిక్కుకున్నాం?" అన్నాడు అగ్నిపాలుడు

"కాలభోజ మహారాజు శత్రువుల చేజిక్కాడు," అన్నాడు బేతాళవర్మ కోపంతో ముక్కుపుటాలు అదురుతూండగా.

"ఇది దురదృష్టకరమైన సంఘటనే అయినా...మనకు అంత విషమసమస్య కాదు," అన్నాడు అగ్నిపాలుడు నిర్వికారంగా.

"ఆతరవాత మనవంతూ వస్తుంది!" అన్నాడు బేతాళవర్మ

అగ్నిపాలుడు ఇక అతడితో వాదించి లాభం లేదన్నట్టు ప్రసేనుడికేసి తిరిగి, "మీరు యీ అంతర్యుద్ధంలో కాలభోజుడి పక్షాన వున్నట్టు తెలిసినవారెవరు?" అని అడిగాడు.

"ఇక్కడవున్న మనం; మణిమంతుడు...అంతకన్న మరెవరికీ తెలియదు," అన్నాడు ప్రసేనుడు

"అలా అయితే, యీ సంగతి బయటికి పొక్కవలసిన అవసరంలేదు," అన్నాడు అగ్నిపాలుడు, బేతాళవర్మతో.

"మణిమంతుడి మాటేమిటి?" అని ప్రశ్నించాడు బేతాళవర్మ

"అతడు స్వేచ్ఛగా వున్నట్టు నాకు వార్త వచ్చింది" అన్నాడు ప్రసేనుడు.

"అయితే, యీ పరిస్థితుల్లో మనకు వచ్చిన ప్రమాదం ఏమీలేదు," అన్నాడు అగ్నిపాలుడు

బేతాళవర్మ అయిష్టంగా తలవూపి వూరుకున్నాడు. ప్రసేనుడు కొంచెంసేపు తలవంచుకుని ఆలోచిస్తూ వూరుకుని, "నిజమే విష్ణూ! మనం భయపడవలసిందేమీ లేదు. చిన్నతనం అవటం వల్ల వర్మ అనవసరంగా హడావిడి పడిపోయాడు. సరే, నేను చూసుకోవలసిన పనులున్నవి మీరు మరికొంతసేపు యీ తోటలో తిరిగిరండి!" అంటూ వెనుదిరిగి బయలుదేరాడు. అతడి వెనకగా చంద్రాదేవి కూడా బయలుదేరింది.

బేతాళవర్మ ఓసారి అగ్నిపాలుడికేసీ వకుళమాలకేసీ పక్కచూపులు చూసి,

గిర్రున వెనుదిరిగాడు. వకుళమాల అతణ్ణి ఉద్దేశించి, "ఏం, మామగారికి అంత తొందర పనేం గుర్తుకొచ్చింది? ఎక్కడికి బయలుదేరుతున్నారు?" అన్నది నవ్వుతూ.

"పనేంలేదు, అయినా..." అంటూ బేతాళవర్మ నసిగాడు

"అందరం కలిసి అటు నదికేసి వెళ్ళి వద్దాం, రాకూడదా!" అంటూ వకుళమాల ముందు దారితీసింది.

అగ్నిపాలుడు, ఆమెకు అంత ఎడంలో నడవసాగాడు. బేతాళవర్మ, వకుళమాల పక్కనే తలవంచుకు నడుస్తూ, "వకుళా, యీ సంగతి విన్నావా?" అన్నాడు.

"ఏ సంగతి?" అన్నది వకుళమాల.

"అగ్నిపాలుడు ... బహుశా పేరు వినేవుంటావు! అతడీ ప్రాంతాల ఎక్కడో మరణించినట్టు గగ్గోలుగా వుంది."

"ఆ పేరైతే విన్నాను. కాని, ఆయన్ని నేనెప్పుడూ చూడలేదు పాపం ఏ కారణంవల్ల మరణించాడో!" అన్నది వకుళమాల జాలిగా.

వాళ్ళ సంభాషణ వింటున్న అగ్నిపాలుడికి ఆశ్చర్యంతోపాటు, కుతూహలంకూడా కలిగింది. తను మరణించినట్టు వార్తలు పుట్టించిన దెవరు? ఇదీ ఒకవిధంగా తన మంచికేనా?

"ఏ కారణంవల్ల ఎక్కడ మరణించాడో ఎవరికీ తెలియదు. చంద్రగిరి నగరంనుంచి అతడు యీ ప్రాంతాలకు బయలుదేరి వచ్చినట్టుమాత్రం రూఢి అయింది. నిజంగా అతడి మరణం నాకు గొద్దలిపెట్టు" అన్నాడు బేతాళవర్మ.

అగ్నిపాలుడు అమితాశ్చర్యం చెందాడు. ఈబేతాళవర్మకు తన మరణం ఎందువల్ల గొడ్డలిపెట్టవుతుంది? తనీనాటివరకు యితడి ముఖమైనా చూచి వుండలేదే!

"నువ్వనేదేమిటో నా కర్థంకాలేదు, మామా!" అన్నది వకుళమాల.

"నేను లోగడ కొంతకాలం చంద్రగిరి నగరంలో వున్నాను, గుర్తుందా?" అన్నాడు బేతాళవర్మ సగర్వంగా.

"గుర్తులేకేం. అది ఏనాటి మాట!" అన్నది వకుళమాల.

"ఆ రోజుల్లో మేం యిద్దరం ఎటువంటి స్నేహితులం ... ఓ(, నిజంగా, సోదరుల్లా తిరిగామంటే నమ్ము." అన్నాడు బేతాళవర్మ.

వకుళమాల, బేతాళవర్మ వంక కొంచెం ఆశ్చర్యంగా చూసి, అగ్నిపాలుడికేసి చిరునవ్వు నవ్వుతూ, "మీరేమీ మాట్లాడరేం? ఏదో ఆలోచిస్తున్నారల్లే వుంది." అన్నది

"ఆ(, మరేంలేదు," అంటూ అగ్నిపాలుడు తడబడ్డాడు.

"మా మామ చెప్పే మరణవార్త మిమ్మల్ని కలతపరచటం లేదుగదా?



బహుశా మీకూ ఆ అగ్నిపాలుడు సోద రుడులాంటి స్నేహితుడై వుంటాడేమో!'' అన్నదామె.

ఆమె కంఠస్వరంలో పలికిన హాస్య ధోరణిని గుర్తించిన అగ్నిపాలుడు చిన్నగానవ్వి, ''స్నేహభావం వేరూ, సోదరభావం వేరూ. ఆ అగ్నిపాలుణ్ణి గురించి విన్నానేగాని ఆయనతో పరి చయ భాగ్యం మాత్రం నాక్కలగలేదు'' అన్నాడు.

"అగ్నిపాలుణ్ణి గురించి వినివుండ టంలో గొప్ప ఏమీలేదు! ఆయన్ని గురించి విననివాళ్ళు యీ చంద్రగిరి రాజ్యంలోనే కాదు..." అంటూ బేతాళ వర్మ మాటలు తడబడేంతలో, వకుళ మాల అందుకుని, "అంగ, వంగ కళింగ, గాంధార..." అంటూ ఏకరువు పెట్టబోయింది. కాని, బేతాళవర్మ మధ్య లోనే అందుకుని, "వకుళా! ఇది నీకు హాస్యకారణంగా కనబడవచ్చునేమో కాని, నాకు మాత్రంకాదు. ఆ అగ్ని పాలుడు నాకు ప్రాణస్నేహితుడు తెలుసా?" అన్నాడు చిరుకోపంగా.

''అదే నిజమైతే, నువ్వు వాళ్ళూ, వీళ్ళూ చెప్పిన వార్తలువిని, ఆయన మరణించాడని నమ్మేకన్న, స్వయంగా బయలుదేరిపోయి, నీకు నీవై అందులోని నిజానిజాలు తెలుసుకుంటే బాగుండేది" అన్నది వకుళమాల.

బేతాళవర్మ ఆ జవాబుకు తెల్లబోయి కొంచెం సేపు తలవంచుకు నడిచి, అగ్ని పాలుడికేసి చిరునవ్వుతో చూస్తూ, ''మీ రెప్పుడైనా చంద్రగిరి రాజ్యంలో వున్నారా?'' అని అడిగాడు.

"కొంతకాలం కిందట, కొద్దివారాల పాటు వున్నాను,'' అన్నాడు అగ్ని పాలుడు.

"అలా అయితే మీకు అగ్నిపాలుణ్ణి గురించి బాగా తెలిసివుంటుంది!" అన్నాడు బేతాళవర్మ ఊంకుతూ.

"ఇంతకు ముందే చెప్పాను...అతణ్ణి గురించి నాకంతగా తెలీదు," అన్నాడు అగ్నిపాలుడు.

ఇంతలో ముగ్గురూ నదిని సమీపించారు. వకుళమాల ఓ క్షణకాలం ఆగి, వరద నీటితో పొంగులువారుతున్న నది కేసి ఓమారుచూసి, నదిలోకి సోపానాలుగా కట్టివున్న రాతిమెట్లకేసి నడిచింది.

ముగ్గురూ ఒకరి కొకరు కొంచెం ఎడంగా మెట్లమీద కూర్చున్నారు. అగ్నిపాలుడు ఎలాంటి సంభాషణ ప్రారంభించి వకుళమాలను వినోదపరుద్దామా అనుకునేంతలో, బేతాళవర్మ ఒకసారి పెద్దగా ఉస్సురుమని, "ఆ భవనం...ఆ నౌకర్లు...ప్చ్‌ప్చ్!" అన్నాడు ముఖం వేళ్ళాడవేస్తూ.

"ఎవరిగురించి అంత అద్భుతపడుతున్నావ్, మామా?" అన్నది వకుళమాల.

"మరెవరు? ఇందాకట్నుంచీ మాట్లాడుతున్నది ఎవరిని గురించి?" అన్నాడు బేతాళవర్మ ఎంతో బాధగా

"అంటే, ఆ అగ్నిపాలుడనే ఆయన అంత ఐశ్వర్యవంతుడా?" అన్నది వకుళమాల.

"ఐశ్వర్యం! ... నవభోజుడి తరవాత, చంద్రగిరి రాజ్యంలో ఆయనే ఐశ్వర్యవంతుడు. ఆయన చేసేవిందులూ—ఆ సమయంలో అక్కడికి అతిథులుగా వచ్చే ప్రముఖులేగాక, నర్తకులూ, గాయకులూ ... ఆహాహా!" అన్నాడు బేతాళవర్మ.

అగ్నిపాలుడికి, బేతాళవర్మ పలికే వెకిలిమాటలు వింటున్నకొద్దీ చిరాకు ఎత్తుకొస్తున్నది. అతడు చాలామంది అమాయకుల్నీ, అవివేకుల్నీ చూశాడు గాని, యీ బేతాళవర్మ అలాంటివారి నందరినీ మించిపోతున్నాడు.

"ఆ విందులకు మీరు వెళుతూండేవారా?" అని అడిగాడు అగ్నిపాలుడు.

"ఏమిటలా ప్రశ్నించారు?" అన్నాడు బేతాళవర్మ ఆశ్చర్యపోతూ.

"మీరంత ఆశ్చర్యపడవలసిందేమీ లేదు, వర్మా! నేనూ, అతడు చేసిన ఒక విందుకు వెళ్ళాను అందుకడుగుతున్నాను," అన్నాడు అగ్నిపాలుడు.

బేతాళవర్మ తెల్లబోయి, అంతలోనే తెప్పరిల్లి, "అయితే...అయితే, నన్నక్కడ చూసేవుంటారు, అవునా?" అన్నాడు.

"దురదృష్టవంతుణ్ణి...అంత గొప్ప భాగ్యం కలగలేదు," అన్నాడు అగ్నిపాలుడు తాపీగా.

ఈ యీసడింపు బేతాళవర్మకు అర్థంకాకపోయినా, వకుళమాల గ్రహించింది. ఆమె అగ్నిపాలుడికేసి మెరుస్తున్న నేత్రాలతో చూస్తూ, "మీరుచాలా

మంచి ఛలోక్తులు వేయగలరు, ఆఁ!" అన్నది ఎంతో ఉత్సాహంగా.

ఆ మెప్పుకోలు బేతాళవర్మకు చుర్రు మనిపించింది.

"వకుళా! నువ్వు ఆ అగ్నిపాలుడు మాట్లాడుతూండగా వినివుండవలసింది. ఆఖరికి నవభోజరాజు కూడా, అతడి చమత్కృతికి పొట్టచెక్కలయ్యేలానవ్వుతారు," అన్నాడతను.

"అలాగా! ఇంతకూ ఆయనకు వివాహం అయిందా? పిల్లలెందరు? ఆడా, మగా వేరు వేరుగా చెప్పు, మామా!" అన్నది వకుళమాల వచ్చే నవ్వును ఆపుకుంటూ.

"పిల్లలేమిటి? ఆయన వివాహితుడే కాదు," అన్నాడు బేతాళవర్మ.

"పాపం, మనిషి అంత అనాకారా ఏం?" అన్నది వకుళమాల జాలిగా.

"అంత అందగాడు యిక పుట్టడు; పుట్టబోడు!" అన్నాడు బేతాళవర్మ.

"నిజం!" అంటూ వకుళమాల కొంటెగా నవ్వింది

బేతాళవర్మ, అగ్నిపాలుడికేసి తిరిగి "విష్ణుమిత్రా! మీరు ఒకసారి ఆయన చేసిన విందులో పాల్గొన్నామన్నారు గదా, కనీసం — అల్లంతదూరంలో అయినా అగ్నిపాలుణ్ణి చూసేవుంటారు. నేను చెపితే నమ్మటంలేదు, వకుళకు మీరైనా చెప్పండి అతడు చాలా స్ఫురద్రూపికదా," అన్నాడు.

అగ్నిపాలుడు అవునన్నట్టు తల వూపాడు.

"సరిపోయిందా? ఇప్పుడైనా నమ్ముతావా?" అన్నాడు బేతాళవర్మ, విజయం పొందినవాడిలా వకుళమాల కేసి చూస్తూ.

"అందగాడు, స్ఫురద్రూపి —అలా అనేస్తే సరిపోయిందా? షుమారుగా నువ్వూ, నేనూ ఎరిగున్నవాళ్ళల్లో ఎవరితోనైనా పోల్చిచెప్పు," అన్నది వకుళమాల.

"నేను చెపితే నువ్వేదీ నమ్మవు. అదీ విష్ణుమిత్రుణ్ణే అడుగుదాం."అంటూ బేతాళవర్మ, అగ్నిపాలుడికేసి చూశాడు.

"నేను చెప్పగలను. కాని అది అంత ఔచిత్యం అనిపించుకోదు నాకు వినయం, నమ్రతా...అలాంటి గుణాల మీద చాలా విశ్వాసం వుంది,"అన్నాడు అగ్నిపాలుడు.

వకుళమాల, అగ్నిపాలుడికేసి ఆశ్చర్యంగాచూసి, "ఏం పోతుంది. కాస్త చెప్పండి, వింటాను," అన్నది ఎంతో కుతూహలంగా.

"నా ఎత్తు ఆరడుగులు — కొంచెం ఏ నూలువాసో అటూయిటూ కావొచ్చు; అగ్నిపాలుడు కూడా సరిగ్గా కొలిచినట్టు నా ఎత్తే వుంటాడు. అవునా, వర్మా?" అన్నాడు అగ్నిపాలుడు.

బేతాళవర్మ, అగ్నిపాలుడికేసి అనుమానంగా చూస్తూ, "అవును,"అన్నాడు.

"అయితే, యిక అతడి ముఖం, ముక్కూ, కళ్ళు ... దేహచ్ఛాయా— వాటికి వద్దాం. ఆనాడు నే వెళ్ళినవిందులో చాలా వింత జరిగింది. సరే, ఆ సంగతి చెప్పేముందు, వర్మనుంచి మరో విషయం తెలుసుకోవాలి," అంటూ అగ్నిపాలుడు, బేతాళవర్మకేసి గుచ్చి చూస్తూ, "అతడి శరీరచ్ఛాయకూ నా శరీరచ్ఛాయకూ పూర్తిపోలిక లేక పోయినా, దాదాపు ఒకటిగానే వుంటుం దనుకుంటాను. నేను వారం పదిరోజులు గాయాలతో మంచం పట్టానుగదా, ఆ సంగతి గుర్తుంచుకో," అన్నాడు.

బేతాళవర్మ ఓ క్షణకాలం ఎటూ తేల్చుకోలేక తటపటాయించి, "అవును, దేహచ్ఛాయలో మీకూ, ఆ అగ్నిపాలు డికీ ఎక్కడో పోలికలున్నవి," అన్నాడు.

"ధన్యవాదాలు! అయితే యిక అసలువిషయాని కొస్తాను...ఆనాడు, అగ్నిపాలుడు చేసినవిందు సంగతి ఒక స్నేహితుడికి ఆహ్వానం రాగా, అతడి వెంట నేనూ దానికి వెళ్ళాను విందు ప్రారంభమై, దాదాపు అరగంట గడిచిన తర్వాత అగ్నిపాలుడుఅక్కడికొచ్చాడు. కారణం, హఠాత్తుగా ఆ సమయంలో నవభోజరాజు అతణ్ణి ఏదోపనిమీద రాజ ప్రాసాదానికి పిలిపించటం, ఈ లోపల —అంటే, యీ అరగంటకాలంలో, ఆయనబదులు నేనే అతిథుల-దరికి స్వాగతం చెప్పి, వాళ్ళ వాళ్ళ స్థానాల్లో కూర్చోబెట్టాను. ఒక్కగా నొక్కరైనా నేను అగ్నిపాలుణ్ణికాదని అనుమానించ లేదు," అన్నాడు అగ్నిపాలుడు.

బేతాళవర్మ నోరుతెరిచి మాట్లాడా లని ప్రయత్నించీ సాధ్యంకాక, మూగి వాడిలా వుండిపోయాడు. వకుళమాలం కూడా ఎంతో ఆశ్చర్యం కనబరిచింది.

అగ్నిపాలుడు మాత్రం యివేమీ గమనించనట్టు, దూరంగా నదిలోకి చూస్తూ వూరుకున్నాడు. ఇప్పుడు తను చెప్పినదానివల్ల, వకుళమాలకు నిజంగా తనెవరైనదీ తెలిసినా, అది తనకు క్షేమ కరంగానే పరిణమించ వచ్చునను కున్నాడు.

"మీరు చెప్పింది చాలావరకు నమ్మ దగిందిగానే వుంది," అన్నది వకుళ మాల.

"ఇందులో ఒక్కమాటకూడా నేను నమ్మను," అంటూ బేతాళవర్మ, అగ్ని పాలుడికేసి కొరకొరలాడుతూ చూశాడు

"అంటే, అగ్నిపాలుడు నా అంత అందగాడు కాదనా, నీ అభిప్రాయం, వర్మా!" అన్నాడు అగ్నిపాలుడు చిరు నవ్వు నవ్వుతూ.

"ఇది నన్ను అవమానించటం!" అంటూ బేతాళవర్మ లేచినిలబడ్డాడు కోపంతో.

"ఇందులో అవమానం ఏంవున్నది మామా?" అన్నది వకుళమాల.

"నాకు అగ్నిపాలుడితో స్నేహం లేదని, ఈ విష్ణుమిత్రుడు వ్యంగ్యంగా చెప్పజూస్తున్నాడు. ఆపాటి గ్రహించ లేని అమాయకుణ్ణి కాను, నేను!" అన్నాడు బేతాళవర్మ

"మీ ఇద్దరి స్నేహాన్ని గురించి నే నేమీ చెప్పలేదు. అగ్నిపాలుడి అంద చందాలను గురించిన చర్చ మీరే తెచ్చారు. అందులోకి నన్నులాగినప్పుడు —నా అనుభవం గురించి నేను చెప్ప వలసి వచ్చింది అవునా?" అన్నాడు అగ్నిపాలుడు

బేతాళవర్మ విసురుగా అక్కణ్ణించి వెళ్ళిపోతూ, "ఇంత అహంకారం నే నెక్కడా చూడలేదు! అందచందాలు, ఐశ్వర్యాల్లోనేకాక, శౌర్యప్రతాపాల్లో కూడా సాటిలేని వాడనిపించుకున్న, నా స్నేహితుడు అగ్నిపాలుడితో, ఈ విష్ణు మిత్రుడు తగుదునంటూ పోటీకిరావటం —ఇంతింతనరాని అసహ్యం కలిగిస్తు న్నది," అన్నాడు.

"మా మామకు గొప్పలు చెప్పకో వటం అలవాటు. ఈ స్నేహం సంగతి నిజం కావొచ్చు; అబద్ధం కావొచ్చు, చెప్పలేం! మీరేమీ అనుకోకండి," అన్నది వకుళమాల, ఎంతో వినయంగా అగ్నిపాలుడితో.

ఆమాటలతో అగ్నిపాలుడికి ఎక్కడ లేని ఉత్సాహం కలిగింది. వకుళమాల ప్రేమకోసం తను పడే తాపత్రయంలో, ఈ బేతాళవర్మ తనకు ప్రత్యర్థికాదు. ఆతడిమీద వకుళమాలకు జాలీ, స్నేహ భావంతప్ప, ప్రేమలాంటిదేమీలేదు...

'మీ మామ మనస్సుకు ఏమైనా కష్టం కలిగివుంటే, అది కావాలని బుద్ధి పూర్వకంగా నేను చేసిందికాదు. నువ్వు నన్ను గురించి అన్యథా భావించవు గదా, వకుళా.. వకుళమాలా!" అంటూ అగ్ని పాలుడు కొంచెం తొటుపడ్డాడు.

"వకుళ అనే పిలవండి, మునిగి పోయేదేమిటి!" అంటూ వకుళమాల చిన్నగా నవ్వి, తల పక్కకు తిప్పు కున్నది.

(సశేషం)






ఆమాటా, ఈమాటా కానిచ్చి చివరికి అసలు విషయం తేల్చాడు రంగనాథం.

"చూడండి, వెంకటపతిగారూ, మన రెండిళ్ళ మధ్యావున్న నా ఖాళీస్థలం అమ్మేద్దా మనుకుంటున్నానండీ."

"అలాగా?" అన్నాడు వెంకటపతి

"ఔను. డబ్బు అవసరంగావుంది మావాణ్ణి ఇంజనీరింగకి పంపుదామనుకుంటున్నాను కాస్తోకూస్తో బాకీగూడా వుంది మళ్ళీ అక్కడా, ఇక్కడా తేవటంకంటె స్థలం అమ్మేస్తే సరిపోతుందనుకుంటున్నాను. ఏమంటారు?"

"మంచిదే. ఎన్ని గజాలుంటుందేమిటి స్థలం?"

"లేకేమండీ. సుమారు వెయ్యి గజాలదాకా వుంటుంది"

"ఓహో."

"ఏదో కలిసే స్థలంకదా, ముందుగా మీతో చెబితేమంచిదని ఇలా వొచ్చాను"

"అవునవును. కాని నాకుమాత్రం ఎందుకండీ? ఉన్నది ఒక్కగా నొక్క కొడుకు వాడికిప్పుడున్న ఇల్లే చాలు లేకపోతే తీసుకునేవాణ్ణే ఇరుగూపొరుగూ గావున్నాం, మధ్యన ఇ.కొకరు రాకుండా ఉండాలని నాకుమటుకు లేదా?"

"అందువల్లే ముందుగా మీ చెవిని వేశాను పోన్లెండి, అవసరం లేకపోతే మీరు మటుకు ఏం చేసుకుంటారు?"

వెంకటపతి కొంచెంసేపు మౌనం వహించాడు తరువాత "అదేనండీ" అని ఏదో చెప్పబోయి మళ్ళీ ఆగి, కాసేపు ఊరుకుని అడిగాడు: "ఎంత చెబుతున్నారేమిటి."

"ఏదండీ, ఇంకా ఇంతని అనుకో లేదు. మావాడు పదిహేనయితే ఎవరికీ నష్టం ఉండదంటున్నాడు. అయినా మీకయితే అంతకూడా చెప్పను."

వెంకటపతి కాసేపు ఊరుకుని అన్నాడు—

"మంచిది. నలుగురికీ చెప్పండి. ఎంతమందికితెలిస్తే అంత మంచిదిగదా. మీరనుకున్న ధర రాకపోదులెండి"

వెంకటపతి తరహా చూస్తే ఆయన స్థలం కొనేట్టు కనిపించలేదు రంగనాథానికి. ఇహ కాలయాపన అనవసరమనుకుని సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు. తనకి స్థలం అమ్మే ఉద్దేశం ఉందని తెలిసినవాళ్ళకి చాలామందికి చెప్పాడు రంగనాథం. అంతేకాక వాళ్ళకి తెలిసిన వాళ్ళకి చెప్పమనికూడా కోరాడు. ప్రతి వాళ్లు ఆశాజనకంగానే మాట్లాడుతున్నారు. మాటవరసకి అవతలి వీధిలో వెంకట్రామయ్యగారితో ఈ విషయం చెప్పేసరికి "ఎంతలో ఉన్నా" రని అడిగాడాయన.

"గజం పదిహేను చెబుతున్నాను"

ఆయన ఉలిక్కిపడి ముందుకి పడబోయి తట్టుకొని "డామ్ ఛీప్" అనేశాడు.

"ధర అంతకంటే ఉన్నట్టులేదు," అన్నాడు రంగనాథం.

"మొన్నటికిమొన్న పొలాల్లోనే పది రూపాయిలిచ్చి కొన్నారండీ ప్లాట్లకి ప్లాట్లు అలా అంటారేమిటి?"

రంగనాథానికి సమాచారం అంతకి ముందు తెలియదు. "అలాగా?" అన్నాడు.

తరువాత చాలామంది ఇదే అభిప్రాయం వెలిబుచ్చారు. ధర విని "ఇంతేనా!" అనో, "ఇంకా ఎక్కువ చేస్తుందండీ" అనోచవకలోనేపోనిస్తున్నారేం?" అనో తమ తమ అభిప్రాయాలు వెలిబుచ్చేవారు వీళ్ళందరూ రంగనాథంగారికి పరిచయస్తులో, స్నేహితులో, పరోక్షస్నేహితులో మొహమాటస్తులో అయిఉన్నారు. అందరూ తమకి వీలైనంతవరకూ ప్రయత్నించటానికి వాగ్దానాలిచ్చారు ఆ వాగ్దానాలకి, వాళ్ల అభిప్రాయాలకి రంగనాథంగారు మొదట మొదట ఎంతో సంతోషించారు గాని, ఫలితం ఎన్నాళ్ళకీ శూన్యంగానే ఉండటంవల్ల ఆయన గట్టిప్రయత్నాలు చెయ్యటానికి ఉపక్రమించాడు— ప్రియోక్తులు ఒక చెవినించి విని రెండో చెవినించి పోనిస్తూ.

పరిచయస్తులవల్ల జరిగేవని హళ్ళికి హళ్ళి అని తెలుసుకున్న తరవాత రంగ

నాధం ఈ వ్యవహారం బ్రోకర్ల చెవిని వేశాడు. అదైనా ఆయన స్వంతంగా ఆలోచించి చేసిన పనికాదు. ఒకానొక ఆప్తమిత్రుడు ఆవిధంగా సలహా ఇచ్చాడు

"నువ్వు నిజంగా స్థలం అమ్మదలుచుకుంటే ఇదికాదోయ్ పద్ధతి. ఇద్దరు ముగ్గురు బ్రోకర్లకి చెప్పు. ఎంత ఎక్కువ ధర తెస్తే కమీషన్ అంత ఎక్కువ వస్తుంది గనుక, వాళ్ళు గట్టిగా పూనుకుంటారు. అంతేగాని తాలా తోలీగాళ్లతో అయేదేమీలేదు."

ఈ మాటలు రంగనాధానికి నచ్చాయి బ్రోకర్లకి చెప్పాడు. కాని ఇందులోని ధర్మసూక్ష్మం తెలుసుకోటానికి అతని కెంతోకాలంపట్టలేదు బ్రోకర్ అయినవాడు రెండు వైపులా పనిచెయ్యక తప్పదనీ, ఒకపక్షంనించి వొచ్చే లాభంకంటే రెండు పక్షాలనించీ వొచ్చేదే అధికమని వాళ్ళకి తెలియదని అనుకోటం మౌఢ్యానికి ఆఖరి కొలమానమని రంగనాధానికి స్పష్టంగా తెలిసొచ్చింది ధర పదిహేను పరిసరాల్లోకి రానేలేదు.

తదనంతరం రంగనాధం కరపత్రాలు పంచిపెట్టాడు. పట్టణం యావత్తూ మారుమోగింది. దీంతో అనుకోని మరో పరిస్థితి ఎదుర్కొంది రంగనాధానికి స్థలం అమ్మటం చాలా అవసరమనీ, యేదో ధరకి అమ్మేస్తాడనీ అందరూ అనుకున్నారు. అంచేత ధర పెరగలేదు. కాని ఆఫర్స్ మాత్రం చాలా వొస్తున్నాయి. రంగనాధం ఆ అవకాశం చూసుకుని ధర తగ్గించేధోరణి మానుకున్నాడు.

ఆఖరి ప్రయత్నంగా రంగనాధం ఈ విషయం వార్తాపత్రికల్లో ప్రకటించాడు. ఈసారిమాత్రం స్వతంత్రంగా ఆలోచించే ఈపని చేశాడు. ఇంతవరకూ ఎలాగో ఖర్చుపెట్టాడు. ఆ చేసేదేదో చివరిదాకాపోయి చెయ్యటం మంచిదనుకున్నాడు. "దీంతో స్థానిక ప్రభావాలు కొంతవరకు కట్టవచ్చు. పైనించి పోటీదారులు రావటానికి అవకాశంఉంటుంది" అని అతనికి తోచింది.

ఎలాగైతేనేం, అనుకున్నంత ధర చిట్టచివరికి వొచ్చింది. గజం పదిహేను చొప్పున బేరం కుదిరే అవకాశం కనిపించింది. నేడో, రేపో వ్యవహారం పరిష్కారమయేలా ఉంది.

"మూడు నాలుగు నెలల్నించీ ఈ గొడవతో ప్రాణం విసిగిందండీ, 'కొనబోతే కొరివి, అమ్మబోతే అడవి' అనే సామెత సార్థకమైందనిపించింది. ఎలాగో అంతు చిక్కింది; పదిహేనుకి సెటిల్ చేస్తున్నాను" అన్నాడు వెంకటపతితో రంగనాధం

"అలాగా?" అన్నాడు వెంకటపతి.

"ఔను. రేపో, ఎల్లుండో దస్తావేజు కూడా రాసేయొచ్చు. ఇవాళ మధ్యాహ్నం పరిష్కారం చేసుకోటాని కొస్తామని ఒకరు కబురు పంపారు."

వెంకటపతి ఉన్నట్టుండి అన్నాడు: "పోనీ, ఆ స్థలం నాకే అమ్మకూడదూ? మరో ఐదువందలు ఎక్కువిస్తాను, మొత్తంమీద "

రంగనాథం ఓ క్షణం దిగ్భ్రాంతుడై మళ్ళీ తేరుకొని అన్నాడు : "అంతకంటేనా? కాని ఈ అనేమాట మీ రిది వరకే అనివుంటే నాకీ ఖర్చు శ్రమ తప్పేవి మీకు ఐదువందలేకాక, ఇంకా అంతో ఇంతో మిగిలేదికదా?"

ప్రత్యుత్తరంగా ఓ చిన్న నవ్వు నవ్వాడు వెంకటపతి. "అందామనే అనుకున్నానండీ మొదట. కాని కొంచెం ఆలోచించినమీదట కావాలనే తగ్గాను "

అర్థంకాక రంగనాథం "ఎందుకూ?" అన్నాడు

"మీరు మాట అనగానే నేను తొందరపడి కొన్నానే అనుకోండి తాత్కాలికంగా మీరు సంతోషించేవారు కాని తరువాత నలుగురూ నాలుగు విధాలుగా అంటారు 'తొందరపడ్డారండీ' అనో, 'అదేమిటండీ, అంత కారుచవకగా ఎలా అమ్మారు?' అనో, 'వ్యవహారంపట్ల అంత అనాలోచితంగా ఉండకూడదండీ' అనో, 'పొలాల్లోనే పదిహేను వుందండీ ధర' అనో అంటారు వాళ్ళదేం పోయింది? మాట అనటానికి నష్టం ఏముంది? అవన్నీ విని మీరు 'నష్టపోయా' మని చింతించకుండా ఉండలేరు. మనశ్శాంతి వుండదు. అయిన ఈ కాస్త ఖర్చు, శ్రమాపాటి చెయ్యదా మనశ్శాంతి ఖరీదు?''

గతించిన అనుభవాలు స్మరణకి రాగా రంగనాథం నిజమే' నన్నాడు.

''ఇప్పుడైతే మా ర్కెట్ ధర స్వయంగా తెలుసుకొన్నారు మీరు అనుకున్నదానికంటే మరో ఐదువందలు ఎక్కువే వొచ్చాయనే తృప్తి వుంటుంది కదా నేనంతకి ముందు ఎంత ధర ఇచ్చినా మీకా తృప్తి వుండదు "

రంగనాథం తల వూపాడు. కాని అతనికో సందేహం మిగిలింది

"ఐతే మీరు కావాలని నష్టపడ్డారా?"

"నష్టమో, లాభమో ఎలా తెలుస్తుంది ముందే?"

రంగనాథం ఆలోచనగా అతనివైపు చూశాడు. వెంకటపతి చిరునవ్వు నవ్వి అన్నాడు

"మీకు చెప్పింది నాకు మాత్రం వర్తించదుటండీ? జరిగేదంతా అటునించి ఇటు అంతే."





(గత సంచిక తరువాయి)

**20**

అప్పుడే ఇల్లు చేరిన సాగరం లోపల కంచుగంటలాగ మ్రోగుతున్న గొంతు విని వాకిట్లోనే నిలబడిపోయాడు. బహు సుతారంగా మాట్లాడుతూందావిడ...

"... ఈ రోజుల్లో చనుబాలు పెట్టడం ఏమిటండీ? ఇప్పుడైనా పాలు కట్టించేసుకోవచ్చు. ఇంజక్షన్ తీసుకోండి! పురుషుడి తృప్తిగురించీ కొంచెం ఆలోచించాలి శరీరం బిగువు

జారకుండా బలంగా, ఇంపూ సొంపూ ఉన్నంత వరకేగదా ఆకదానికి విలువ! ...అసలు పాలిచ్చి పెంచటం అనేది జంతుతత్వం అంటే నమ్మండి!..."

"మీ మాటకు అడ్డొస్తున్నానను కోకండి—పిల్లల్ని కనడంకూడా జంతు తత్వమేకదా మరి"—అది గోదావరి గొంతు.

సాగరం వింటున్నాడు.

"నిజమే ననుకోండి, అంత మాత్రం చేత వాటిలాగే పాలుపెట్టాలనేది శుద్ధ తెలివితక్కువకాక మరేమిటి? వాటికి లేని తెలివితేటలు మనకున్నాయిగా. అదే మన ఆధిక్యత!"

"ఔనౌను. వాటికీ మనలాగే తెలివీ గట్రా ఉంటే అవీ దుకాణాల్లో దూరి, గాలించి కొల్లగొట్టుకు పోతూంటే—పాల డబ్బా అపురూపంగాఉన్న యీ రోజుల్లో ఇంక అడగక్కర్లేదు మనుషులపాట్లు; ఇంతకూ తెలివితేటలు వాటికి లేవుగదా పాపం! మనం అదృష్టవంతులం, మన కన్నీ ఉన్నాయి..."

"మరేంటనుకున్నారు మానవత్వం అంటే జంతువుల్లాగ ప్రకృతికి బానిసగా బతకటం కాదు—"

"ప్రకృతికి విరుద్ధంగా నడిస్తేనే మానవత్వం అన్నమాట!" అన్నది గోదావరి.

"కాక మరేమిటి! ప్రకృతిని బోల్తా కొట్టించి దాని ఆటకట్టిస్తేనే మానవత! లేనప్పుడు జంతువుల్లోనే జమ..."

"...అయితే కనడంకూడా జంతు తత్వమే అంటారన్నమాట...?" అన్నది గోదావరి నవ్వుతూ.

"అందుకే మానవత్వం సరిగ్గా అర్థం చేసుకొన్నవాళ్లు అదీ మానుకుంటున్నారు, మానేయాలంటున్నారు!" అందావిడ

"ఏమిటి మానేయడం? ... కనడమా?" అంది గోదావరి.

సంభాషణ మంచి రసవత్తరంగా సాగుతూన్నది, సాగరం వింటున్నాడు.

"ఔను ఎందుకూ కనడం?? కనీసం ఒక్కొక్కర్నే కన్నా పొంగి పొర్లు తూన్న జనాభా తగ్గే అవకాశం లేదుగా కనకపోతే నష్టమేమిటి? పైగా దేశాని కెంతో మేలు..."

"నిజమేనమ్మండీ! యువతీ తల్లిగా మారిపోవద్దు! తలిదండ్రులుగా మారి పోకండి! అంటూ యువతరాన్ని హెచ్చరించితే బాగుంటుంది కదండీ," అన్నది గోదావరి ఉత్సాహంగా.

'ముమ్మాటికీ! అంతపాటి ఆలోచనలు మనవాళ్లకు ఏడిస్తేగదూ?..." అందావిడ దీర్ఘంతీస్తూ

'అసలు పెళ్లిళ్లే జరగకుండా అటకాయిస్తే సరిపోదూ?' అంది గోదావరే మళ్లా.

"అదీ ఓ మాటే! పిల్లల్ని కనేయ

డానికి పెళ్లి ఒక లైసెన్సుగా తీసుకుంటున్నారు. పెళ్లినికూడా నిషేధించాల్సిందే- అయినా ఒకచిక్కు ఎలాగూ ఉంటుంది. పెళ్లిలేకుండానే కనేస్తాం అని మొదలెడతారు గదా అందుకే కనీసం ఒక దశాబ్దంపాటైనా కనడాలు లేకుండా కట్టుదిట్టాలు చేయాలి, కనడం నేరంగా పరిగణించాలని ఉద్ఘాటిస్తాను!''

''మీలాంటి వారే అధికారానికొస్తే శాసనం చేయగలరు కూడా ...'' అంటూ సంతోషంగా నవ్వుతూనే గోదావరి మళ్లీ ''మరైతే సుఖ:మాటేమిటి? ప్రకృతి యిచ్చే సుఖాల్ని త్యాగంచేయాల్సిందేనా?'' అంది

''అబ్బే, అలాగైతే బతకటం దేనికి? సుఖాన్ని జారవిడిస్తే మానవత గొప్పేం ఉంది?...''

''అంటే అప్పుచేసి పప్పుకూడు తిని బాకీతీర్చకుండా సృష్టికి ఎగనామం పెట్టాలంటారు గదూ!''

''అంతే. అప్పుతీరిస్తే ఏం గొప్ప?! అప్పులు నొల్లుకొని ఎగవెయ్యడంలోనే ఉంది ఘనత! అలాంటి వాళ్లకే రోజులు కలిసొస్తాయి. బాగుపడేవాళ్లంతా ఎగనామం పెట్టేవాళ్లేనంటే నమ్మండి! ఓట్లు పడ్డాక వాగ్దానాలు తీరుస్తున్నారా? సంపాదించాలంటే తీర్చడం అన్న తలంపే పనికిరాదు;...సుఖాన్ని ఎఱగా పెట్టి ప్రకృతి వల పన్నితే. సుఖాన్ని జుర్రుకొని వలను ఛిన్నాభిన్నం చేసి ప్రకృతిని బోల్తా కొట్టించాలి—అందుకే గద ప్రకృతి-పురుషుడు అన్నారు పూర్వకాలంనించీ; పురుషుడు అంటే కేవలం మగవాడు అనికాదు దాని అర్థం. జంతువులకంటే అత్యున్నత స్థానం సంపాదించిన మేధస్సుగల మానవత్వాన్నే పురుషుడన్నారు! మానవ మేధస్సుకి అసాధ్యమంటూ లేదు. ప్రకృతిని కీలుబొమ్మలాగ ఆడుకోవాలి. ఆనందించాలి అనే సందేశాన్నే ఆనందో బ్రహ్మ అన్నారు. మానవత ఆ దశకు చేరుకొని ప్రకృతినే మోసగించి విజయ పతాకం ఎగరవేస్తుంది. అలా అలా మానవత సాధించాలి!......'' అంటూ ఆవిడ చెప్పుకుపోతూంటే,

''మీరు చెప్పిందంతా మనలాంటి వాళ్లకు తెలుస్తుంది, అనుసరిస్తారే అనుకోండి—కాని — చదువూ తెలివీ లేని అలగాజనానికి ఏం తెలుస్తాయి? ఏం సాధిస్తారు? ఎంత వద్దంటున్నా వాళ్ల సంఖ్య పెరుగుతూనే ఉంటుంది. వాళ్లకెలాగ తెలుస్తుందండీ మీరు చెప్పే మానవత్వం అదీను?'' అంది గోదావరి.

''మనలో మాట ..., కష్టపడి, వొళ్లొంచి చాకిరీచేసే శ్రామికవర్గం ఉంటేనేగదా మన వ్యాపారాలు,సుఖాలు, సౌఖ్యాలు అన్నీను· వేలకు వేలు ఒక్కసారిగా గుత్తగా ఓట్లు సంపాదించాలన్నా, వాళ్లని వెనకేసుకొని నాయకత్వాలు, ఉద్యమాలు నడపాలన్నా పెద్ద




లవాలన్నా వాళ్లుండాలి; ఇంకా ఉండాలి, వాళ్ల సంఖ్య ఎంత పెరిగితే అంత మంచిది. వాళ్లమూలకంగా మనకూ లాభాలున్నాయి. అంతా మన మంచికే అనుకోండి!'' అంటూ కంచుగంటలాంటి గొంతును తగ్గించేసుకొని ధర్మసూక్ష్మం చెప్తున్నట్టు మెల్లిగా చెప్తూ తక్కున ఆగిపోయిందావిడ, టైము చూసుకుంటోందేమో,...

"...అబ్బో చాలా టైమైందే! మీకూ భోజనాల వేళయిందనుకుంటాను ... " అంది.

''ఇంకా లేదులెండి, తినడం ఎప్పుడైనా తింటాం. ఇలాంటి మాటలు మళ్ళీ వినాలంటే వినగలమా? అబ్బ! ఎంత చక్కగా చెప్పారండి! మా ఇంట్లోనూ చెబుతారు, ఏవో కథలనీ, కబుర్లనీ ఏదో సోదె! ఇలాంటి విషయాలు ఒక సారైనా చెప్పిన పాపాన పోతేగదూ, రాస్తే ఇలాంటివే రాయాలి! చదవడానికీ వినడానికీ ఎంత బాగుంటాయి! మీరు చెప్పినవన్నీ రాద్దామనిపిస్తున్నదంటే నమ్మండి!" అన్నది గోదావరి పరమానందంగా.

వింటూన్న సాగరం ముఖం మాడ్చుకున్నాడు.

"ఆమాటకే వచ్చారు గనక చెప్తున్నా. ఇలాంటి విషయాలన్నీ కలిపి నేనే రెండువేల అరతావుల చిల్లర వ్రాశాను. వెధవది యిప్పుడు కాగితం కరువొచ్చి పడిందిగాని, లేకుంటే యీసరికిఅచ్చులో వెయ్యిన్నర పేజీల 'విషభాండం' వెలువడి ఉండాల్సిందే!—'' అన్నదావిడ గంభీరస్వరంతో.

"విషభాండమా?!'' అంది గోదావరి అరుస్తూన్నట్టుగా.

''ఔను, మనవాళ్లకు ఒకంతట మ్రింగుడుపడని విషయాల గ్రంథం గనక విషభాండం అని పేరుపెట్టాను.''

"ఇలాంటివన్నీ ఇదివరకే ఎవ

రెవరో చాలా రాసిరాసి అగ్రసవ్యాసం చేశారని విన్నానే?" అన్నది గోదావరి.

"ఏమో మరి, నేనవేవీ చూడనేలేదు. చదవలేదంటే నమ్మండి! అయినా మళ్లీ రాస్తే ఏం? అచ్చయితే ఏం? తీసిన సినిమాల్నే మళ్లీమళ్లీ తీస్తుంటే చూస్తున్నారుగా!"

"ఔన్లెండి, విషభాండం నాకోటి రిజర్వు చేయాలండోయ్!"

"ఎంతమాట! మొదటి కాఫీ మీదే..! ఇంతకూ అసలుసంగతి మరిచేరు మీరు! ఐదువేల దాంటోనైనా మీరు తప్పక చేరాలి సుమండీ! మళ్లీ శనివారం వస్తా..."

"కాఫీ అయినా తీసుకున్నారు కారు..."

"దానికేంలెండి. మొదట్నే చెప్పానుగా, కాస్త చురుగ్గా ఉంటానికీ ఒళ్లు బాగుంటానికి టానిక్కుల్లాంటి డ్రింకులు తప్ప కాఫీ, టీ లు మానేసి చాలాకాల మైందని...వస్తా...మర్చిపోకండి!..." అంటూనే ఆవిడ ఇవతలకి వచ్చింది.

సాగరాన్ని చూసీ చూడనట్టుగా వయ్యారంగా ప్లాస్టిక్ 'హస్తభూషణ్' సంచీ ఊపుకొంటూ వెళ్ళిపోయింది

నున్నగా బలంగా యెదిగిన ఆవిడ పెద్దవీపు, గులాబీ ఒంటిగా వారగా కురిమిన పెద్దసిగ లేపాక్షి బసవయ్యను గుర్తుకు తెస్తున్నాయి ముందేమున్నది అందం, అంతా వెనుకనే —వెనకతట్టు అందం రోజురోజుకీ ఎంత అద్భుతంగా పెరుగుతున్నది! అనుకుంటూ సాగరం లోపలికెళ్లి అమృతలక్ష్మిని హత్తుకొని ఉన్న గోదావరిని చిరుకోపంతో ప్రశ్నార్థకంగా చూశాడు

నిద్రపోతూన్న అమ్మని మంచం మీద వేసి గోదావరి, "మరేంలేదు, పట్నంలో పెద్ద చిట్‌ఫండ్ కంపెనీ వాళ్లదే కొత్తగా పెట్టారట. వెయ్యి రూపాయల జీతంమీద పనిచేస్తోందిట, పాడకుండా చివరివరకూ ఆగితే సగానికిపైగా లాభమేనట. బోలెడంత డివిడెండ్లు వస్తాయిట, నన్నూ కట్టమనిచెప్ప వచ్చింది" అంది

"అంతేగాకుండా హితోపదేశంకూడా చేసిందన్నమాట..."

"అదా సంగతి, మీ చిరుకోపమూను; దొంగలాగ అంతా వింటున్నారని నాకు తెలుసులెండి, ఆవిడ డైము చూసుకుంటున్నప్పుడు కిటికీలోంచి మీ నీడ అరుగు మీద కనిపెట్టాలెండి ఏదో ఇంటి కొచ్చింది—ఆ మాత్రంఉబ్బవేసి వింటే ఏం పోతుంది అని..."

"పోతే ఆకలేపోతుంది, కడుపునిండా విందారగించినంత అయిందిగా. పైగా విషభాండం కూడా అందుతుంది. మళ్ళీ శనివారం వస్తుందిగా?..."

"ఇంతటితో శని వదిలేటట్టు లేదు. ఏం ఆవాళ కాచుకూర్చుంటారా? ముచ్చటించడానికి..."

"అఁ—ఆ విషభాండాన్ని త్వరగా బద్దలుకొట్టిద్దామని—అంటే వెలువడ్డా నికి సహాయపడగలనేమో చూద్దామని."

"అంతపని చేయకండి. హాలా హాలాన్ని మింగటానికి యిక్కడ శివు డెవడూ లేడు..."

"ఉందిగా అవ్వ! ఎలాంటి హాలా హాలాన్నైనా హల్వాలా చేస్తుంది..., అని సాగరం అంటున్నాడో లేదో, వంటగదిలోంచి సోమ్మవ్వ అరుస్తూ, "ఏఁవిటర్రోయ్! నన్ను లాగుతున్నారు, ఉల్లి పాషాణంలాంటి విషంకూడా మందుగా పనికిరావటం లేదూ? అలాగే ఆవిడ మాటలూను; విడ్డూర పడనక్క ర్లేదు, ముందుకాలం వాళ్లదే! పెర క్కుండా తరక్కుండా మనుషులు దేవ తలై తిరుగుతారు. కాలం అన్నీ తీరు స్తుంది, ఇప్పుడు కాదనుకున్నదే రేపు ఔననిపిస్తుంది —అంతా ఆ చక్రధారి లీలరా! లీల!" అన్నది

"అబ్బో!! దిగమింగకుండా, కిమ్మన కుండా అవ్వకూడ విన్నదన్నమాట! ...ఐతే ఆ మానవతావతి— కాదు— మానవవతి—లేదా మానవతి సామాన్యు రాలేం కాదు. అవ్వకూడా బలపరుస్తు న్నది! లెంపలేసుకుంటున్నాను—సరిగ్గా అంచనా వేసుకోలేక పోయినందుకు; ...కాని అదేదో ఎగనామం మానవతా చీట్... కంపెనీకాదని అనుకుంటాను గాని, ఇంతకూ ఆవిడగారు బిడ్డల్ని కన్నదో లేదో అడిగావా మరి!..." అన్నాడు సాగరం.

"హయ్యోరామ! ఆవిడ మిస్ అండీ! మిస్ లతాంగి..."

"అంటే కన్య! చాలా పెద్ద కన్యే సుమీ. వనస్పతి లతలాంటి లతాంగి; మానవిగా దిగిన ఊర్వశి లాగుందంటే నమ్ము! ఉద్యోగభారంవల్ల పటుత్వం కొంచెం జారినట్టుందిగాని ఫర్వాలేదు. భారీకన్య...నిజానికి నాకూ ఇప్పుడని పిస్తూన్నది సుమీ, అలాంటి మానవతి-కాదు—మానవతావతితో మానవత్వం సాధించాలని, ఇంతకూ ఆ గీతలేదు, స్వయంకృతాపరాధం ..." అన్నాడు సాగరం.

ఈసారి ముఖం మాడ్చుకోవడం గోదావరివంతు అయింది. సాగరం చెల్లు వేసుకొన్నాడు.

"అంటే నన్ను చేసుకొని మీరు జంతువైపోయిందిగాక నన్నూ చేశా రన్నమాట; మనం జంతువులుగానే మిగిలిపోయాం, ఏంచేస్తాం — అంతా అయ్యాక" అంది గోదావరి ఉక్రో షంగా.

సాగరం చిరుకోపం మాయమైంది. నవ్వుతూ, "ఇంతకూ అమ్మకి పాల సంగతేం చేద్దామనుకుంటున్నావ్?" అడి గాడు

"అదే ఆలోచిస్తున్నాను. మీరూ అలాగే..." నసిగింది గోదావరి.

"అంటాననుకున్నావ్; గోదావరీ ఒకటిమాత్రం బాగా నమ్ము! పాలివ్వ —మాను; అమ్ము పుట్టింతర్వాత నువ్వు నాకు ఒక తల్లిగా కనిపిస్తుంటావేగాని తరుణిగా కాదు, గులాబీ కన్యలాగ కాదు. అలా కనిపించాలని కోరనుకూడ; తల్లి ముద్ర పడకనే పోవాలిగాని, పడ్డాక నీలోని తల్లితనం మరుపుకురాదు. ఆ మానవతా గీతోపదేశికులాలు శరీరాల మట్టుకే చెప్పిందిగాని, మనుషుల మన స్సుల తేడాలగురించి ఆలోచించినట్లు లేదు. ఒక్కొక్కప్పుడు నాకు అని పిస్తూంటుంది—యీ పురుషులు ఒక బిడ్డను కన్నాక ఆ తల్లిని మళ్లా ఎలాగ తాకగలుస్తున్నారా?! అని,..." అంటూ సాగరం అంటూంటే,

"అందరూ మీలాగే అనుకుంటే కృష్ణపరమాత్మల్లాంటి వాళ్లెలావస్తారూ? అని అడుగుతున్నారండీ చాదస్తులు," అన్నది గోదావరి.

"కృష్ణపరమాత్మ మాటకేంగాని, బిడ్డ చంపుతాడని, బిడ్డల్ని కంసుడు చంపుతాడని తెలిసికూడా కన్నారే. ఆ దేవకీ వసుదేవుల గురించి తలంచు కుంటూంటే ఎక్కడలేని వికారమూ వస్తూంటుంది నాకు..."

"ఆ కంసుడుకూడ దద్దమ్మే. వాళ్ల నసలు ఎందుకు సంసారం చేయ నివ్వాలి?" అని పెంకెగా నవ్వుతూనే, "దానికేంగాని, ఒకటడుగుతాను నిజం చెప్పండి...మీకు ఒక తమ్ముడో, చెల్లెలో, అన్నో, అక్కో ఉంటే ఎంత బాగుం డును అని ఎప్పుడైనా అనిపించలేదూ?" అని అడిగింది గోదావరి నిదానించి చూస్తూ.

"గోదావరీ!..." అంటూ సాగరం కాస్సేపు ఊరుకొని, "ఎంత బాగా అడి గావు గోదా! కనీసం ఒక చెల్లెలో, అక్కో ఉంటే ఎంత బాగుండును! అని ఎన్నిసార్లు అనుకున్నానో నీకెలాగ తెలుసు?!" అన్నాడు.

"అలాగే నాకో అన్నో, తమ్ముడో లేకపోయారే అని నేనూ అనుకుంటాను గదు!" అన్నది గోదావరి.

"ఔను, తోడబుట్టిన వాళ్లుండాలి. ఇంట చవిచూసేనేగదా మానవులంతా ఏక కుటుంబీకులనే భావన ఏర్పడేది! ..." అని అంటున్న సాగరం మాటలు వినిపించుకోనట్టుగా గోదావరి అవతలకు చూస్తూంటే అటే చూశాడు.

గేటుదగ్గిర నాలుగు కుక్కపిల్లలు నిలబడి ఉన్న తల్లిపాలు ఎగబడి తాగు తున్నాయి. అవి చప్పరిస్తున్న చప్పుడు సామవేదంలాగ వినిపిస్తూన్నది.

గోదావరి మాట్లాడకుండావెళ్ళి గిన్నె నిండా అన్నం పట్టుకొచ్చి తల్లికుక్కకు వేసింది. అది తోకాడిస్తూ తింటున్నది, పిల్లలు తాగుతూనే ఉన్నాయి.

సాగరం వింతగా చూశాడు గోదా వరిని



"పిల్లల కుక్కకు కడుపునిండా అన్నం పెడితే నాలుగువేదాల పుణ్యం! అని చెప్పిందండీ అవ్వ" అన్నది గోదావరి.

"సరేగాని, అమృతలక్ష్మి పాలసంగతేమంటావు? డబ్బాల సేకరణ జరగాల్సిందేనా? నీ శరీరారోగ్యం, బాగోగుల విషయంలో నీ హక్కులు నీకున్నాయి ..." అన్నాడు.

"అలాగే నా బిడ్డకు తల్లినుండి పాలు తీసుకొనే హక్కుకూడా ఉంది!" అంటూ గోదావరి ప్రకృతి మాతలాగ నిల్చుని, "నోటితో చెప్పకుండా చేసి చూపించాను, ఆమాత్రం తెలుసుకోలేక పోయారా? పుష్టిగా తింటాను, పుష్టిగా పెంచుతాను!" అన్నది.

 గరం విప్పారిన ముఖంతో "సరేగాని ... పాలు పెట్టడం సంగతే — ఇప్పటి మాటకాదు, గతించిన రోజుల్లో ..." అంటూ ప్రారంభించాడు—

"ఆ రోజుల్లో...తెల్లదొరతనం చల్లగున్నంతకాలం మనకేం ఫర్వాలేదని జమీందార్లూ, శ్రీమంతులూ హాయిగా కులుకుతూ ప్రభుభక్తి పరాయణులై ఉంటూ ఉంటే—మరోవంక దొరతనం అండతో కొండజాతులవాళ్లకీ ఆటవికులకీ జరుగుతూన్న అన్యాయాలకీ, అక్రమాలకీ ఎదురు దెబ్బగా — పాలకొండ కొండల్లో దండు సమకూర్చుకొని తాతారాజులాంటి పితూరీదార్లు దొరతనానికి పక్కలో బల్లెంలా ఉంటున్న రోజుల్లో...

గోదావరీ, కల్పనలూ, కాలక్షేపాలూ, చక్కిలిగింతలుపెట్టే కాముకలీలల పంచరంగుల కలలూ ఎన్నైనా ఎప్పుడైనా చదువుతావు, వినగలవు — కనగలవు, కాని—ఇలాంటిదీ వినాలి! విను—




'పార్వతీపురం ప్రాంతంలో పాల కొండ కొండల దాపుల్లో ... హిరణ్య భూపతి అనే చిన్న జమీందారు, లేక పెద్ద శ్రీమంతుడున్నాడు; హీరాభూపతి హీరా బాబు అని పిలుస్తూండేవారు.

దివాన్ బహద్దర్‌లాంటి బిరుదునో, విక్టోరియా పతకాన్నో సంపాదించే ఆశ యంతో దొరతనంవారి అనుగ్రహం కోసం, వారు చేస్తూన్న శాంతి భద్రతల రక్షణకు ఎన్నోవిధాల సహకరిస్తూండే వాడు.

అతడికి ఒకే ఒక కొడుకు. ఆ కొడుక్కి పేరు పెట్టడంలో కూడా ప్రభుభక్తినే కనపర్చేలాగ 'ప్రభుదాస్' అని పేరుపెట్టుకున్నాడు.

ప్రభుదాసుని 'ప్రభు'అని పిలుస్తూండే వారు. ఆ ప్రభు శ్రీమంతుడి కొడుకు లాగ మేడల్లో కులాసాగా గడపడం మానేసి, కొండవాళ్లతో సావాసంచేస్తూ కొండల్లోనూ, అడవుల్లోనూ తిరుగు తున్నాడనీ, ఇదంతా ఒక సవర చిన్న దానితోగలతగులాటం మూలంగా జరిగిం దనీ తెలుసుకున్న హీరాభూపతి హిరణ్య కశిపుడులాగ మండిపోయి, కొడుకు చెవిని పడకూడని ఒక మాట...ఆగ్ర హావేశంలో అనేశాడు, అదంతా ఒక కథకాని పెద్దకథ ... ఆ చిన్నదానితో ప్రభుకి జోస్తి ఏర్పడడం కూడా చిన్న కథే...ఎలా జరిగిందంటే..." అంటూ సాగరం చెప్పబోతూంటే,

"అన్నాలు తినండర్రా! తర్వాత కథ కానిద్దురుగాని!" అంటూ వంటిం టోంచి సోమ్మవ్వ పెద్దకేక వేసింది.

అమృతలక్ష్మి మంచి నిద్రలో ఉంది. "అలాగే కానిద్దాం పద..." అంటూ సాగరం దారితీశాడు.

ఏమిటా ఒకమాట? ఎలా జరిగిందా పరిచయం? అని గోదావరి అనుకుంటూ అనుసరించింది




వీరన్న బలశాలి. మంచి వస్తాదు. అలాంటి వా డిలా అవుతాడని ఎవరూ కలలోకూడా అనుకోలేదు.

ఆరోజు ఎప్పటిలాగే తెల్లవారు ఝామున కోడికూసేవేళ లేచి చెరువుకు పోయి, మొహం కడుక్కొని తాలింఖానాకు పోయాడు. కసరత్తు చేయడానికీ, కుస్తీలుపట్టడం అభ్యాసం చేయడానికీ ఓ పదిమంది చేరుతారక్కడ ప్రతి రోజూ. వారందరికీ, చిన్నవాడైనప్పటికీ వృద్ధిలోనికి వచ్చినవాడు కాబట్టి వీరయ్య అంటే గౌరవం. ఆసీమలోకల్లా ఊరూ పేరూ వున్నవాడు కదామరి. ఆ చుట్టుపట్లవున్న నాలుగైదు పట్టణాలకూ పోయి ఎవరైనానరే కుస్తీకి రమ్మని, నూటపదహార్లు పందెంవేసి, బస్తీమే సవాల్ చేశాడు వీరయ్య. ఆ యా వూళ్ళలోని వస్తాదు లందరినీ చిత్తుచేసి, మెడలో పూలదండలతో భీమసేనుడిలా తిరిగివచ్చాడు. చాలమంది పంజాబీ పయిల్వానులను కూడా చిత్తుచేసి, తన పేరు వారికి కలకాలం జ్ఞాపకముండేటట్లు చేశాడు.

వీరన్న ఒడ్డూపొడవూ వున్నమనిషి. కసరత్తువల్ల కండలు తిరిగిన శరీరం, తివాసీగుండు. చిన్నప్పుడు జబ్బుచేస్తే కుడికంటికీ, చెవికీ మధ్య సిలువునా, తరిగిన దొండకాయ ముక్కంత వాత పెట్టిన మచ్చ. మెడలో ఆంజనేయుడి బిళ్ళ, జబ్బకు బంగారు తావేజు ఎండలో నిగనిగ మెరిసేవి. లంగోటీ బిగించికట్టి, ఒంటికి రేగడిమన్ను రాసుకుని, గురువు పాదాలకు దండంపెట్టి, నోట్లో పళ్ళ మధ్య నిమ్మకాయ కొరుకుతూ, తొడ చరిచి కుస్తీకి తలబడితే ఎదుటివాడి గుండెలు భయంతో గడగడ వణకేవి. చూసేవారిలో ఉద్రేకం ఉప్పొంగేది.

అలాంటి వీరయ్య ఇలా అవుతాడని ఎవరూ కలలోకూడా అనుకోలేదు

చెరువులో స్నానంచేసి, మల్లుపంచి కట్టి, మల్లుచొక్కా వేసుకుని పావంచాల మీదికివచ్చి బీడీ వెలిగించాడు. బట్టలుతుక్కోడానికీ, స్నానాలు చేయడానికీ చెరువుగట్టుకు వచ్చిన ఆడంగులు వీరన్ననుచూసి ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు. ''ఏటి ఈరన్నా ఎక్కడికేటి యీ ముస్తాబు. ఏటి ఇసేసం'' అన్నారు పల్లెపడుచులు.

''నెల్లిమరలలో అమ్మోరి సంబరం చూదాం రమ్మంటున్నాడు ఎంకయ్య బావ. కరుసు ఆడిదేలే'' అన్నాడు వీరన్న బీడీపొగ వదులుతూ.

''నేకపోతే నువ్వెడతావేటి, పిల్లికి బిచ్చం పెట్టవు నువ్వా'' అంది గొల్ల పిల్ల నరిసి.

"ఓసి, ఊరుకోయే పిన్నమ్మా నా సంగతి నీ కేటెరిక'' అని పక్కనున్న బిందెను కాలుతోతోశాడు. బిందెచప్పుడు చేసుకుంటూ రెండు పావంచాలు దొర్లింది వీరన్న "హి, హి, హి" అని నవ్వేడు.

''ఏటిరోరయ్యా ఆ పోగాలం, బాదం పప్పుతిని కసరత్తుసేత్తే ఒళ్ళు కొవ్వెక్కినట్టుంది,'' అంది నరిసి.

"ఆడోళ్లు సిల్లోసుకుంటారు, నువ్వేటిక్కడ, ఫో అవతలికి" అంది ఇంకో పిల్ల.

వీరన్న నవ్వుకుంటూవెళ్ళిపోయాడు. వెంకయ్యతో కలిసి నెల్లిమర్ల సంబరానికి వెళ్ళేడు. వెంకయ్య, వీరన్న స్నేహితుడు వెంకయ్యకూ, వీరన్నకూ నేస్తం ఎలా కుదిరిందో అందరికీ ఆశ్చర్యమేః ఏవిధంగానూ యిద్దరికీ పోలికలేదు. వీరన్న వస్తాదు. వెంకన్న సన్నగా పొడుగ్గా ములక్కాడలా వుంటాడు. వీరన్న మొద్దువాడిలా కనిపిస్తాడు. వెంకయ్య తెలివైనవాడిలా మాట్లాడుతాడు. అసలు రాంమందిరంలో భజనకు వెళ్ళినప్పుడు కలిసింది వీరిద్దరికి నేస్తం. వీరన్న పాడితే, వెంకయ్య డోలకు వాయించేవాడు

సంబరం చూసుకుని యింటికి తిరిగి బయలుదేరేసరికి చీకటిపడింది. ఊరు పొలిమేరల కొచ్చేసరికి రాత్రి పదిగంట

లవుతుంది. వెంకయ్య అలసిపోయాడు. ఊరుబయట పాడుపడిన దేవాలయం మెట్లమీద చతికిలబడ్డాడు.

"ఏం వెంకయ్యా, రెండుకోసుల దూరం నడి చేసరికే అలిసిపోనావేట్రా. ఇలాగైతే ఎలా బతుకుతావేశ్"అన్నాడు వీరన్న.

"ఒంట్లో బలం లేదు ఏటి చెయ్య మంటావు. అయినా బతకడానికి బలమే ఉండాలేటి, ఎర్రిగాని''అంటూ వెంకయ్య మెట్లమీద నడుం వాల్చేడు. ఇద్దరూ బీడీలు వెలిగించారు.

ఆ కారుచీకట్లో వాళ్ళ బీడీనిప్పులు తప్ప మరేం కనబడడంలేదు. అమా వాస్య రాత్రిల్లు, వెనుకను పాడుపడిన కోవెలచుట్టూ అడవి బలిసింది. ఆ నిశ్శ బ్దంలో కీచురాళ్ళ శబ్దంమాత్రం వినిపి స్తూంది. దూరాన వూరిలో ఒకటి రెండు దీపాలుమాత్రం మినుకు మినుకు మంటున్నాయి.

వీరన్న ఆలోచిస్తున్నాడు. ఒక్క బలం ఉన్నంతమాత్రాన అంతా సిద్ధించి నట్టేనా? మనిషికి బలం ఒక్కటేకాదు కావలసింది మావటివాడికి ఏం బలముం దని ఏనుగును లొంగదీసుకున్నాడు. పీర్లపండుగనాడు సాయిబు అగ్గిలోంచి నడుస్తాడు వాడికేం బలముందని?

- అవును వెంకయ్య చెప్పింది నిజమే. వెంకయ్య తెలివైనవాడు. "ఎంకయ్యా" అని పిలిచేడు. వెంకయ్య నిద్రపోతు న్నాడు. అలసివున్నాడేమో కునుకు పట్టింది.

"ఏం ఈరన్నా! పోదామా"అన్నాడు వెంకయ్య కొంచెం ఒత్తిగిలి.

''దప్పికగా వుంది. ఇక్కడెక్కడేనా నీరుందిరా" అన్నాడు వీరన్న.

"వెనుక గుడిప్రక్కనే నుయ్యి వుందిరా. అక్కడే బాల్చీకూడా వుంటుంది సూడు."

వీరన్న నూతిదగ్గర కెళ్ళేడు. ఎదురుగుండా దూరాన మైదానం కని పిస్తూంది. నల్లటి కంబళికి కన్నాలుపడి నట్లు చుక్కలు మినుకు మినుకు మంటు న్నాయి. గాలి చలనంలేదు చీకట్లు జిమ్ముకుంటూ చెట్లమీద ముసురు తున్నాయి. దూరాన ఈతచెట్లు తల విరబోసుకున్న దెయ్యాల్లాగున్నాయి. కీచురాళ్ళ శబ్దం శరీరమంతటికీ తాకు తున్నట్టనిపించింది. దూరాన మైదా నంలో ఏదో మంట, మంటవెలుగులో తెల్లచీర కట్టుకున్న ఒక స్త్రీ నడిచివెళ్ళి నట్లు అనిపించింది. వీరన్న జాగ్ర త్తగా తేరిపార జూశాడు అబ్బే, అది స్త్రీ కాదు. ఏదో ఆవు అయివుం టుంది అనుకున్నాడు. తన కాళ్ళ లోంచి ఏదో పరుగెట్టినట్టయింది. త్రుళ్ళి పడ్డాడు. ఏదో కిచకిచమని అరిచింది. ''చెయ్! ఎవరక్కడ?'' అని కేక వేశాడు. అగ్గిపుల్ల తీసి వెలిగించి చూశాడు. నూతి గట్టునుంచి ఉడత

అటు పరుగెత్తింది. వీరన్నకు దాహం పోయింది. తిరిగి వచ్చేశాడు.

"ఎవరురా అది ఈరన్నా, ఏటి కేకే స్తున్నావ్" అన్నాడు వెంకయ్య లేచి కూర్చొని.

"ఎవరూ నేదేళ్, ఉడతపిల్ల కాల్లలో పడింది."

"ఈరన్నా, ఎంత పిరికోడివిరా నువ్వు."

"ఛః నాకు భయమేటిరాః"

ఇద్దరూ లేచి, బీడీలు వెలిగించి ఊరు వేపుకు నడక ప్రారంభించారు. ఆ నిశ్శబ్దం వీరన్నకు నచ్చలేదు.

"ఎంకయ్యా, మంచి కునుకు తీసేశావ్."

"నేదురా, కొద్దిగా కళ్లమూసా. ఇప్పుడెంత రేతిరి అవుతుందోగాని మహా చీకటిగా వుంది. దారి సమంగా ఆన కుండా వుందేళ్."

దూరాన్న మైదానంలో ఇందాకటి మంట యింకా మండుతూనే వుంది. "ఏటిరా ఆ మంట, ఎంకయ్యా" అన్నాడు వీరయ్య. "ఏది, అదా? శ్మశానం గదరా అది. ఎవర్నో తగ లెడుతున్నారు గాబోలు"

"దీని తస్సాదియ్యా, ఎంతసేపు మండుతూందిరా." వీరన్నకు భయం వేసిందని వెంకయ్య గ్రహించాడు. తాను బలశాలినని గర్వంతో విర్రవీగే వయి ల్మాను ఇంత పిరికివాడని తానింతకాలం ఊహించలేదు. చిరుతపులిలా మను షులమీదికి ఉరికే వీరన్న అకారణంగా చెట్టునో, పుట్టనోచూసి జడుస్తున్నాడు.

వీరన్నను ఇంకా భయపెట్టాలనిపిం చింది వెంకయ్యకు.

"ఈరన్నా రాత్రేళ చీకట్లో నువ్వి టేపు రానేదేటి? ఇక్కడట్టే భయం లేదుగాని ఆ తోట దాటి ఎల్లడంమంచిది కాదు, శ్మశానంగదరా. దెయ్యాలు తెగ తిరుగుతాయి. మనిషి ఒంటరిగా దొరికి నాడంటే పీక్కుతినేస్తాయి. కోమటోల్ల పిల్ల చచ్చిపోయిందిగదా, అది దెయ్య మయింది. ఆ దారంటెవడైనా ఎల్తితే ఎనకనుంచి పంచకొంగు పట్టుకు లాగు తాది" అని వెంకయ్య, వీరన్న మొహం చూశాడు.

వీరన్న మొహంలో భయం కనిపిం చింది. ఆ మానవాతీతమయిన శక్తి స్వరూపం ఎలావుంటుందో ఊహించుకో డానికి ప్రయత్నిస్తున్నాడు వీరన్న.

"ఎలాగుంటుందిరా దెయ్యం?" అని అడిగేడు.

"నువ్వు సూడలేదేటి ఎప్పుడూ? అది నల్లగా మొహం, పెద్దపళ్ళు; మహా వికా రంగా వుంటుంది. తెల్లచీర కట్టుకుం టాది. రవిక ఏసుకోదు. మనం సూస్తుం డగానే శరీరం ఎదిగిపోతాదొరే. కాళ్ళు తాటిచెట్లులాగ, చేతులు మర్రిఊడల్లాగ ఎదిగిపోతాయి. మనిషి వెనకాతలే చేతులూపుకు నడుస్తాది. భయంకరంగా




నవ్వుతాది, ఏడుస్తాది.'' వెంకయ్యకు మరి యింతకంటె భయంకరంగా వర్ణించడం చాతనయింది కాదు.

"అయితే అది మనుషుల్నేటీ సెయ్యదా." అని వీరన్న అడిగేడు. వెంకయ్యకు నవ్వొచ్చింది. అది విజయ గర్వంతో కూడిన నవ్వు. ఆ ప్రశ్నతోనే వీరన్న మనస్సులోవున్న భయాన్ని అర్థంచేసుకున్నాడు వెంకయ్య. నవ్వు అణచుకుని, "మనం దండంపెట్టి ఆంజనేయదండకం సదువుకుంటే ఏం చెయ్యదు. మాయమైపోతాది. ఏమాత్రమైనా జడిసినామా అంటే పీక పట్టుకుని నులుపేసి, తినేస్తాది. దెయ్యమంటే మరేటి?" అన్నాడు అదొక సామాన్యమైన విషయంలాగ. వీరన్నను బాగా భయపెట్టగలిగినందుకు తనలో తాను సంతోషించాడు.

చీకట్లో కుక్కలుమొరుగుతున్నాయి. కాబట్టి ఊళ్లోకి వచ్చినట్లు జ్ఞాపకమొచ్చింది వీరన్నకు. ఊళ్ళో అంతా నిద్రపోతున్నారు వీరన్న, వెంకయ్య ఎవరి మానాన వారు పోయి పడుకున్నారు.

తెల్లవారేక ఊళ్ళో నలుగురూ యీ మాటే అనుకుంటున్నారు వీరన్నకు నిన్న రాత్రి పాడుపడ్డ కోవిలదగ్గర దెయ్యం కనిపించిందనీ, వాడిబట్టపట్టుకు లాగిందనీ, శ్మశానంలోంచి దెయ్యాలు రాళ్ళు రువ్వాయనీ, దానితో వీరన్న జడుసుకున్నాడనీ, యిలా చిలువలు పలువలు కల్పించి చిత్ర విచిత్రంగా చెప్పడం మొదలెట్టేరు. కనబడిన ప్రతివాడూ "ఏం జరిగింది ఈరన్నా" అని అడగడమే. బాగా పరిచయమున్న మిత్రులు, "ఓస్ ఇంతేనట్రా వీరన్నా నీ ధైర్యం! ఒంట్లో ఊపిరి లేకపోయినా నీకంటే ఎంకయ్యే నయం" అని వేళాకోళం చేశారు. చెరువుగట్టున పల్లెపడుచులు వీరన్నను చూసి వేళాకోళం మొదలు పెట్టేరు. ''ఏటిరోరన్నా, శరీరం పెంచగానే సరా చెప్పు" అని

ఒక అమ్మి అంటే "ఆడోళ్ళకాడ పెద్ద కబుర్లు చెప్పడమేటి, గుండెధైర్యం ముండాల''ని ఇంకో అమ్మి హాస్యమాడింది. వీరన్న స్వతహాగా గర్విష్టి. ఇది తన కెంతో అవమానకరంగా వుంది. వెంకయ్య తెల్లవారేసరికి ఊరంతా యీ వుకారు లేవదీసి వుంటాడు. ఆడంగుల దృష్టిలో కూడా తను అపహాస్యం పాలయాడు. ఎంత తలవంపు! తన ప్రతిష్ఠకు ఎంత దెబ్బ! దీనిని వెంటనే ఎదుర్కొని తీరాలి, అనుకుని వీరన్న ఛాతీ విరుచుకుని వీధిలో నడక ప్రారంభించాడు.

ఊరు నడిబొడ్డులోవున్న వేపచెట్టు క్రిందికి వచ్చాడు. అక్కడున్న బండ రాయిమీద వెంకయ్య, మరి కొందరు మిత్రులు వేపపుల్లలతో పళ్ళు తోముకుంటూ, లోకాభిరామాయణం చర్చిస్తున్నారు. వారంతా వీరన్నను పలకరించారు.

"రారా ఈరయ్యా, కూరుసో."

"నేనేదో పిరికివాడిననీ, రాతిరి జడిసి పోనాననీ యీ ఎంకయ్య ఇయాల ఊరంతా సాటినాడు. దాని సంగతేదో ఇప్పుడే తేలిపోవాల" అన్నాడు వీరన్న.

''నేనేం సాటలేదు ఒకరిద్దరు మనోళ్ళతో మాటవొరసకి అన్నాను," అన్నాడు వెంకయ్య.

"అదే అబద్ధం చెప్పినావు. నేను జడిసినానా? వహ్! మహా ధైర్యవంతుడిలాగ వొచ్చి చెప్పేసినాడంట."

''అబద్ధం కాదురా నాయనా, నిజంగా నీకు భయమేసిందా లేదా సెప్పు? ఆ మాటకొస్తే నీకంటె నేను ధైర్యవంతుడినే" అన్నాడు వెంకయ్య.

"ఓరి, సాలు ఊరుకోరా — బయలుదేరినారు మొనగాళ్ళు. ఎల్లరా ఈరన్నా ఆడితోనేటి" — అక్కడున్న వారంతా దీనిని సర్దుబాటు చేయడానికి చూశారు. ఇదిగాని మితిమీరితే తీవ్రంగా పరిణమిస్తుందని వారి భయం. ఎందుచేతనంటే వీరన్న మోటువాడు. వెంకయ్య మొండివాడు.

వీరన్నకు ఒళ్ళుమండింది. "గొప్ప ధైర్యవంతుడి వంటున్నావే-ఏది చూపించరా నీ ధైర్యం, అదేమాత్రమో నేను సూత్తాను," అన్నాడు.

"ఒరే, ఊరుకొష్ఠమున్న కోవిల తోటలో పక్కని మనిసుండగా జడిసి నోడివి నీకు నాతో పంతమేటిరా? నీ ఎర్రిగాని, జబ్బబలం వేరు, గుండెబలం వేరురా నాయనా!"

"అదే సూత్తాను. ఇదిగో ఒంద రూపాయలు పందెమేద్దాం."

"సరే అయితే మాట తప్పకూడదు సుమా" అన్నాడు వెంకయ్య. చీకట్లో అర్ధరాత్రప్పుడు శ్మశానంలో కెళ్ళి అక్కడ కూర్చొని ఒక మేకు భూమిలోకి కొట్టిరావాలి, అదీ పందెం. ఎవడు




అలా వెళ్ళి రాలేకపోతే వాడు ఓడిపోయి నట్లు. ఆవేళ రాత్రే పందెం. ఈ వార్త ఊరంతా తెలిసిపోయి గొప్ప ఆసక్తి రేకెత్తించింది. అంతా పందెం గురించే మాట్లాడుతూ వుండేవారు. వీరన్న గెలుస్తాడని ఒకడంటే, వెంకయ్య గెలవగలడని ఒకడు. ఎవడికి తోచినట్టు వాడు ఊహాగానం చేశాడు.

ఆ రోజంతా వీరన్న దీనినిగురించి ఆలోచించాడు. తను ఇంతకు మునుపు అనేకమందితో పెద్దపెద్ద కుస్తీలుపట్టేడు. ఎప్పుడూ యింత ఆలోచించలేదు. దీనినిగూర్చి యింత ఆలోచించడానికేముందో తనకర్థం కాలేదు. పగటివేళ అనేకసార్లు తనా శ్మశానంగుండా నడిచి వెళ్ళేడు. అక్కడ భయపడడానికి ఏమీ లేదు. ఆ మాత్రానికి రాత్రివేళ మాత్రం భయమేమిటి? ముక్కు చివర ఊపిరితో బతికే వెంకయ్య వెళ్ళగా లేనిది తనే నేమిటి వెళ్ళలేడు. అదేదో చూదాం అనుకున్నాడు వీరన్న. అయితే వెంకయ్య యీ విషయం గురించి ఆలోచించనేలేదు. రాత్రి నలుగురూ వచ్చి పందేనికి రమ్మని పిలిచేవరకూ ఆ సంగతే జ్ఞాపకంలేదు.

అంతా కలిసి పాడుపడిన కోవెల తోటలోకి వెళ్ళికూర్చున్నారు. అక్కడ నుండి కొంచెం దూరానవున్న శ్మశానంలోకి ముందు వెంకయ్యా, తరువాత వీరన్న వెళ్ళిరావడానికి ఏర్పాటయింది.

అమావాస్య రాత్రి. అంతటాచిక్కటి చీకటి దట్టంగా కమ్ముకుని వుంది. ఆకాశంలో మేఘాలు కమ్ముకుని వుండడం వల్ల నక్షత్రాలుకూడా లేవు. గాలి కదలటంలేదు. వీరన్న మాటాడకుండా నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

వెంకయ్య మేకు, సుత్తి పట్టుకుని మైదానంలోకి నడిచి వెళ్ళేడు. ఒకరిద్దరు

కొంతదూరం వరకూ వాడివెంట వెళ్ళి ఆగిపోయారు. ఓ పదినిముషాలయేక, నిర్ణీత స్థలంలో నేలకు మేకుకొట్టి వెంకయ్య తిరిగి వచ్చాడు. తరవాత వీరన్న బయలుదేరేడు.

వీరన్న ఆవేళ మల్లుపంచ కట్టేడు. మల్లుచొక్కా వేసుకున్నాడు. ఒకచేతిలో మేకూ, ఒకచేతిలో సుత్తీ పట్టుకుబయలు దేరేడు.

మైదానంలో నల్లటి చీకటితప్ప మరేం కనపడడంలేదు. ఆ మైదానం ఊపిరితీయని శవంలా నిశ్శబ్దంగా పడుకుని వున్నట్టుంది. అక్కడక్కడ ఈత తుప్పలు శవంప్రక్క తలవిరబోసుకుని కూర్చున్న ఆడవాళ్ళలా, ఏడుస్తున్నట్టున్నాయి. గాలి చలనంలేక ఒక ఆకైనా కదలక, జీవితం కదలని ఒక పెద్ద కొండలా స్తబ్ధంగా పడివున్నట్టనిపించింది. ఆ నిశ్శబ్దంలో దూరాన దుమ్మలగొండి సకిలించింది. అది చేసిన శబ్దం చీకట్లను చీల్చుకుని తన శరీరమంతా తాకినట్లయింది. "పాడు జంతువు, మహా భయపెడుతుంది'' అనుకున్నాడు వీరన్న.

దూరాన తాటిచెట్లమధ్య నిప్పురాలుతున్నట్టు కనిపించింది. జేబులోంచి కాగితపు పొట్లంతీసి, అందులోని ఆంజనేయస్వామి సింధూరం బొట్టుపెట్టుకున్నాడు. తన చేతివేళ్లు వణుకుతున్నట్టు గ్రహించాడు వీరన్న.

అనుకున్నచోటికి వెళ్ళి, మేకు నేలను పెట్టి సుత్తితో కొట్టేడు. తన గుండెలు దడదడ కొట్టుకుంటున్నట్టు తెలుసుకున్నాడు. మొత్తంమీద అనుకున్న పని అయిపోయింది. వీరన్న పెద్ద నిట్టూర్పుతీసి, చటుక్కున వెనక్కి తిరిగి ఒక అడుగువేశాడు. వెనకనుంచి ఎవరో తన పంచెకొంగు పట్టుకులాగేరు. ఎవరో నవ్వినట్లయింది. మరొకడుగు ముందుకు వేయబోయాడు వీరన్న. వెనుక పంచ చిరిగిన శబ్దమయింది. అంతే వీరన్న నిలువునా పడిపోయాడు.

చాలాసేపు చూసి ఎప్పటికీ రాకపోతే కాగడా వెలిగించుకొని చూడడానికి వెళ్లేరు అంతా. భయిల్మాను వీరన్న చచ్చిపోయాడు. అతని పంచ కొంగు మీద మేకు కొట్టివుంది. కేసు పోలీసుల పరమైంది.






# మంత్రపు సంచి





(గత సంచిక తరువాయి)

## 2

మరుసటి రాత్రి మంత్రి కుమార్తె తిరిగి ఇలా ప్రారంభించింది.

జూదర్ అడిగిన ప్రశ్నలకు మూర్ ఈవిధంగా సమాధానం చెప్పాడు.

"నీ ఊహ సరిఅయినదే. నువు నీటిలో ముంచిన మూర్ లిద్దరూ నా తమ్ముళ్లు. ఒకడి పేరు అబ్దుల్ సలామ్. రెండోవాడు అబ్దుల్ అహీద్. నా పేరు అబ్దుల్ సమద్. నువ్వు యూదు అనుకున్నవాడు నా నాలుగో తమ్ముడు అతను మాలికీ తెగకు చెందిన నికరమైన ముసల్మాన్. అతని అసలు పేరు అబ్దుల్ రహీమ్. మా తండ్రి అబ్దుల్ వదూద్ గొప్ప మంత్రవేత్త. మంత్రశాస్త్రంలో ఆయనకు తెలీనిదంటూ లేదు. ఆయన మా నలుగురికీ మంత్రవిద్యా, ఇంద్రజాలమూ నేర్పాడు. భూమిలో ఎంత లోతుగా నిక్షిప్తమైఉన్న నిధులనైనా పసికట్టి, బయటికి తీసేవిద్య మాకు తెలుసు. ఆయన నేర్పిన విద్యను ఉపయోగించి మేం యక్షిణీ, శాకినీ, ఢాకినీలు వగైరాలను కూడా వశపరచుకోగలిగాం.

"మా తండ్రి మాకు అంతులేని ధనరాసులు ఇచ్చిపోయాడు. ఆయన తాలూకు బంగారమూ, 'యంత్రాలూ', పుస్తకాలూ మేం ఎలాటి పేచీకూడా లేకుండా పంచుకున్నాం, కాని కొన్ని లిఖిత పుస్తకాలదగ్గిర మాకు తగాదా వచ్చింది. ఈలిఖిత గ్రంథాలలో ముఖ్యమైనది 'ఎల్డ్' అన్నది. దానికి ఎవరూ విలువకట్టలేరు. దాని ఎత్తుమణుల విలువకూడా దానివిలువలో సహస్రాంశం ఉండదు. మా తండ్రి తన విజ్ఞానం తాలూకు నిగ్గునంతా అందులో రాసి పెట్టాడు. ప్రపంచంలో ఏ నిధి ఎక్కడ

ఉన్నదో, ఏ మర్మాన్ని ఎలా విప్పాలో, ఏ శకునానికి ఫలితమేమిటో అందులో స్పష్టంగా ఉన్నది.

"మా తగాదా ఉచ్ఛస్థాయికి చేరుకున్న సమయంలో, మా తండ్రికి మంత్ర విద్యలు నేర్పిన వృద్ధుడు మా యింటికి వచ్చాడు. ఆమహనీయుడి పేరు కాహీన్ అల్ఖైన్. ఆయన ఎల్డ్ గ్రంథాన్ని చేతిలోకి తీసుకుని, 'నాయనలారా, మీరు నా బిడ్డకు బిడ్డలు. మీ మధ్య నేను విచక్షణ చూపలేను. కనక, నేను చెప్పే తీర్పు ఏమంటే, మీలో ఎవరు అల్షమర్దల్ నిధిని తెరిచి, అందులోఉండే ఖగోళమూ, కాటుకభరిణా, కత్తీ, ముద్రికా తెస్తారో వాడిదే ఈ గ్రంథం. నేను చెప్పినవస్తువులన్నీ గొప్పశక్తులతో కూడుకున్నవి. ముద్రికను ఒకభయంకర యక్షుడు కాస్తూ ఉంటాడు. ఆ ముద్రికను సాధించినవాడు ఎలాటి రాజునైనా ఎదుర్కొని, సమస్త ప్రపంచానికీ అధిపతి కాగలడు. కత్తిని సాధించినవాడు, దానినుంచి వెలువడే జ్వాలలతో ఎంత లేసి సైన్యాలనూ భస్మీపటలం చెయ్యగలడు. ఖగోళాన్ని సంపాదించిన వాడు కూర్చున్న చోటినుంచి కదలకుండా ప్రపంచంలో ఏ ప్రాంతాన్నయినా సందర్శించగలడు; వాడు చేతిని తాను వెళ్లదలుచుకున్న స్థలానికి తాకిస్తేచాలు గోళం గుండ్రగా తిరిగి ఆ దేశం, అక్కడి నదులూ, కొండలూ, ప్రజలతో సహా అక్కడికే వచ్చేస్తుంది. ఆ గోళాన్ని సాధించుకున్నవాడికి ఒక నగరంగాని, ఒక ప్రజగాని అసంతృప్తికరంగా తోచిన పక్షంలో, గోళంమీది ఆ ప్రదేశాన్ని ఎండకేసి పెట్టితే చాలు, ఆ ప్రాంతం భస్మమైపోతుంది. ఇక, కాటుకను కంటికి పూసుకున్నవాడికి భూమిలోగల సమస్త నిధులూ కనిపిస్తాయి. ఈ వస్తువులన్నీగల నిధిని ఎవరు ఆవిష్కరిస్తే ఈ గ్రంథం వాడికి చెందుతుంది. ఆవిష్కరించలేనివాడికి నిష్కృతి లేదు. ఇందుకు మీరంతా సమ్మతిస్తారా?" అన్నాడు.

"ఆయన అలా అనేసరికి మేం, 'గురుదేవా, మాకు సమ్మతమే. కాని ఆ అల్షమర్దల్ నిధిని గురించి మాకు ఏమీ తెలియదు' అన్నాం."

"మహనీయుడు కాహీన్ ఇలా చెప్పాడు: 'సుర్ఖ్ అనే రాజుకు ఇద్దరు కొడుకులున్నారు. అల్షమర్దల్ నిధి వాళ్ల అధీనంలో ఉన్నది. మీ తండ్రి ఆనిధిని సంపాదించాలని, రాజకుమారుల నిద్దరినీ పట్టుకోగా, వాళ్లు తప్పించుకుని పారిపోయి, కైరో సమీపంలో ఉండే కారూన్ సరస్సులోకి చేపల రూపంలో దూకారు. మీ తండ్రి నాదగ్గిరికి వచ్చి తన ప్రయత్నం విఫలమైనట్టు చెప్పాడు. అప్పుడు నేను జ్యోతిషం ఆధారంతో గుణించి ఒకసంగతి తెలుసుకున్నాను: అల్షమర్దల్ నిధి దొరకాలంటే, ఉమర్



అనే కైరోవాసి కుమారుడు జూదర్ అనే చేపలు పట్టేవాడి సహకారం కావాలి. ఈ జూదర్ కారూన్ సరస్సు తీరాన తటస్థపడగలడు. ఆ సరస్సులోని నీటి ప్రభావానికి అతనే విరుగుడు చేయ గలడు. నీటిలోకి వెళ్లదలచుకున్నవాళ్లు అతనిచేత వెడరెక్కలు విరిచి కట్టించు కుని, నీటిలోకి తోయించుకోవాలి. నీటిలో దిగిన అనంతరం సుర్ఖ్‌రాజు కొడుకులతో ఘర్షణ చెయ్యాలి. అందులో విజయం పొందినట్టయితే ఆ మనిషి మునిగిపోడు. అతని చేతులు మొట్టమొదట నీటిపైకి వస్తాయి. అప్పుడు జూదర్ తన వలతో ఆ మనిషిని బయ టికి లాగాలి. నీటిలో పడినమనిషి మునిగిపోవాలని రాసిపెట్టిఉంటే, అతని కాళ్లు పైకి తేలుతాయి. చేసేదేమీలేదు.

"మాలో ముగ్గురం ప్రాణాలుతెగించ టానికి సిద్ధపడ్డాం. మా తమ్ముడు అబ్దుల్ రహీమ్ మటుకు ప్రయత్నం నుంచి విరమించాడు. అందుచేత మేం అతనికి యూదు వర్తకుడి వేషంవేసి, ప్రాణాలు పోగొట్టుకున్నవాళ్ల కంచర గాడిదనూ, సంచీనీ తీసుకుని, చేపలు పట్టేవాడికి నూరు దీనారాలు ఇచ్చేటట్టు ఏర్పాటుచేశాం.

"ఆ తరవాత జరిగిన దేమిటో నీకు తెలుసు నా తమ్ములిద్దరూ సరస్సులో ప్రాణాలు వదిలారు సుర్ఖ్ రాజు కొడు కులు వాళ్లను చంపేశారు. నేను కూడా వారితో పోరాడుతూ చచ్చినంతపని చేశాను. కాని, ఒక మంత్రం మనసులో జపించుకుని, చేతులు విడిపించుకుని, నీటికిగల మహత్తును విరగగొట్టి, రెండు చేపలనూ చేజిక్కించుకున్నాను. సుర్ఖ్ రాజు కొడుకులు బలవంతులైనభూతాలు. అల్‌షమర్దల్ నిధిని సాధించటానికి వాళ్లను బంధించటం మొదటిమెట్టు.

మహనీయుడు కాహీన్ కోస్యం చెప్పి నట్టు నువు దగ్గిర ఉండటం తప్పనిసరి. నువు నా వెంట రాగలవా? మనం ఫెజ్, మిక్నాన్ లుండే ప్రాంతంలో మగ్రిబ్‌కు వెళ్లి నిధి కనిపెట్టాలి. నువు కోరినది ఇయ్యటమేగాక, నీకు శాశ్వతంగా సోద రుడుగా ఉంటాను."

"అయ్యా, నామీద ఆధారపడి నా తల్లీ, అన్నలూ ఉన్నారు. నేను మీ వెంట వచ్చేస్తే వాళ్లు ఏం తింటారు?" అన్నాడు జూదర్.

"ఇవన్నీ బొల్లి కబుర్లు నువు రావ టానికి నిజంగా నీ తల్లి భారమే అడ్డు అయిన పక్షంలో వెయ్యిదీనారాలిస్తాను అవి తీసుకుపోయి ఆమె కిచ్చెయ్యి. నిన్ను నాలుగుమాసాలకు తిప్పిపంపేస్తా నని మాట ఇస్తున్నాను," అన్నాడు మూర్.

వెయ్యి దీనారాలన్నమాట చెవినిపడ గానే జూదర్ ఆత్రంగా, "డబ్బు మా అమ్మకిచ్చి, సంతోషంగా మీ వెంట వస్తాను" అన్నాడు.

మూర్ ఇచ్చినడబ్బు తీసుకుని అతను తల్లివద్దకువెళ్ళి, "నేను నాలుగు మాసాలపాటు ఒక మనిషివెంట మగ్రిబ్‌కు పోతున్నాను. నేను తిరిగి వచ్చేదాకా నువ్వూ, అన్నలూ ఈ వెయ్యి దీనారాలూ వాడుకోండి. నా కోసం రోజూ ప్రార్థన చెయ్యి. నీ దీవనలు నాకు తోడుగా ఉంటాయి" అన్నాడు.

"చాలా దూరంరా నాయనా. నాకేమో భయంగా ఉన్నది," అన్నది తల్లి.

"అల్లా రక్షణలో ఏ ఆపదా రాదు. ఆదీగాక నన్ను వెంట తీసుకుపోతున్న మూర్ చాలా నమ్మకమైనవాడు."

"అల్లా కటాక్షంవల్ల ఆ మూర్ నిన్ను చక్కగా చూడాలి వెళ్లిరా, బాబూ."

జూదర్ తనవద్దకు తిరిగి రాగానే మూర్, "మీ అమ్మతో చెప్పావా?" అని అడిగాడు.

"ఆ, చెప్పాను ఆమె నన్ను ఆశీర్వ దించింది," అన్నాడు జూదర్.

వెంటనే మూర్ అతన్ని కంచర గాడిదమీద తన వెనక ఎక్కించుకుని బయలుదేరాడు వాళ్లు మధ్యాహ్నం లగా యతు పొద్దుపోయినదాకా ప్రయాణం చేశారు.

జూదర్‌కు అమితంగా ఆకలి అయింది. సంచీలో ఆహారం ఏమీ ఉన్నట్టు కనబడలేదు. అతను మూర్‌తో, "అయ్యా, మీరు దారివెంట భోజనం తెచ్చుకోవటం మరిచినట్టు న్నారు," అన్నాడు.

"నీకు ఆకలిగా ఉన్నదా?" అని మూర్ అడిగాడు. జూదర్ అవునన్న మీదట అతను సంచీతోసహా కంచర గాడిదమీదినుంచి దిగి, "నీకు దేనిమీద



మనసుగా ఉన్నది, తమ్ముడూ?" అని అడిగాడు.

"ఏదైనా సరే," అన్నాడు జూదర్.

"అలా కాదు. నీకు దేనిమీద మనసున్నదో చెప్పు."

"రొట్టే, మీగడా" అన్నాడు జూదర్ నవ్వుతూ.

"అదా కోరుతావు? మంచి ఆహారం ఏదన్నా కోరుకో."

"ఈ క్షణం నాకు ఏదన్నా మంచిదే అనిపిస్తుంది."

"తేనె అన్నం కావాలా?"

"కావాలి."

"ఇంకా—" అంటూ మూర్ ఇరవై నాలుగురకాల ఆహారపదార్థాలు చెప్పాడు.

అతని మాటలు వింటూ జూదర్, "ఈ మనిషికి మతి ఏమన్నా పోయిందా? వంటమనిషి లేదు, కుంపటి లేదు — ఇవన్నీ ఎలా తెచ్చి ఇస్తాడు?" అనుకుని, పైకి, "అవి చాలు ఇవన్నీ చెప్పి నానోరు ఊరించాలనా? వీటిలో ఒక్కటి కూడా రాదే!" అన్నాడు.

"కడుపునిండా తిను, జూదర్," అని గొణుగుతూ మూర్ సంచీలో చెయ్యిపెట్టి, ఒక బంగారు పళ్లెం పైకి తీశాడు. అందులో కాల్చిన కోళ్లు రెండు సెగలు కక్కుతూ ఉన్నాయి. అతను సంచీలోకి ఇంకోసారి చెయ్యిపెట్టి, గొర్రె మాంసం చీకులుగల బంగారు పళ్లెం పైకి తీశాడు. ఇలా అతను ఇరవై నాలుగు రకాల పదార్థాలూ సంచీనుంచి తీశాడు.

అతను, విస్మయంతో చూస్తున్న జూదర్‌తో, "తిను, పాపం!" అన్నాడు.

"అయ్యో, మనం బయలుదేరక ముందు మీరా సంచీలో చిన్న వంటిల్లూ, అనేకమంది వంటవాళ్లూ ఏర్పాటుచేసినట్టున్నారు," అన్నాడు జూదర్.

"ఇది మంత్రపుసంచీ. అంతేగాని



మరేంలేదు. ఇందులో ఒక భూతం ప్రపంచంలో ఏ మూలనుంచి ఏ రకం వంటకం కావాలన్నా తెచ్చిపెడుతుంది," అన్నాడు మూర్ నవ్వుతూ.

తరవాత ఇద్దరూ తిన్నంతతిని, మిగిలి నది పారేసి. బంగారుపళ్లాలు తిరిగి సంచీలో పెట్టేసి, అందులోనుంచి బంగారు నీటిపాత్ర తీసి, నీరుతాగి, చేతులూ, కాళ్లూ కడుక్కుని, ఆ పాత్రను కూడా సంచీలో పెట్టేసి, కంచరగాడిదమీద మళ్ళీ ప్రయాణం సాగించారు.

కొంతదూరం వెళ్లాక మూర్, "జూదర్, మనం కైరోనుంచి ఎంత దూరం వచ్చామో తెలుసునా?" అని అడిగాడు.

"నాకు తెలీదు,'' అన్నాడు జూదర్.

"ఈ రెండు గంటలకాలంలో మనం ఒక నెల ప్రయాణం ముగించాం. ఈ కంచరగాడిద ఒక యక్షి. సాధారణంగా ఒక రోజులో సంవత్సరం ప్రయాణం పూర్తిచేస్తుంది. అయితే, నీకు శ్రమ కలుగుతుందని నింపాదిగా పోనిస్తున్నాను.''

పొద్దునా, సాయంకాలమూ, తమకు కావలసినవి మంత్రపు సంచీనుంచి తీసుకుంటూ వాళ్లు మగ్రిబ్‌కేసి ప్రయాణం చేశారు జూదర్ ఎలాటి అసాధ్యమైన వంటకం కోరినా, అది చక్కగా పాకమై సంచీలో బంగారుపళ్లెంలో హాజరవుతూ వచ్చింది. అయిదురోజుల అనంతరం వాళ్లు మగ్రిబ్‌చేరి, ఫెజ్ నగరం ప్రవేశించారు.

వాళ్లు వీధివెంట పోతూంటే అనేక మంది అతన్ని గుర్తించి, పలకరించారు. చివరకు వాళ్లు ఒక భవనాన్ని చేరుకుని, దాని ముందు దిగారు. తలుపు తట్టగానే తెరుచుకున్నది. గుమ్మంలో ఒక అంద



మైన పిల్ల నిలబడింది. ఆమె చంద్రుడి లాగా ప్రకాశిస్తూ, చాలా కోమలంగా ఉన్నది.

మూర్ ఆమెతో, ''అమ్మా, రహ్మహ్! పెద్దదావడి తలుపులు తెరు,'' అన్నాడు వాత్సల్యంతో.

. రహ్మహ్ ముందు నడుస్తూంటే మిగిలిన ఇద్దరూ ఆమెను అనుసరించారు. ఆమె నడకసొంపు చూస్తూంటే జూదర్‌కు మతిచలించింది. "తప్పకుండా ఈమె ఎవరో రాజకుమార్తెఅయి ఉంటుంది," అనుకున్నాడతను.

భవనంలోకి ప్రవేశించే ముందు మూర్ కంచరగాడిద మీదినుంచి సంచి తీసుకుని, "నువు ఎక్కడి నుంచి వచ్చావో అక్కడికి పో. నీకు శుభం



కలుగుగాక!" అన్నాడు. వెంటనే కింద నున్న నేల విచ్చుకుని, కంచరగాడిద అందులోకి దిగిపోయాక, యథాప్రకారం మూసుకున్నది.

"యా అల్లా! మనం దానిమీద ఉండగా ఇంతపని జరిగింది కాదు!" అన్నాడు గాభరాగా జూదర్.

"ఎందుకు ఆశ్చర్యపడుతున్నావు, జూదర్? అది యక్షిణి అని ముందు చెప్పానుగా? పెద్దచావడికి పోదాంపద!" అన్నాడు మూర్.

జూదర్ పెద్దచావడిలోకి అడుగుపెట్టే సరికి అతని కళ్లు జిగేల్మన్నాయి. దాని నిండా ధగధగా మెరిసే మణిఅలంకరణలూ, తళతళలాడే వెండి, బంగారు వస్తుజాలమూ ఉన్నాయి.

ఇద్దరూ కూర్చున్నమీదట మూర్ తన కుమార్తెచేత ఏదో బంగీలాటిది తెప్పించాడు. దాన్ని విప్పేసరికి అందులో నుంచి కనీసం వెయ్యి దీనారాలు చేసే అంగీ పైకి వచ్చింది. మూర్ దాన్ని జూదర్‌కిస్తూ, "మాకు సంతోషం కలిగించే అతిథివి, దీన్ని ధరించు," అన్నాడు.

జూదర్ దాన్ని ధరించేసరికి, ఏ పశ్చిమ అరేబియారాజుకో ఉండేటంత కళ వచ్చింది.

ఈలోపుగా మూర్ మంత్రపుసంచి నుంచి వరసగా బంగారు పళ్లాలు తీసి, నలభై రకాల వంటకాలు అమర్చి, "భోజనం చెయ్యి. ఈసారికి మా ఆతిథ్యంలో అవకతవకలు పాటించకు. ఎందుకంటే, నీ అభిరుచులేవో, నీకు ఏది ప్రత్యేకించి ఇష్టమో మా కింకా తెలీదు. నువు ఏదికోరితే అది మరుక్షణం నీ ముందుంటుంది," అన్నాడు.




"అయ్యా, నాకు అన్ని పదార్థాలూ ఇష్టమే. దేనిమీదా ద్వేషంలేదు. నా రుచులు అడగకండి. మీ బుద్ధికి ఏది తోస్తే అది ఇయ్యండి. తినటమే నా కున్న ఒక్క విద్యా, ఒక్క ఆనంద మూను. నేను మంచి తిండి పుష్టిగల వాణ్ణని గర్వపడతాను కూడా," అన్నాడు జూదర్.

అతను అన్నట్టుగానే, ఆ రాత్రి, తర వాత ప్రతిరోజూ సుష్టుగా భోజనం చేశాడు. వంటింటి పొగబెడదలేకుండా మూర్ సంచిలో చెయ్యిపెట్టి మనసులో ఏది అనుకుంటే అదెల్లా బంగారుపళ్లెంలో హాజరయేది. అలాగే పళ్లూ, మిఠాయి లూనూ. అలా జూదర్ మూర్ ఇంట ఇరవైరోజులున్నాడు. ప్రతి ఉదయమూ అతనికి ఒక కొత్త అంగీ, మరింత మేలైనది ధరించటానికి లభించేది

ఇరవై ఒకటోరోజు ఉదయం మూర్ వచ్చి, "పద, జూదర్. ఇవాళే షమర్దల్ నిధిని తీసుకొనేరోజు," అన్నాడు.

ఇద్దరూ బయలుదేరారు. వాళ్లు నగర ప్రాకారం దాటేసరికి అక్కడ రెండు కంచరగాడిదలు సిద్ధంగా వున్నాయి. వాటివెనక ఇద్దరు నల్లబానిస లున్నారు. ఇద్దరూ చెరొక కంచరగాడిదా ఎక్కి ప్రయాణమయారు. మధ్యాన్నానికి వాళ్లు ఏదో నదిచేరి, అక్కడ దిగారు.

మూర్ సూచనమీద నీగ్రో బానిసలు కంచరగాడిదలను తీసుకుపోయి, గుడా రమూ, తివాసీలూ, దిళ్లూ తెచ్చి, విడిదికి యోగ్యమైన ఏర్పాట్లు చేశారు. తరవాత వాళ్లు, చేపలున్న గాజు ఝాడీలను తెచ్చి మూర్ ముందుపెట్టి, సంచిలో నుంచి ఇరవైనాలుగు రకాల వంటకాలు తీసి వడ్డించి, గాలిలో కలిసిపోయారు.

మూర్ భోజనం పూర్తిచేసి, గాజు

ఝూడీలను ఒక పీటమీద ఉంచి, ఏవో మంత్రాలు చదివాడు, ఝూడీలలో ఉండే చేపలు, ''రక్షించు, మాంత్రికుడా!'' అని ఆక్రోశించాయి.

అయినా మూర్ మంత్రాలు చదవటం మానలేదు. చేపలు ఆక్రోశించటమూ మానలేదు. చిట్టచివరకు ఝూడీలు పగిలి ముక్కలై, ఇద్దరు మానవాకారులు ప్రత్యక్షమయారు. వాళ్ళు ఏడుస్తూ మూర్ ముందుపడి, "మహాత్మా, మమ్మల్ని కాపాడు! మా గతిఏంకాను?" అంటూ ఏడిశారు.

"అల్‌షమర్దల్ నిధి నాకు అప్ప గించకపోతే మిమ్మల్ని నాశనం చేస్తాను, మారణహోమం చేస్తాను," అన్నాడు మూర్.

"అలాగే చేస్తాం. కాని కైరోకు చెందిన జూదర్ అనేవాడు ఇక్కడ హాజరులో ఉంటేతప్ప నిధిని ఆవిష్క రించటానికి లేదని రాసిపెట్టి ఉన్నది. ఆ జూదర్ కూడా ఉమర్ కొడుకై ఉండాలి. మరోవాడు పనికిరాడు," అన్నారు వాళ్లు.

''ఇతనే ఆ జూదర్," అన్నాడు మూర్.

"అలా అయితే మరి అవాంతర మేమీ లేదు," అన్నారు వాళ్లు

అప్పుడు మూర్ వాళ్ళిద్దరినీ స్వేచ్ఛగా వదిలేశాడు. వాళ్లు నదిలోకి దిగిపోయారు.

మూర్ ఎర్రని కురువింద రత్నపు పలకలను రెంటిని దర్భలమీద ఉంచి, దానిపైన ధూపపాత్రను వాటికి ఎగు వగా వేళ్లాడగట్టి, అందులో బొగ్గులు వేసి ఊది మండించి, అందులో గుగ్గిలం వేశాడు. పొగరావటం మొదలుపెట్టింది. అప్పుడతను జూదర్‌తో, "చూడు జూదర్, పొగరావటం మొదలయింది. నేను మంత్రోచ్చాటనకు పూనుకుంటాను. మధ్యలో విఘ్నం కలగరాదు గనక, నువు ఏం చెయ్యవలసి ఉంటుందో ముందే చెప్పేస్తాను,'' అన్నాడు.

"చెప్పండి బాబూ!" అన్నాడు జూదర్.

అంతలో తూర్పు తెల్లవారుతూ ఉండటం చూసి మంత్రికుమార్తె మౌనం వహించింది. (సశేషం)






సంధ్య ఒకసారి హాలంతా కలియజూసింది. అన్ని టేబుళ్ళూ నిండిపోయినయ్. అందరూ తనవంకే కళ్ళప్పగించి చూస్తున్నారు. తాగుతున్నవాళ్ళు తాగటం ఆపి మరీ చూస్తున్నారు. మేనేజర్ మైక్ చేతిలోకి తీసుకొన్నాడు.

"మీరు ఎదుర్చూస్తున్న సంధ్య మీకెదురుగ్గా ఉంది. మీకు నచ్చిన పాటలు ఆమె తన మధురమైన కంఠంతో వినిపిస్తుంది. విని ఆనందించండి. థాంక్యూ ..." ఆర్కెష్ట్రా వాళ్ళు ఝల్లుమనేలా మోగింది. సంధ్య మైక్ నోటిదగ్గరకు లాక్కొని ఓసారి చిరునవ్వు చిందిస్తూ అందరివంకా చూసింది. ముందుకూర్చున్న కాలేజీకుర్రవాడొకడు ఆమెవంకచూసి కన్నుకొట్టాడు. సంధ్య అదేమీ గమనించనట్లు పాట మొదలుపెట్టింది. తనకిష్టమయినపాట అది. ప్రతి బార్‌లోనూ తన ప్రోగ్రాం ఆ పాటతో ప్రారంభమవాల్సిందే. ఆ పాట తనహృదయంలోనుంచి వస్తుంది. తన జీవితాన్ని గుర్తుకు తెస్తుంది వినేవారందరినీ తన్మయులయేలా చేస్తుంది. హృదయాలను కరిగిస్తుంది. దేవులపల్లి తనకోసమే రాసినట్లనిపిస్తుంది.

"ఇది మల్లెలవేలయనీ...ఇది వెన్నెల మాసమనీ—తొందరపడి ఒక కోయిల ముందే కూసింది...విందులు చేసింది.."

ఆమె కంఠం మధురంగా విషాదాన్ని చిందిస్తూ గాలిలో తేలుతోంది. అందరూ పరవశులయి వినసాగేరు.

పాట ముగిసింది.

ఆ వాతావరణానికి సరిపడే మరో పాట ఎత్తుకొంది సంధ్య. బాటిల్‌లోని నిషాకి సమానమయిన నిషాకలిగిస్తోందా పాట. అరగంట గడిచిపోయింది. కోరిన పాటలు పాడుతోందామె. ఎదురుగ్గా కూర్చున్న మిలిటరీ ఆఫీసర్ విస్కీ అంతా ఒక్క గుక్కలో తాగేసి ఆమెను చూసి నవ్వాడు. బాగా నిషాఎక్కి తూలి పడుతున్న సిఖ్ఖు ఒకడు మీసం తడుము కొంటూ, ఆమెనువచ్చి తన వళ్లో కూర్చోమని సంజ్ఞచేశాడు.

వీటన్నిటినీ గమనించికూడా గమనించనట్లే చిరునవ్వుతో పాడుతోందామె. హటాత్తుగా ఆమె చూపు అప్పడే బార్‌లోకి అడుగుపెట్టిన వ్యక్తిపై పడింది. చకితురాలయి అతనివంకే చూస్తూండి పోయిందామె. అతనుకూడా సంధ్యవంక చూస్తూ ముందుకి నడిచి ఓ టేబుల్ దగ్గర కూర్చున్నాడు. బలవంతంగా చూపులు మరల్చుకొంది సంధ్య. మరో అరగంటకి ఆమె ప్రోగ్రాం ముగిసింది. మేనేజర్ రూంలోకెళ్ళి 'చెక్' తీసుకొని బయటకు నడిచింది. బార్‌లో 'కాబరే' మొదలయినట్లుంది...ఆర్కెస్ట్రా వింతధ్వనులు వినిపిస్తోంది. కేకలు—నవ్వులు—చాలా కోలాహలంగా ఉంది. టాక్సీ ఆమెదగ్గరకొచ్చి ఆగింది. వెనుక తలుపు తెరువబోయి లోపలకూర్చున్న మనిషినిచూసి ఓ అడుగువెనక్కువేసింది. కంగారుగా

"నేనే సంధ్యా! అనంతాన్ని! రా! కూర్చో!".

మాట్లాడకుండా లోపల కూర్చుందామె. బ్రాందీవాసన గుప్పుమనికొట్టింది. టాక్సీ వేగం అందుకొంది.

"నేను నిర్ణయించుకొన్నాను సంధ్యా! నువ్ నాక్కావాలి! నువ్ ఎప్పుడూ నా పక్కనుండాలి! నువ్వులేకపోతే నా జీవితాని కర్థంలేదు..." ఉద్వేగంతో అన్నాడతను. గుండెలు వేగంగా కొట్టుకోసాగినయ్ సంధ్యకు మనసంతా అల్లకల్లోలంగా తయారైంది. టాక్సీ అద్దాల్లోంచి కనబడుతున్న నియాన్‌లైట్లు మసకబారిపోతున్నట్లున్నయ్.

"మాట్లాడవేం సంధ్యా?"

"కాని...నన్నుకూడా ఆలోచించుకోనీరూ?..." తడబడుతూ అడిగిందామె.

"తప్పకుండా ఆలోచించు సంధ్యా! ఆలస్యంచేయకు! ఈ పరిస్థితిని నేను భరించలేను..."

"... ... ..."

టాక్సీ కొద్దినిమిషాల తర్వాత ఓ ఇంటిముందాగింది.

డోర్ తెరిచి దిగి నుంచుంది సంధ్య. ఆమె వెనుకే తనూ దిగాడు అనంతం. టాక్సీకి డబ్బుచెల్లిందాక ఇద్దరూ ఇంట్లోకి నడిచారు.

"ఒక్క నిమిషం ఆ పుస్తకాలు



చూస్తూ కూర్చోండి. కొద్దినిముషాల్లో మనిద్దరికీ భోజనంపడ్డించేస్తాను..." లోపలికి నడుస్తూ అంది సంధ్య.

"వద్దు సంధ్యా! నాకాకలిలేదు, ఇవాళ నీతో అన్నీ మాట్లాడేయాలనే ఉద్దేశంతో వచ్చాను. ఇవాళే మన పరిచయానికి ఓ కొత్తరూపం ఇవ్వాలని కూడానిర్ణయించుకొని మరీవచ్చాన ..."

సంధ్య తలుపుకు ఆనుకొని నిలబడిపోయింది. ఆమె దృష్టి ఎదురుగ్గా టేబుల్‌మీద ఫోటో ఫ్రేమ్‌లో తనూ రమణా కలిసి దిగినఫోటోమీద పడింది.

"అనంతంగారూ! ఈ ఒక్కరాత్రి నాకు గడువియ్యండి. రేపుదయమే మీకు నా నిర్ణయం చెబుతాను..."

"ఓకే. సంధ్యా! నీ ఇష్టాన్ని కాదనే శక్తి నాకు లేదు ... రేపు ఉదయమే మన భవిష్యత్తుని నిర్ణయించు... వస్తాను ...గుడ్‌నైట్..."

బయటకు నడిచాడతను.

సంధ్య అతనివంకే చూస్తూ నిలబడిపోయింది. చాలాసేపటికి తెప్పరిల్లి తలుపులు మూసివేసి టేబుల్ ముందున్న కుర్చీలో కూలబడిపోయింది

ఫోటోలో రమణ నవ్వుతున్నట్లు అనిపించసాగింది

ఆమె కళ్ళవెంబడి నీళ్ళు తిరిగినయ్ టేబుల్‌మీదకు తలవాల్చి నిశ్శబ్దంగా విలపించసాగింది. భగవంతుడెందుకిలా శిక్షిస్తున్నాడు తనని? ఇప్పుడు హఠాత్తుగా రమణని మర్చిపోయి అనంతంని ప్రేమించగలదా తను? అతనితో గడిపే ప్రతిక్షణం రమణను గుర్తుకితేమా? అతనిలో అనుక్షణం రమణ కనిపించడూ? జీవితం నరకప్రాయమయిపోదూ?

అసలు...తను రమణనంత గాఢంగా ఎందుకు ప్రేమించింది? రమణ లేకపోతే తన జీవితమే లేదని ఎందుకు తలపో

సింది? అతనికి తన సర్వస్వం ఎందుకు అర్పించింది?

"నీకెందుకోయ్ భయం? మనం ఒంటరివాళ్ళ మయామనా? సిల్లీ! దేముడు మనకు తోడులేడూ? లేకపోతే మనం ఇన్ని అడ్డంకుల నెదుర్కొని ఇలా ఒక టయేవాళ్ళమా?..." ఇలా ఆనందాన్ని పంచుకొంటూ జీవితం గడపగలిగే వాళ్ళమా?"...ఓరోజుఅన్నాడు రమణ.

ఆ మాటలు తనకెంత ఉపశమనాన్ని కలిగించినయ్! ధైర్యంగా నవ్వింది తను. కాని...కాని...ఆనవ్వు...ఎంతో కాలం నిలువలేదు. తమకు తోడున్నా డనుకొన్న దేముడు అప్పుడేమయిపో యాడో అర్థంకాలేదు.

ఉద్యోగంకోసం వేళకు నిద్రాహారాలు లేకుండా ఆరోగ్యం చెడగొట్టుకొని మంచంపట్టాడు రమణ. కొన్నిరోజులకు ఆరోగ్యం కుదుటపడుతుందన్న ధైర్యాన్ని కూడా తను కోల్పోయింది. ఆ అనారోగ్యాన్ని బాగుచేయగలిగేంత స్తోమత తమచేతిలో లేదు. ప్రభుత్వ ఆస్పత్రిలో చేర్పించింది. అక్కడి వైద్యంమీద కూడా తనకు నమ్మకం లేదు. క్రమక్రమంగా రమణ పెదాల మీద చిరునవ్వు మాయమయిపోతోంటే గుండెలవిశేలా ఏడ్వసాగింది. రమణ ముందు ధైర్యస్థురాలిలా నటించి వెనుక కుళ్ళికుళ్ళి ఏడ్చేది.

"నిజం చెప్పవోయ్! నువ్ భోజనం చేయడంలేదుకదూ? ఎలాచేస్తావోయ్! ఇంట్లో ఏముందని? నాకనిపిస్తోంది మనం కులాంతర వివాహం చేసుకొని చాలా పెద్దతప్పు చేశామేమోనని— ఆఖరికి ఇలాంటి సాంఘిక సమస్యల్లో కూడా ధనంపాత్ర చాలా ఉంటుందని ఋజువుచేస్తోంది మన సంఘం...నిన్నీ పరిస్థితిలో చూడాలంటే నాకు చిత్ర వధగా ఉంది సంధ్యా! దేముడు మనమీద ఇంత కక్ష ఎందుకు కట్టాడంటావ్? బహుశా మన తలిదండ్రులు దేముణ్ణి మనకంటే ముందే ప్రార్థించారేమో "వాళ్ళిద్దరూ మమ్మల్ని కాదని వెళ్ళా రూ! అంచేత వాళ్ళని అష్టకష్టాలూ అనుభవింపజేయి!" అని. అయినా నాకు తెలీకడుగుతాను! దేవుడికి మాత్రం బుద్ధుండక్కర్లే? ఒకరిమాటలు విని మరొకర్ని హింసించడానికి..."

అంటూండేవాడు రమణ.

డాక్టర్లు అన్నారు "హైద్రాబాద్ ఉస్మానియా హాస్పిటల్‌కు తీసుకెళ్తే మంచిది. అక్కడ ఈ జబ్బుకి స్పెష లిస్ట్సు ఉన్నారు.'' తనకు తెలుసు— తనకు సహాయం కావాలి! ఎవరిదయినా సరే! లేకపోతే రమణ తనకు దక్కడు. రమణ లేకపోతే తన బ్రతుకు ఎలా వుంటుందో తను తేలిగ్గా ఊహించుకో గలదు. సరిగ్గా అప్పుడే అనంతం వచ్చాడు కార్లో.

"పీడేడీ?" అడిగాడు లోపలికొస్తూ.

"హాస్పిటల్‌లో ఉన్నారు ..." ఆశ్చర్యపోయాడు.

"హాస్పిటల్‌లోనా?"

"అవును..."

"ఎందుకు? ఏమయింది?"

"ఏమో? వాళ్ళదేమీ చెప్పటంలేదు. హైద్రాబాద్ ఉస్మానియా హాస్పిటల్‌కు తీసుకువెళ్లడం మంచిదంటున్నారు..."

"మైగాడ్! మరి తీసుకెళ్ళలేదూ?"

తను మాట్లాడలేదు. ఆమాత్రం గ్రహించుకోలేడూ? రమణకు ఆప్తమిత్రు డయికూడా ఆమాత్రం అర్థంచేసుకో లేడూ?

అనంతం అర్థంచేసుకొన్నాడు.

"ఓహో! భలేవారే మీరు! నాకెవరి తోనయినా కబురుచేయకూడదూ? ఇలాంటి పరిస్థితుల్లోనా ఆత్మాభిమా నాలు?"

అనంతం కార్లోనే హైద్రాబాద్ చేరు కొన్నారందరూ! తనకో ఇల్లు -రమణని ఆ స్పెషలిస్ట్—ఇంటిదగ్గరే వైద్యంచేసే ఏర్పాట్లు - అన్నీ చేసి వెళ్ళిపోయాడు అనంతం

అప్పుడు తనకు అనిపించింది.

భగవంతునికి రూపంలేదు. అందు చేత మనిషిరూపంలోవచ్చి దుఃఖంలో ఉన్నవాళ్లను ఆదుకొంటాడు. అనంతం రూపంలోవచ్చి ఇప్పుడు తమనాదుకొంది భగవంతుడే! అతనికి లోలోపలే భక్తితో నమస్కరించింది సంధ్య.

ఆమెకు ధైర్యం కలిగింది. మంచి రోజులు రావటానికి మరెంతో కాలం పట్టదని నమ్మింది. కాని...విధి—

ఆ ఉదయమే టాక్సీదిగి లోపలి కొచ్చారు — రమణ తల్లిదండ్రులు – అన్నయ్యలు.

"నువ్వెంత కాదనుకొన్నా మేమలా అనుకోలేమురా! పద—ఇంటికి పద! కొద్దినెలలు పూర్తివిశ్రాంతి కావాలన్నాడు డాక్టరు. ఆ తర్వాతవచ్చి ఈఅమ్మాయి తోనే ఉందూగానిలే..."

"సంధ్య ఒక్కర్తీ ఎలా వుంటుం దిక్కడ?"

"బాగానే ఉంటుంది — కావాలంటే డబ్బు పంపిద్దూగానిలే! ఆమాత్రం ధైర్య సాహసాలు లేందే నిన్నింతదూరం తీసుకురాగలిగిందా?"

"అలా నాకిష్టంలేదు..."

"నువ్వన్నా చెప్పమ్మా! నీ భవిష్యత్తు కూడా ఆలోచించుకోవాలిగా నువ్వు?"

ఆరోజే అనంతంకూడా వచ్చాడు.

"పోనీలేరా! వాళ్ళంతగా బ్రతిమాలు తోంటే—వెళ్ళి రెణ్ణెల్లపాటు ఉండిరా! సంధ్య ఇక్కడే ఉంటుందిలే! అంతగా కావాలంటే మా చెల్లాయ్‌వాళ్లు తోడుగా ఉంటారు..."

రమణతల్లి ఏడ్చింది.

అనంతం కరిగిపోయాడు.

సంధ్య కన్నీళ్ళు పెట్టుకొంది.

"పోనీ—వెళ్ళిరండి! రెండునెలలు ఎలాగో గడుపుతాను. అక్కడయితే మీకవసరమైన పోషణ లభిస్తుంది! ఇక్కడ అన్నిటికీ అనంతంగారే భరించా అంటే మనకే బాధగా ఉంటుంది..."

"కాని సంధ్యా! నిన్నొదిలి ఎలా ఉండగలను? వాళ్ళకిష్టమయితే మనిద్దరినీ తీసుకువెళ్ళమంటాను. లేకపోతే ఇద్దరం ఇంత విషంమింగి చద్దాం!"

''అలా అనకండి! వాళ్ళకి నన్ను తీసుకువెళ్ళడం ఇష్టంలేదు ఒకవేళ మీ బలవంతంమీద ఒప్పుకొన్నా అక్కడ నన్ను పరాయిదానిలా చూస్తారు. అంచేత ఈ కొద్దిరోజులూ ఇక్కడే ఎలాగోలా గడుపుతాను. అంతవరకూ అవసరమయినవన్నీ అనంతంగారు ముందే సమకూర్చారు...''

రమణ వెళ్ళిపోయాడు వాళ్ళతో.

నెల-రెండునెలలు గడచిపోయినయ్! మొదట్లో ప్రతివారం ఓ ఉత్తరం వచ్చేదతనిదగ్గర్నుంచి! తరువాత పదిరోజులకో ఉత్తరం—ఆ తరువాత అసలు ఉత్తరాలులేవు. సంధ్యని అశాంతి ఆవహించింది! ఏమయింది? ఉత్తరాలెందుకు రావటంలేదు? అతని ఆరోగ్యం నయంకాలేదా? జబ్బు తిరగబెట్టిందా?

మరో నెలరోజులు అతిభారంగా గడచినయ్. సంధ్య రాసిన ఉత్తరాలకు జవాబేలేదు. అనంతం చెల్లెలు అప్పుడప్పుడు పిల్లల్తో వచ్చిపోతూండేది.

ఓరోజు అనంతం వచ్చాడు.

"రమణ ఉత్తరాలు రాయటంలేదు..." అంది దుఃఖం బిగపట్టుకొంటూ.

''అలాగా! మరి నాకు కబురుచేయాల్సిందావిషయం నేను ఎలాగూ అటువేపు కాంప్ వెళ్తున్నాను రెండ్రోజుల్లో—చూసి, మాట్లాడివస్తాను..."

పదిరోజుల్తరువాత తిరిగి వచ్చాడతను.

అతని మొహం గంభీరంగా ఉంది. కళ్ళు ఎర్రబడిఉన్నాయ్!

సంధ్య గుండెలు వేగంగా కొట్టుకోసాగినయ్. ముఖం పాలిపోయింది. ఏదో దుర్వార్త వినాల్సివచ్చేట్లుంది...

''వాడింత ఫూల్ అనుకోలేదు సంధ్యా! వాడి స్నేహితుడనని చెప్పుకోడానికి నాకే సిగ్గుగా ఉంది..."

సంధ్యకి అయోమయంగా ఉంది. భయంస్థానంలో ఆత్రుత చోటుచేసుకొంది.

"ఈ రెండునెలల్లో వాళ్ళంతా కలిసి వీడిని పూర్తిగా మార్చివేశారు. అందుకు వాళ్ళుపయోగించిన ఆయుధమేమిటోతెలుసా? నీకూనాకూ సంబంధం ఉన్నదట! వాడు ఆ మాటలు నమ్మాడు. వాళ్ళ మామయ్య కూతురుని వివాహమాడటానికి ఒప్పుకున్నాడట కూడా...''







సంధ్యకు ఆశ్చర్యం కలుగలేదు. తన జీవితం సాఫీగా గడుస్తుందన్న నమ్మకం తనకులేదు. ఏదో అవాంతరం ఎదురవుతుందనీ, ఏవో సమస్యలు చుట్టే స్తాయనీ తెలుసు. చిన్నప్పుడు తన చెయ్యిచూసి బాబాయి జోత్యిష్కం చెప్పాడీవిషయం.

మోడులా మరికొన్ని నెలలు రమణ నిరీక్షణంలో గడిచిపోయినయ్. ఆశ: ఒకవేళ ఎప్పటికయినా మనసు మార్చు కొని వస్తాడేమోనని...''

అనంతం వచ్చాడోరోజు.

''నేను ఇక హైద్రాబాద్‌లోనే ఉంటాను సంధ్యా: కాంప్‌లు తిరగాల్సిన అవసరంలేదు. నీసంగతేమిటి? భవిష్యత్తే మయినా ఆలోచించుకొన్నావా? నీకె లాంటి సహాయం కావాలన్నా చేయడా నికి సిద్ధంగా ఉన్నాను.''

అప్పుడు ఆలోచన మొదలుపెట్టింది తను. ఎన్నాళ్ళని రమణకోసం నిరీ క్షించగలదు? అతనసలు ఎప్పటికయినా, వస్తాడో రాడో కూడా తెలీదు. అసలత నికి తను గుర్తున్నదో లేదో ; ఈ పరి స్థితుల్లో ఇలా అనంతంమీద ఆధారపడి ఎంతకాలం గడుపుతుంది?

ఆలోచనల్లోనే మరికొన్ని రోజులు గడచినయ్.

తరువాత అనంతం వచ్చినప్పుడు చెప్పింది.

''అదివరకు సంగీతం నేర్చుకొన్నాను. కాని పరీక్షలకెళ్ళలేదు. ఆ పరీక్షలయినా పాసయితే—తేలిగ్గా టీచర్ ఉద్యోగం లభిస్తుందనుకొంటాను. అలాగయితే నా కాళ్ళమీద నేను నిలబడగలను...''

''సరే — నాకుతెలిసినావిడ ఒకామె ఉంది-సంగీతం స్కూల్లో. ఆవిడను తీసుకొస్తాను. వివరాలు కనుక్కొందాం ...'' అన్నాడు.

అతనికి తనమీదగల అభిమానానికి కన్నీరు తిరిగింది సంధ్యకి.

రోజులు గడుస్తున్నాయ్‌! సంగీతంలో పరీక్షలు పాసయింది సంధ్య. అందుకు సహాయపడిన సంపత్‌కుమారి ఓ రోజు అంది.

"నీ గొంతు చాలా అద్భుతంగా ఉంటుంది. సంగీతంమీద ఆధారపడ దల్చుకొంటే నీకో మంచి మార్గం చెబుతాను. ఇక్కడ పెద్దహోటల్స్‌లోనూ బార్స్‌లోనూ చాలాచోట్ల 'కాబరే' డాన్సులు జరుగుతోంటయ్‌. చాలాచోట్ల సినిమాపాటలు పాడేందుకు స్త్రీలు వస్తూంటారు. గొంతేకాకుండా మనిషి అందంకూడా వాళ్లకు నచ్చాలి. నీకి రెండూ ఉన్నాయ్‌ కనుక ఆ అవకాశం లభించటం అంతకష్టమేంకాదు. అది అగౌరవమైన వృత్తికూడా కాదు. చాలా మంది మధ్య తరగతిస్త్రీలు ముందు కొస్తున్నారీరోజుల్లో!

ఒప్పుకొంది సంధ్య.

అనంతానికి తన నిర్ణయం తెలియ జేసింది సంధ్య.

"నీ యిష్టం! నువ్‌ -చెయాలనుకొన్న ఏ పనికయినా నా సహకారం ఉంటుం దని ముందే చెప్పాను..."

మొదటి ప్రోగ్రాంకి అతనుకూడా ఉన్నాడు.

ఆ రోజు విజయవంతంగా ప్రోగ్రాం ముగియడానికి కారణం అతనే!

ఓ రోజు అనంతం చెల్లెలు వచ్చింది.

"మీకో విషయం చెబుదామని వచ్చాను! అన్నయ్య మీకు సహాయం చేశాడు. ఇప్పుడు మీరు అన్నయ్యను వలలోవేసుకోడం అన్యాయం..."

తను అదిరిపడింది. కళ్ళవెంబడి నీళ్లు తిరిగినయ్‌.

ఏమిటి ఆమె మాట్లాడుతోంది. అనంతాన్ని తను వలలోవేసుకొందా? భగవాన్‌! ఇంతకంటె దారుణం ఇంకేమయినా ఉంటుందా?

"నేనేమీ అభాండాలు మీ నెత్తిన రుద్దటంలేదు; అందరూ అనుకొంటున్నా, నే నిన్నాళ్లూ నమ్మలేదు. కాని మొన్న, అన్నయ్య తనకు పెళ్ళివద్దని చెప్పెయ్యి డాన్నిబట్టి నమ్మాల్సి వచ్చింది...''

రెండురోజులు ఆలోచన—ఏడుపు — భోజనంకూడా సయించలేదు. అనంతం వచ్చాడు.

"సారీ సంధ్యా! నువ్వదేమీ పట్టించు కోవద్దు. నేను చెల్లాయిని బాగా చివాట్లు వేశాను. మరోసారి నీదగ్గరకు వెళ్ళొద్దని కూడా చెప్పాను..."

రోజులు గడుస్తోనే ఉన్నయ్‌! అనంతం కనిపించడం అరుదయిపోయింది.

ఆరోగ్యంమీద అశ్రద్ధ జ్వరంలోకి దించింది.

ఆ రోజు అనంతం వచ్చాడు. తన వళ్ళు కాలిపోతోంది జ్వరంతో. వారం రోజులు తనకు సపర్యలుచేస్తూనే గడిపాడు. ఎంత వారించినా వినలేదు. తను లోలోపలే బాధపడసాగింది.

"ఏమిటీ అనుబంధం? తనకు తల్లి



తండ్రీ, తోబుట్టువులూ ఉన్నారు. భర్త ఎక్కడో ఉన్నాడు. కాని తనను అభిమానించి ఆదరిస్తోంది భర్తస్నేహితుడు ..."

అతని సేవలతో కోలుకొంది తను.

ఆ రోజు రాత్రి—

అతను కుర్చీలో కూర్చుని తనతో ఏదో మాట్లాడుతూనే నిద్రపోయాడు. గాఢనిద్ర. వారంరోజులు రాత్రంతా ఇంచుమించుగా తనకోసం మేలుకూర్చొన్న బడలిక అది.

తనకు నిద్రపట్టలేదు. కిటికీలోనుంచి వెన్నెల తెల్లగా ప్రవహిస్తోంది అర్ధరాత్రి దాటిపోయింది. జరిగిన జీవితమంతా ఓసారి కళ్లముందుకదలి హృదయం బరువెక్కిపోయింది. కిటికీ దగ్గరకెళ్ళి నుంచుని బయటకు చూస్తూండిపోయింది. అలా ఎంతసేపు గడిచిందో తనకే తెలీదు. ముఖంమీద వెచ్చని ఆవిరి తగిలినట్లయి పక్కకు తిరిగింది. ఇంచుమించుగా తనపెదాల్ని తాకుతోన్నయి అనంతంపెదాలు. అతని చేతులు నెమ్మదిగా తనను చుట్టేసి అతని గుండెలదగ్గరకు చేర్చినయ్.

"అనంతంగారూ!" భయంగా అంది తను

అతను ఛటుక్కున తనను వదిలేశాడు చకచక గదిలోనుంచి బయటకు వెళ్ళిపోయాడు. అంతే! ఆ తరువాత

అతను ఇంతవరకూ మళ్ళీ కనిపించలేదు.

చాలారోజుల తరువాత ఇన్నాళ్ళకు— మళ్ళీ—ఇవాళ...

తెల్లారిపోతోంది. సంధ్య కూర్చునే ఉంది. ఎటూ తెగటంలేదు. ఏమీ నిర్ణయించుకోలేకపోతోంది. జరిగిన సంఘటనలన్నీ వరుసక్రమంలేకుండా ముక్కలు ముక్కలుగా మనసుని దొలిచేస్తున్నయ్. మధ్య మధ్యలో నవ్వుతోన్న రమణ ముఖం—

పూర్తిగా తెల్లారిపోయింది. జ్వరం వచ్చినట్లనిపిస్తోంది సంధ్యకు. కొద్దిసేపట్లో అనంతం వస్తాడు. అతనికి ఈ లోగా నిర్ణయంతీసుకొని తెలియజేయాలి

కాని నిర్ణయం ఏమి తీసుకోవాలి?

అనంతంతో కొత్త జీవితానికి స్వాగతం పలకడమా, రమణ స్మృతుల్తో శేషజీవితం గడపడమా?

ఏడుగంటలు కొట్టింది గడియారం.

సంధ్య లేచినుంచుంది. ఆమె కళ్ళు ఎర్రబడినయ్. ఒక నిర్ణయానికి వచ్చిన వ్యక్తిలా చాలాసేపు రమణ ఫోటో ముందు నుంచుని తదేకంగా ఫోటోవంకే చూసింది

సరిగ్గా అప్పుడే తలుపుకొట్టిన చప్పుడయింది. అనంతం వచ్చినట్లున్నాడు. అతనిక్కావలసింది తన నిర్ణయం — అది తెలుసుకోడానికి ఆశగా—ఆత్రుతగా—

అవును! నిర్ణయిం తెలియజేయాలి! ఆలస్యంచేయగూడదు...

చేతికున్న వజ్రపుటుంగరంతీసి, అందులోని వజ్రాన్ని చూర్ణంగాచేసి బలవంతంగా నోట్లోవేసుకొని మింగేసింది.

బయట తలుపుమీద బాదటం ఎక్కువయింది.

తూలుతూ వెళ్ళి తలుపు తీసిందామె.

"అనంతంగారూ! ఒకరిని పెళ్ళాడిన స్త్రీని —ఇప్పుడు మిమ్మల్ని మళ్ళీ పెళ్ళిచేసుకొని—మనిద్దరి జీవితాలూ నరకం చేయడం నాకిష్టంలేదు అందుకే శాశ్వతంగా దూరమవుతున్నాను..."

తరువాత ఆమెకు మాటలు సరిగ్గా రాలేదు ఎదురుగ్గా నుంచుంది అనంతం కాదు...

మరి ఎవరది?...అతను...రమణా? ...భగవాన్! అవును! రమణే!

"సంధ్యా..." ఆమెను కౌగిట్లోకి లాక్కున్నాడు రమణ

"నన్ను క్షమించు సంధ్యా! మావాళ్ళ అబద్ధాలువిని నిన్ననుమానించేను ... జీవితంమీదే విరక్తి కలిగి అనేక పుణ్యక్షేత్రాలు దర్శించాను. కాని ఎక్కడికి వెళ్ళినా దేముడు నాకు మనశ్శాంతి ఇవ్వలేదు. నాకు మనశ్శాంతి నీ సాన్నిధ్యంలోనే ఉంది...మరెక్కడా లేదు..."

గొల్లున ఏడ్చేసింది సంధ్య.

"ఆలస్యం చేశారండీ..." కిందకు వరిగిపోయిందామె

అంతే! ఆ తరువాత ఆమె ఇక మాట్లాడలేదు

అప్పుడు కారు దిగిలోపలకు రాబోతున్న అనంతం ఆదృశ్యంచూచిఅక్కడే శిలాప్రతిమలా నిలబడిపోయాడు.

---




(గత సంచిక తరువాయి)

## 42

నాగేంద్రది పైశాచిక స్వభావం కుమార్తె నామకరణం అంటూ గ్రాండ్ పార్టీ అరేంజ్ చేశాడు తన హోటల్లో. మురళిని స్వయంగా ఆహ్వానించాడు ఆ పార్టీకి. బృందను చూడటానికి అతడు తప్పక వస్తాడని అతడికి తెలుసు అతడి ఎదుట బృందచేత నాట్యం చేయించాలి, త్రాగించాలి, తందనా లాడించాలి. ఇదీ అతడి పైశాచిక కోరిక. అటు బృందా ఇటు మురళీ కూడా బాధపడితే సంతోషించాలి. తాను. ఇంకో పెద్ద ప్లాను కూడా వుందతడి మనస్సులో. అది కేవలం అతడికి అతడి తల్లికీ మాత్రమే తెలుసు.

అతడి అంచనా తప్పలేదు. మురళి వచ్చాడు పార్టీకి. అయితే అతడివెంట జమున కూడా వుండడం నాగేంద్రకు మరింత ఆశ్చర్యంగా వున్నది

ఎవ్వరికీ అనుమానం రానంతగా అతడు బృందతో నవ్వుతూ, తుళ్ళుతూ ప్రేమ కురిపించుతున్నాడు. బృంద జముననూ మురళినీ ఆప్యాయంగా పలుకరించింది. పాపను చూపించింది. మురళి ప్రేమగా ఎత్తుకున్నాడు బిడ్డను

"ఓః నీ ప్రాణేశ్వరుని చూచుకొనా అంత ఉల్లాసంగా వున్నావ్?" అన్నాడు నాగేంద్ర, చాటుగా బృందను.

ఆమె అతడినుండి తప్పించుకు పోయింది.

పార్టీ మంచి జోరుగా సాగుతోంది. నాగేంద్ర కళ్ళతోనే బృందను చీల్చి చెండాడుతున్నాడు. బలవంతంగా ఆమె చేత త్రాగించాడు "అందరి ఎదుటా అవమానంపాలౌతావో, చెప్పిన మాట వింటావో నీ యిష్టం. చూడు—ఇంతింత పెద్ద ఆఫీసర్లు, వర్తకులు —సంఘంలో పేరున్నవాళ్ళు! వీరందరి భార్యలూ త్రాగడంలేదూ? ఈ కాలంలో త్రాగడం తప్పుకాదు. నాగరికత!" అన్నాడు బలవంతంగా ఆమె గొంతులో గ్లాసు ఒంపుతూ.

కనులు మూతపడిపోతూ తూలి పోతూన్న బృందను ఒక నడివయసు వ్యక్తి వచ్చి నాట్యానికి ఆహ్వానించాడు.

"జాగ్రత్త, పెంకె వేషాలేయకు. అతడితో నాట్యం చెయ్యి. చెప్పినట్టు విను లేదా ఈ రోజు పాపకూ, నీకూ శాశ్వత దూరం." చెవిలో హెచ్చరించి వెళ్ళిపోయాడు నాగేంద్ర మరొకతెతో డాన్సు చేయడానికి.

బృందను వింతగా చూస్తూన్న మురళివైపు ఓ విజయగర్వపు హాసం విసిరాడు. మురళికీ, జమునకూ ఇదంతా ఏదో విషవలయంగా వున్నది కానీ ఏమీ అర్థంకావటంలేదు

జమున బృందతో మాట్లాడను ప్రయత్నించినా వీలుపడలేదు.

కొంత సేపటికి చూస్తే ఆ జనంలో బృంద ఎక్కడాకనిపించలేదు మురళికీ, జమునకూ .

"బృంద వివరించలేని బాధ ఇదన్నమాట! త్రాగటం, పరాయివాడిని పట్టుకు ఆడటం..." సాలోచనగా అన్నాడు మురళి.

"లేదు. ఇంకా ఏదో పెద్దదే వుండాలి ...అని నా అనుమానం!" జమున మెల్లగా అన్నది.

"సరే మనం వెళ్దాం ఒక్కొక్కళ్లూ తప్పత్రాగి స్పృహకూడా లేకుండా పోతున్నారు," జమున అన్నది

"ఇంతకూ బృందతో ఒక్కసారి మాట్లాడి నిశ్చింతగా వుండమని చెప్తే బాగుండేది ఎక్కడుందో! ఒక్కసారి పైఅంతస్థులో చూద్దామా?" అన్నాడు మురళి

ఇద్దరూ పైకి వెళ్ళారు.

ఒక గదిలో ఒక మూల సోఫాలో, చేతిలో సీసాతో తప్పత్రాగిన మత్తులో పడివున్నాడు నాగేంద్ర. అతడి ప్రక్కనే ఒక యువతీ అదే స్థితిలో వున్నది

అటువంటి జంటలు రెండు మూడు గదులలో కన్పించాయి బాహ్యస్మృతి లేకుండా.

ఏదో అనుమానం మనసున మెదలగా ప్రతిగదిని శ్రద్ధగా చూస్తూ సాగాడు మురళి.

ఒకమూల గదివైపు చూపుతూ, "బావా, అదేమిటి బృంద గొంతులా ఉన్నది!" అన్నది జమున.

దగ్గఱగా వెళ్ళి విన్నారు సందేహం లేదు. "ఒక్క అడుగు ముందుకువేసినా మాట దక్కదు. నా శవాన్నే చూస్తావ్" ఏడుస్తూన్నది బృంద.

ఒక పురుష కంఠం వికటంగా నవ్వింది. "నీ భర్తే స్వయంగా అర్పించాడు నిన్ను నాకు. ఇక దేవుడుకూడా నిన్ను రక్షించలేడు, లక్షరూపాయలు చేదటే పిచ్చిదానా?"

మురళి ఇక సహించలేకపోయాడు. తలుపులు ఎంత బలంగా త్రోసినా తెఱవ బడటంలేదు అంతకంతకు బృందరోదన అధికమౌతూన్నది. మురళి కిటికీ గాజు తలుపులను బ్రద్దలు కొట్టుకుంటూ లోపలికి దూకాడు.

హృదయ విదారకంగా ఏడుస్తూన్న బృంద మురళిని చూస్తూనే ఉలికిపడింది.

"మురళీ చూచావా నా బ్రతుకు ఎలాగైపోయిందో!" అన్నది ముఖం రెండు చేతులలో దాచుకుంటూ

మురళీ ఆ వ్యక్తీ ఘోరంగా తలపడ్డారు. అద్దాలు పగుల్తున్నాయి. కుర్చీలు ఎగురుతున్నాయి.

సవ్వడి విన్న జనం పోగయ్యారు. మూపరుల నోటినుండి రకరకాల మాటలు వినవస్తున్నాయి బృందనూ, ఆమె కులాన్నీ హీనపరుస్తూ.

బృంద సహనం పూర్తిగా నశించిపోయింది. ఇక తాను ఈ ప్రపంచానికి ముఖం చూపలేదు. అందుకే త్వరగా నిర్ణయించుకున్నది. దూరంగా ఓ మూల ఒదిగి నించున్న జమునకునమస్కరిస్తూ "జమునా, నా బిడ్డ జ్ఞాపకం వుంది కదూ?" అంటూనే మెఱపులా వరండాలోనుండి క్రిందికి దూకివేసింది!

"బృందా!" పోట్లాట మాని ఆమె వెంట పరుగెత్తుతూ ప్రపంచమంతా విన్పించేటట్లు ఆక్రందన చేశాడు మురళి. కానీ పట్టుకోలేకపోయాడు.

* * *

## 43

చావుబ్రతుకుల మధ్య ఊగుతున్నది బృంద. ఆశలేదన్నారు డాక్టర్లు. మేజిస్ట్రేటు, పోలీసు అధికార్లు రప్పించబడ్డారు. బృంద అపస్మారకంగా లేదు —ఇంకా తెలివిగానే వున్నది గనుక మరణవాంగ్మూలం రికార్డుచేస్తున్నారు

నాగేంద్ర వణికిపోతున్నాడు తన బ్రతుకంతా బయటపడగలదని.

మురళికి కూడా గట్టిదెబ్బలు తగిలాయని ఎవరో ఫోనుచేయడంవల్ల వాసుదేవరావూ, రోహిణీకూడా వచ్చారుఆత్రంగా.

జమున చెప్పిన సంగతులు విన్న వాసుదేవరావు చాలా జాలిపడ్డాడు బృందపై. రోహిణి వదనమే చెప్తూన్నది ఆమెకుకూడా బృందపై అభిమానం కలిగినట్లు.

బృంద ఈయబోయే మరణ వాంగ్మూలం కొరకై అందరూ ఆత్రతగా చూస్తున్నారు.

ఈ దెబ్బతో నాగేంద్ర, లీలావతిల పాపం పండిందని అందరూ భావించారు.

"మీ భర్త పెట్టేబాధలవల్ల మీరు ఈ ఆత్మహత్యకు పాల్పడ్డారన్నది నిజమేనా?" ప్రశ్నించాడు అధికారి.

"లేదు!" బలవంతంగా నోరు విప్పింది బృంద. అతి కష్టంగా ఒక్కొక్కమాటే చెప్పింది. "నా భర్త నన్ను ఏనాడూ బాధపెట్టలేదు. సంఘాన్నంతనూ ఎదిరించి నన్ను ఆయన సంస్కార వివాహం చేసుకున్నారు. అటువంటి వ్యక్తి నన్నెందుకు బాధపెడ్తారు?"

"మరి మీరెందుకీ ఆత్మహత్యకు పాలబడ్డారు?"

"నేను ఆత్మహత్య చేసుకోవాలనే తలపే లేదు. నాకు తరచూ స్పృహ తప్పుతూ వుంటూన్నది, ఒక ఆరునెలల నుండీ. మా ఫామిలీ డాక్టర్ని మీరు అడగవచ్చు.... మేడ బాల్కనీలో నిలబడి క్రిందికి చూస్తున్నాను ఎవరో తెలిసిన వ్యక్తి వెళ్తూంటే. హఠాత్తుగా కళ్ళు తిరిగాయి నాకు. తర్వాత ఏమైందో తెలియదు. ఇప్పుడు తిరిగి మిమ్మల్నందర్నీ చూస్తున్నాను."

బృంద క్షమాహృదయానికి చూపరులంతా ఆశ్చర్యం ప్రకటించారు మురళీ. జమునా బొటబొట కన్నీరు కార్చారు. వాసుదేవరావు కనులొత్తుకున్నాడు.

ఎన్నిపాపాలైనా చేయగల నాగేంద్ర ఎన్ని కన్నీళ్ళకూ కదలని నాగేంద్ర, ఈ బృంద మాటలతో చలించిపోయాడు. "లేదు, నేనే నిన్ను హింసించి హింసించి చంపానని చెప్పు బృందా నిజం చెప్పు బృందా. ఈ పాపిష్టివాడింత క్షమకు అర్హుడుకాడు" జుట్టు పీక్కుంటూ అరచి ఏడ్వసాగాడు.

పోలీసులు అనుమానంగా చూచారు

"లేదు. నా ప్రమాదస్థితిచూచి ఆయన మతి చలించింది. అంతే" అన్నది బృంద.

"నన్ను నీవు వదలిపెట్టినా భగవంతుడు క్షమించడు నీ బ్రతుకుతో ఆడుకున్నాను బృందా!" రోదించసాగాడు నాగేంద్ర.

"నేను చనిపోయే ముందైనా ఈ మాత్రపు అనురాగం కలిగింది మీలో. అంతే చాలు ఏదీ పాప? ఒక్కసారి చూపండి. మురళీబాబుతో, జమునతో నేను మాట్లాడాలి.

దుఃఖంపెల్లుబుకుతూన్న మురళిమాట్లాడలేకపోయాడు అతడి చేతిని స్పర్శిస్తూ అన్నది బృంద, "ఏడవకు మురళీ. భగవంతుని ప్రార్థించు మరుజన్మలోనైనా పతి ప్రేమకు నోచుకోగలిగిన భాగ్యశాలినిని కావాలని నాది ఒక్క కోరిక తీరుస్తావా?"

"చెప్పు బృందా, ఒక్కటి కాదు,

వంద అడుగు," కన్నీళ్ళతో అన్నారు జమునా మురళీ ఒకేసారి.

"నేను ఏ జీవితం కోసమైతే కలలు కని ఆఖరుక్షణం వరకూ పోరాడానో అటువంటి ఉత్తమ జీవనం నా బిడ్డ 'గీత'కు లభించాలని నా కోరిక. ఎవరైనా విశాలహృదయులు గీతను ఉన్నతంగా పెంచే ఏర్పాట్లు చేయగలవా? బహుశః నా భర్త నా ఈ ఆఖరికోరికను కాదనరనుకుంటాను."

నాగేంద్ర పాపను దగ్గరగా తెచ్చి స్వహస్తాలతో మురళికి అందించాడు. "నిన్ను కుటిలంగా మురళినుండి విడదీశాను నేను. నీ ఆఖరి కోరికను కూడా కాదనేంత నీచుణ్ణికాను బృందా. జీవితాంతం నీ స్మృతితో ఏ మారుమూలకో పోయి బిచ్చమెత్తైనా బ్రతుకుతాను కానీ ఇక ఏ పాపమూ చేయను."

బృంద కనులలో సంతోషం క్షణకాలం కలిగింది.

"ఏం మురళీ? నా కోరిక తీర్చగలవా? పాపకు సరియైన జీవితం చూపించగలవా? ధనధాన్యాలక్కర్లేదు. నీతిగా, నియమంగా సుఖపడేట్లు పెంచే ఎవరి చేతులలోనైనా దాన్ని పెట్టు. నా ఆత్మ శాంతిస్తుంది."

"తప్పకుండా నీ యిష్టప్రకారం చేస్తాను బృందా, నిశ్చింతగా వుండు." అంటూన్న మురళివద్దకు వచ్చాడు వాసుదేవరావు. అతడి చేతులలోని 'గీత'ను అందుకుంటూ బృంద తలనిమిరాడు "ఎక్కడో కాదు. నీ గీత నా యింట బృందా, గీత విషయంలో నిశ్చింతగా వుండు. నీకు మాట యిస్తున్నాను." హుందాగా గీతను రోహిణికి అందించాడు. ఆమె ఆమోదపూర్వకంగా అందుకున్నది. "మన రాధ ఆఖరు కోరిక కూడా యిదే. ఇందువల్ల ఆమె ఆత్మ శాంతిస్తుంది" అన్నది.

"మురళీ మరొక్కమాట విను." రొప్పుతూ అన్నది బృందం.

"చెప్పు బృందా."

"నన్ను వివాహమాడలేదనే బాధతో వుండేదాన్ని. కాని నా పవిత్రత ఈనాడు నీచే రక్షింపబడిందనే ఆనందంతో వెళ్ళిపోతున్నాను జమునా ఒక్కమాట. మీకు పుట్టిన బిడ్డకు నా పేరు పెడ్తావు కదూ?" "మురళీ జమునను నిర్లక్ష్యం చేయవద్దు" అంటూ ఇద్దరి చేతులనూ కలిపింది. "మన జీవితం బృందావనం కావాలనిఆశిందాం" ఆకలిపిన చేతులపై మురళీ, జమునల కన్నీరు టప టపా రాలింది "గతం మరచిపో మురళీ. నీవూ జమునా బృందావనంలోని రాధా కృష్ణుల మాదిరి జీవితమంతా గడపాలని కోరుకొంటున్నాను.

బాబుగారూ మీ పెద్దలందరి మధ్యనా పవిత్రంగా, నిశ్చింతగా, సంతృప్తిగా వెళ్ళిపోతున్నాను. నాది అధమమైన పుట్టుక కాదు. నేను తక్కువదాన్నికాదు అందుకే మీ అందరి అనురాగాలూ అందుకుని మరీ వెళ్తున్నాను ... నమస్కారం." నమస్కరించటానికి ఎత్తిన రెండు చేతులూ కలవకుండానే వాలి




వెంకటరంగం నిద్ర మంచంమీంచి లేస్తూనే మొదటచేసేపని 'హిందూ' పత్రిక చదవటం చదవటమంటే పేపరంతా చదువుతాడని కాదు; మొదటి పేజీ మాత్రమే అందులో కూడా ముఖ్యంగా మాట్రిమోనియల్ కాలమ్ మాత్రం చదివి ఒక దీర్ఘ నిట్టూర్పు విడిచి చిన్నగా మంచందిగుతాడు. కాని ఆ రోజుమాత్రం మంచంమీంచి చాలా సంతోషంగా ఒక్క గంతేసి దిగాడు. దిగుతూనే ఎదురుగా వున్న పెద్ద అద్దంముందు నిలబడి ఆ పాదమస్తకం తన ప్రతిబింబాన్ని చూసుకుంటూ మురిసిపోయాడు.

వధువు వయస్సు 25 సంవత్సరాలట! 30 నుంచి 35 లోపల వరుడు కావాలట. విడోయర్ అయినా ఫరవాలేదట. తనను చూసి 35 కంటే ఎక్కువ వయస్సు ఉంటుందని ఎవరనగలరు? అయినా తన వయస్సుమాత్రం యెంత, నలభయ్యేగా! అదయినా పోయిన దీపావళికి గాక ఆ క్రిందటి దీపావళికేగా నిండింది. అయినా వాళ్ళ పిచ్చికాకపోతే మగవాడికి వయస్సేమిటి? ఇలా ఆలోచిస్తున్న వెంకటరంగం దృష్టి అక్కడక్కడ నెరసి వున్న జుట్టుమీద పడ్డది మనస్సు చివుక్కుమన్నది.

ఆ! ఈ రోజుల్లో తల నెరవటానికి వయసుకూ సంబంధం ఏమిటి తన పిచ్చికాకపోతే, అనుకున్నాడు. పక్కింటి సుబ్బమ్మ కూతురు రాజమ్మకు తీరాచూస్తే పాతికేళ్లు లేవు, తలంతా ముగ్గుబుట్టయింది. తన కళ్ళముందు బందాడటం నేర్చుకున్న పిల్ల! ఇక తనకు తల నెరవటం ఒక అబ్బురమా?

ఫొటో కూడా పంపమన్నారుకదూ? ఊఁ ఇప్పుడు మళ్ళీ ఫొటో తీయించుకోవట మెందుకు? తను 33 సంవత్సరాల వయసులో తీయించుకున్న చక్కని ఫొటో వున్నది. ఎక్కువడబ్బయితే అయిందికాని చాలా బాగా తీశాడు, ఆ ఫొటోగ్రాఫరు. తన ఫొటో చూస్తుంటే అది తనదేనా, అనే అనుమానం తనకే కలుగుతుంది అప్పుడప్పుడు.

వెంకటరంగం గబగబా టేబుల్ దగ్గరకు వెళ్ళి సొరుగులోవున్న ఫొటోను బయటకు తీశాడు. కళ్ళు పెద్దవిచేసి తనివితీరా ఒక్కసారి చూసుకున్నాడు. ఎంత బావున్నది ఫొటో! సరిగా 25 ఏళ్ల యువకుడి ఫొటోలా వున్నది; అనుకున్నాడు కాని, వెంటనే ఒక నిముషం కితం అద్దంలో కన్పించిన తన ప్రతిబింబం గుర్తొచ్చింది గుండెల్లో ఏదో గుచ్చుకున్నట్లు బాధపడ్డాడు వెంకటరంగం.

అప్పటికీ యిప్పటికీ రూపంలో భేదం యెంతో లేదు. అప్పుడు జుట్టంతా నల్లగా వుండేది, యిప్పుడు అక్కడక్కడ కొంచెం తెల్లబడ్డది నున్నగావుండే బుగ్గలు కొంచెం చప్పబడ్డాయి. కుడి పక్కన రెండు దంతాలు లేకపోవటం వల్ల యింకొంచెం లోతుకుపోయాయి బుగ్గలు. ఆ రెండు దంతాలు కట్టించుకుంటే సరిపోయె. ఆ పెద్దకళ్ళు ఏమీ చిన్నవి కాలేదు. కాకపోతే కళ్ళచుట్టూ కొంచెం ముడతలుపడ్డాయి. చూపులోని చురుకుదనం, కళా తగ్గింది. దానిక్కారణం తన నిరాశ, బరువుతో కూడిన జీవితమే. తన భార్య పోయినప్పటి నుంచీ తన ఆనందం, చూపుల్లోని చురుకుదనం తగ్గింది. మరల జీవితంలోని ఆనందంతోపాటు అవి మాత్రం యెంతలోకివస్తాయి? తను ఆ ఫొటోనే పంపుతాడు. వాళ్ళకు తప్పకుండా అది నచ్చుతుంది. నచ్చటమేమిటి ? ఆ పిల్ల దాన్ని హృదయానికి హత్తుకుంటూ నిముషం ఒక యుగంగా గడపదా!

తను మర్చిపోయాడు! ఆ పిల్ల వయస్సెంతన్నారు? యిరవయి అయిదా? తనకంటే యెంత చిన్నది? తను మహా అయితే ఆమెకంటే పదహారు పదిహేడేళ్ళు పెద్దయి వుంటాడు. అదేమంత చెప్పుకోతగ్గ పెద్ద వయస్సు కాదు! తన నాయనమ్మ చెబుతూవుండేది. "మగవాడికి వయస్సేమిటిరా నాయనా? మా కాలంనాడు ముప్పయియేళ్ల మగవాడికి మూడేళ్లపిల్లని యిచ్చి పెళ్ళిచేసేవారు. పెళ్లినాటికి నాకు యేడేళ్ళు, అప్పటికి మీ తాతకు ముప్పయిదాటి రెండేళ్లకు యెక్కువే అయిందట." నిజంగా యీ ముసలివాళ్ళు చెప్పే మాటల్లో యెంత అనుభవం, యెంత సత్యం యిమిడి వుంటాయి. తను కుర్రతనంలో వాళ్ల మాటలను యెగతాళి చేసేవాడు. కాని యిప్పుడిప్పుడు అర్థమవుతోంది, వాళ్ల మాటల్లోని నిజం తనకు.

అయినా పక్కింటి సుబ్బారావును చూడరాదూ! మొన్ననే రెండో పెళ్లి చేసుకున్నాడు. ఆ పిల్లకు ఇరవైకంటే ఎక్కువ వయస్సు వుండదు. సుబ్బారావయినా మహా అయితే తనకంటే ఐదారేళ్ళు చిన్నయి వుంటాడేమో. కాని అతనికంటె తనే ఎంతో చిన్నవాడిలాగ నాజూగ్గా వుంటాడు. ఆ దంపతులు చిలకా గోరంకుల్లాగా ఎంత ముచ్చటగా కాలం గడుపుతున్నారు; తను మాత్రం ఎందుకలా గడపలేడు! ఇంకా సరదాగా ఆనందంగానే గడపవచ్చు. తనదగ్గర ఆ సుబ్బారావుకంటే ఎక్కువ డబ్బు వుందికూడాను.

ఇలా ఆలోచిస్తున్న వెంకటరంగం ఆలోచనలకు "నాన్నా యివ్వాళ పరీక్ష ఫీజు కట్టాలి" అన్న కొడుకు మాటలతో అంతరాయం కలిగింది, వులిక్కిపడ్డాడు. ఎదురుగా అతని పందొమ్మిది సంవత్సరాల కొడుకు ఆశ్చర్యంగా తండ్రి కళ్లలోకి చూస్తున్నాడు.

వెంకటరంగానికి, తన కొడుకు తన హృదయాన్ని చదువుతున్నట్లనిపించింది. యీ రోజే తనకు అంత పెద్ద కొడుకున్నట్లు అతనికి తట్టింది. నిన్నా మొన్నటి వాడు చెట్టులాగా ఎంత పెరిగాడు! రెండేళ్లలో వీడికి పెండ్లి చేయాలి. వీడికంటే తను చేసుకోబోయేపిల్ల ఎంత పెద్దది? ఐదు, ఆరు సంవత్సరాలా? ఎందుకో తెలియకుండానే ఎదురుగా నిల్చున్న కొడుకుమీద వెంకటరంగానికి కోపం వచ్చింది. తల్లి చనిపోయిన తరవాత తన కొడుకుమీద కోపం రావడం అదే మొదటిసారి. పలక్కుండా బీరువాలోని డబ్బుతీసి టేబిల్‌మీద విసిరికొట్టాడు కోపంగా. కొడుకు ఆశ్చర్యంతో అభిమానంతో కూడిన బాధతో మాట్లాడకుండా ఆ డబ్బు తీసుకుని వెళ్లిపోయాడు

వెళుతున్న కొడుకు పాలిపోయిన ముఖంచూసి వెంకటరంగం బాధపడ్డాడు అనవసరంగా తను ఎందుకు అలా ప్రవర్తించానా అనుకున్నాడు.

తనకు అంత పెద్ద కొడుకు ఉన్నట్లు తెలిస్తే వాళ్ళు పిల్లను యిస్తారా? ఆఁ ఎందుకివ్వరు? విడోయర్ అయినా ఫరవాలేదని వాళ్ళే రాశారు! విడోయర్‌కు పిల్లలుండకుండా ఎలా వుంటారు? కాకపోతే వచ్చినచిక్కల్లా తన కొడుకు వయస్సునుబట్టి తన వయస్సునూ పెంచుతారు. వాడి దుంపతెగ పందొమ్మిదేళ్లకే పాతికేళ్ల వాడిలాగ పెరిగిపొయ్యాడు. నంటి వూపిరివాడయితే నాలుగేళ్ళు తగ్గించయినా చెప్పవచ్చును.

అసలు తనకు కొడుకు వున్నట్లు ప్రత్యేకం చెప్పవలసిన అవసరంమాత్రం ఏమిటి? అంతగా అడిగితేఅప్పుడే చూచుకోవచ్చు అనుకున్నాడు.

ఇలా ఆలోచిస్తూ కాలకృత్యాలు తీర్చు




కొవటానికి లేచాడు వెంకటరంగం. ఎన్నెన్నో ఆలోచనలు ముసురుకొస్తు న్నాయి ఈగల్లాగ 'ఝుయ్' మంటూ.

వెంకటరంగం బ్యాంకిలో మేనేజరుగా పనిచేస్తున్నాడు. నెలకు వెయ్యిరూపా యలు జీతం. కుటుంబ ఖర్చులుపోగా సంవత్సరానికి కనీసం మూడువేల రూపాయలన్నా బ్యాంకులో వేసుకుం టాడు భార్యవైపునుంచి కొంత ఆస్తి వచ్చింది. భార్యనుఎంతో ప్రేమించేవాడు పదిహేను సంవత్సరాలయింది భార్య చనిపోయి. అప్పటికి అతనికి అతని కొడుకు రాజుకు ఐదు సంవత్సరాలు. భార్యకు మళ్ళీ పెండ్లి చేసుకోననీ, ఆమె ప్రేమచిహ్నమైన ఆ ఒక్క కొడుకును ప్రాణంతో సమానంగా చూసుకుంటాననీ వాగ్దానంచేశాడు. ఆ ప్రకారంగానే పది సంవత్సరాలు ఎంతో నిబ్బరంగా, నిశ్చల మైన జీవితాన్ని గడుపుకొచ్చాడు. భార్య దినంకూడా వెళ్లకమునుపే, పెళ్లిమను ములు మాట్లాడే మగవాళ్లంటే అతని కెంతో అసహ్యం. తన ఫ్రెండ్స్‌తో ఆ విషయాన్నే ఎప్పుడూ చర్చించేవాడు.

కాని వెంకటరంగంలో ఐదుసంవత్స రాల క్రితం మార్పు వచ్చింది. అది ఒక్కరోజు అకస్మాత్తుగా వచ్చిందని చెప్పటానికి వీల్లేదు అతని మనస్సులో ఏ మూలనో అజ్ఞాతంగా దాగివున్న కోర్కె క్రమంగా పెరిగి ఒకరోజు ప్రబలమై బయటపడ్డది. అంతే. ఆ కోర్కె మ్యాట్రిమోనియల్ కాలం చదివే ప్పుడే బయటపడ్డది. దాంతోనే ఫలించ బోతున్నది. అప్పటినుంచి; అంటే యీ అయిదు సంవత్సరాలనుంచి నిద్ర లేస్తూనే అతడు చేసే మొదటిపని మ్యాట్రిమోనియల్ కాలం చదవటం.

*  *  *

ఆ రోజు వెంకటరంగం తెల్లవారి

తొమ్మిది గంటలనుంచి పదకొండు గంటలవరకు అద్దంముందు నిల్చొని మేకప్ చేసుకున్నాడు. అంతా అయిన తరవాత యింకొకసారి చూచుకొని తన వయస్సంతా ఏమయిపోయిందా అని ఆశ్చర్యపోయాడు. కారులో బయలు దేరాడు పెళ్ళిచూపులకు. ఆలోచనా తరంగాల్లో వూపిరి సలపకుండా కొట్టు కుంటున్న మనస్సు కారు ఆగటంతోటే బయటపడ్డది

అతనికొరకే యెదురుచూస్తూన్న ఓ యిరవయ్ సంవత్సరాల యువకుడు వెంకటరంగాన్ని లోపలకు ఆహ్వానిం చాడు. బహుశా వధువు తమ్ముడు అయి వుండవచ్చు అనుకున్నాడు వెంకట రంగం ఆ కుర్రాడు అందంగానే వున్నాడు కాబట్టి అతని అక్క యింకా బావుంటుంది అనుకున్నాడు

ఆ హాల్లో పెద్ద టేబులూ, ఐదారు కుర్చీలూ వేసివున్నాయి. వెంకటరంగం ఒక కుర్చీలో కూర్చున్నాడు. వాకిట్లో నుంచి ఎవరో ప్రవేశిస్తుంటే కళ్లు పెద్దవి చేసుకుని చూశాడు. ఒక ముసలాయన; బహుశా ఆమె తండ్రిగారై వుంటారు అనుకున్నాడు.

ఆ యిద్దరూ పరస్పర పరిచయం తర్వాత బాతాఖానీలోకి దిగారు. కాని వెంకటరంగం కళ్లుమాత్రం వాకిలికి కట్టివున్న కర్టెన్ కదిలినప్పుడల్లా ఎంతో ఆశగా చూస్తూ మరల నిరాశతో వాలు తున్నాయి. అది అర్థంచేసుకున్నట్లు ముసలాయన లోపలకు వెళ్ళాడు

ఐదు నిముషాల్లో మరల కర్టెన్ కది లింది. ముసలాయన రావటంచూసి వెంకటరంగం నొసలు ముడుచుకు న్నాడు. రెండో నిముషంలో మొదట వెంకటరంగాన్ని ఆహ్వానించిన యువ కుడు, ఇద్దరు యువతులు ప్రవేశించారు. వెంకటరంగం కళ్ళు ఆనందంతో మెరిసి పోతున్నాయి. ఆ అమ్మాయిలిద్దరూ వెంకటరంగం ఎదురుగా కూర్చున్నారు. యిద్దరూ అక్కచెల్లెళ్ళలాగున్నారు ఒక అమ్మాయికి 25 లేక 26 సంవత్సరా లుంటాయి. రెండవ ఆమెకు 35 లేక 36 వుండవచ్చును.

అందరకు ఫలహారాలు వచ్చాయి వెంకటరంగం ఆలోచిస్తున్నాడు. పిల్ల అందమయినదే. చాలా చిన్న పిల్లలాగ కూడ వున్నది. వెంటనే తన వయస్సు గుర్తుకు రాగానే గతుక్కుమన్నాడు. మరల సరిపెట్టుకుని లేని వుత్సాహం తెచ్చుకుని ఆ అమ్మాయిని పలకరిం చాడు.

'నీ పేరేమిటి?'

'సరళ'

ఆ అమ్మాయి నిస్సంకోచంగా నిర్భ యంగా జవాబిచ్చింది. ఆమెను చూస్తే ఉత్సాహంగానే వున్నది. తననుచూసి పెద్దవాడనికానీ లేక ఇష్టంలేనట్లు కానీ ఆమె యేమీ ప్రవర్తించలేదు. వెంకట



రంగం హృదయం ఆనందంతో వుర వళ్ళు పరవళ్ళు తొక్కుతోంది. తన హృదయంలోని ప్రేమంతా కళ్ళద్వారా, కడవలోని నీళ్ళను గుమ్మరించినట్లు గుమ్మరించ ప్రయత్నిస్తున్నాడు.

వచ్చే ఉద్రేకాన్నీ, సంతోషాన్నీ అణచుకుంటూ ఏదో మాట్లాడించాలనే కోర్కెతో, ఏమీ తోచక 'మీ అక్కయ్య పేరేమిటి?' అన్నాడు.

'సుందరి' అన్నది వచ్చే నవ్వును ఆపుకుని క్రీగంటితో అక్కను చూస్తూ. సుందరి ముఖం ముంచుకొచ్చే సిగ్గు తెరలతో కప్పుకున్నది. తల వంచుకొనే వెంకటరంగాన్ని చూస్తున్నది. వెంకట రంగం చూపుల్తో చూపులు కలవగానే తల యింకొంచెం వాలిపోయింది

వెంకటరంగం వళ్ళు అపహాస్యంతో కంపరమెత్తిపోయింది. తనను చూస్తే ఇంత వయస్సువచ్చిన ఈమె కెందుకో ఇంత సిగ్గు! పెండ్లికూతురుకులేని యీ పుట్టి ముంచుకొచ్చే సిగ్గు ఈమె కెందుకో? పెండ్లికూతురు చిన్నపిల్లయినా చాలా సింపుల్‌గానే వచ్చింది. పెండ్లికూతురు కంటె అక్క ముస్తాబే ఎక్కువగావుంది. ఇలా ఆలోచిస్తున్న వెంటకరంగం బావ గారు యేదో చాలా సీరియస్‌గా ఆలోచిస్తున్నారే' అన్న మాటల్తో వీపుమీద అకస్మాత్తుగా హంటర్‌దెబ్బ పడ్డవాని లాగ వులిక్కిపడ్డాడు.

"బావగారూ; మా అక్కయ్యకువచ్చే సిగ్గు అందులో పెళ్ళికూతురు చూడండి" అంటూ యేదో మాట్లాడుతోంది సరళ గలగలమంటూ.

వెంకటరంగానికి ఆమె మాటలేమీ

విన్పించటంలేదు. తల దిమ్మెరపోయింది. చెవులు దిబ్బెళ్ళుపడ్డాయి. ఒక్కనిముషం కూడా అక్కడ కూర్చోలేక నిలబడ్డాడు. అందరూ తెల్లబోయి చూస్తున్నారు.

"నాకు చాలా తలనొప్పిగావుంది. ఇంటికి వెళ్ళి ఉత్తరం రాస్తాను" అని యెలాగో అనగలిగాడు. ఇంకొకరు మాట్లాడటానికికూడా అవకాశం ఇవ్వకుండా గబగబా వెళ్ళి కారులో కూలబడ్డాడు.

కారు శరవేగంతో పోతున్నది. అతని ఆలోచనలు అంతకన్నా వేగంగా పరుగులుతీస్తున్నాయి.

'ఎంత మోసం! పాతికేళ్ళని రాసి నలభై యేళ్ళ ముసలమ్మాయినా తనకు చూపెట్టేది?' అవమానంతో వళ్ళంతా వణికిపోతోంది. అదిరిపోతున్న కణతలను గట్టిగాపట్టుకొని సీటులో జార్లపడి కూర్చున్నాడు. కారు యిల్లుచేరింది. బరువెక్కిన హృదయంతో గదిలోకి వెళ్ళి బెడ్‌మీద కూలపడ్డాడు ఎదురుగా అద్దంలో తన ప్రతిబింబం కన్పిస్తున్నది. ఒకగంటక్రితం తన రూపానికి యిప్పటికి ఎంత భేదంవుంది? అనుకున్నాడు. కలగాపులగంగా నెరసి అసహ్యంగా వున్న జుట్టూ, ముడతలుపడి కాంతివిహీనంగావున్న కళ్ళూ, లోతుకుపోయిన బుగ్గలు! అబ్బ ఎంత వయస్సుమళ్ళిన వాడులాగ కన్పిస్తున్నాడు. ఇంక చూసుకోలేకపోయాడు తన ప్రతిబింబాన్ని అద్దంలో.

నిజంగా ఆ అమ్మాయి తనకంటే చిన్నదే. తనకంటే అందంగానేవున్నది. వాళ్లచెల్లెల్ను చేసుకోవాలనుకోవటం! అంత చిన్న అమ్మాయిని చేసుకోవాలనుకోవటం అన్యాయం కాదూ? తన కొడుకే మగకాకుండా ఆడపిల్లయితే సరిగా ఆ సరళ అంతే వుండేవాడు.

తనలాంటి పెద్దవాళ్ళు చిన్నపిల్లల్ని చేసుకొని అనుభవించేదిమాత్రం ఏముంటుంది? ఇంకా నయం తనకు యిప్పటికయినా ఆ మాత్రం వివేకజ్ఞానం కలిగింది!

ఇలా ఆలోచిస్తున్న వెంకటరంగం కళ్లముందు సుందరి సిగ్గుతెరల భారంతో వంగిపోతున్న ముఖం, ఆ బరువైన రెప్పలచాటునుండి తొంగిచూస్తున్న కళ్లూ కన్పిస్తున్నాయి. వెంకటరంగం హృదయంలో ఎవరో చక్కిలిగింతలు పెడుతున్నారు. నరాల్లో రక్తం వేగంగా ప్రవహిస్తోంది. లేచివెళ్ళి లెటర్‌పాడ్ తీసి ఉత్తరం రాయడం ప్రారంభించాడు. తనకేమీ ఈ వివాహంలో అభ్యంతరం లేదనీ, వీలయినంత త్వరలో లగ్నం పెట్టమనీ రాసి పోష్టుచేశాడు.

తన ఉత్తరానికి జవాబుకోసం ఆతృతతో వేచివున్న వెంకటరంగానికి మరునాటికల్లా జవాబువచ్చింది తన అంగీకారంతప్ప, ఈవివాహానికి మరే ఆటంకం






లేదని భావిస్తున్న వెంకటరంగానికి ఆ ఉత్తరం చదివేసరికి నెత్తిన పిడుగు పడ్డట్టయింది

కన్యాదాత తన కుమార్తెను ఈడూ జోడూ అయిన వ్యక్తికే ఇవ్వదలిచాట్ట! వెంకటరంగం ఆస్తిపాస్తులూ, గౌరవ మర్యాదలూ ఆయనకు తృప్తి కలిగించినా - వయస్సు విషయం ఆలోచిస్తే మనస్సు చివుక్కుమన్నదిట!!

ఎంతో మర్యాదతో, సానుభూతితో కూడిన జవాబు! కాని వెంకటరంగం ఆశించిందీ, కాంక్షించిందీ అదికాదు!!

ఆ జవాబుతో వెంకటరంగం దిమ్మెరపోయాడు. దూరం ఆలోచిస్తే వధూవరుల వయస్సు ఈడూ జోడుగానే వుంది: ఒకళ్లనొకళ్ళు మోసంచేసుకోవాలనీ చూశారు. దానికీ దీనికీ చెల్లు అనుకొని తాను సరిపెట్టుకొని, ఆమెచేత మోసగించబడలేదనే విచ్చిభ్రమతో ఈ వివాహానికి అంగీకారాన్ని తెలిపాడు; కాని ఆమెమాత్రం తాను మోసగించబడినట్లే యీ సంబంధానికి నిరాకరణ చూపింది! మోసగించపోయి, మోసగించబడినట్లయింది!

అతని మనస్సు విరిగిపోయింది ఆ నాటినుంచీ హిందూపత్రికలోని మాట్రిమోనియల్ ప్రకటనలు చూడకూడదని నిశ్చయించుకున్నాడు ఉదయం లేవగానే అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసుకోవటంవల్లనే ఈ పొరపాటు జరిగింది! నిజానికి తన ప్రతిబింబం తనను నిరుత్సాహపరిచి ఉండవలసింది, కాని అందుకు మారుగా తనకు ఉత్సాహాన్నిచ్చి తన మనశ్శాంతిని భంగపరిచింది. కనక ఉదయం లేవగానే అద్దంముందుకు పొయ్యే సాహసాన్ని అతను కోలా య్యాడు.



# ఊర్మిళాదేవి నిద్ర

పెద్దింటి రామ్మూర్తి & లక్ష్మణ్

'ఇక భోజనానికి రావచ్చు' వంటింటి లోనుంచి ఊర్మిళ కేక వినిపించింది.

భార్య పిలుపుకోసమే కాచుకు కూర్చున్న రాజారావు చేతిలోవున్న దినపత్రికను బల్లపైకి విసిరేసి ఒక్కదూకులో వంటింటిలో కొచ్చాడు.

టైము తొమ్మిదిన్నర చూపెడుతోంది. పదికంతా ఆఫీసులో వుండాలి. వాల్చివున్న పీటపైన సర్దుకొని కూర్చుంటూ,

"వడ్డించేయ్ త్వరగా" అని అరిచాడు.

ఊర్మిళ మూకుడులో వేపుడు చేస్తున్న కూరను గరిటెతో తీసి కంచంలోకి వడించింది.

"అన్నం స్టవ్‌మీద కాస్త వుండనివ్వండి. ఉమగలాలి" వంగి వడ్డించినపుడు మీదకు జారిపడ్డ జడను వెనక్కు తోసుకుంటూ అంది.

ఉసూరుమన్నాడు రాజారావు.

ఎప్పుడూ ఇంతే! ఒక్కగంట ముందుగా లేచి పనులు మొదలెడితే యీ పరుగులుండవు కదా! ప్చ్. యీ జన్మకిది మారదు. ఈ పరుగులు తప్పవు.

చేసేదిలేక కూర ముక్కలు తింటూ కూర్చున్నాడు. ఇంతలో వేడివేడిగా ఆవిర్లు కక్కుతూ కంచంలో అన్నం వచ్చింది.

నెయ్యి కరగబెటలేదు. మరిపో

యింది ఊర్మిళ. ఇంతలో వుయ్యాల లోంచి అరున్నొకరాగం వినిపించింది.

"వీడు మంచి పని సమయంలో లేస్తాడు" విసుక్కున్నాడు రాజారావు

"మన వంశోద్ధారకుడు లేచాడు కానీ వెళ్ళి వాణ్ణెత్తుకో. లేకపోతే పెంకులెగిరి పోతాయి" అన్నాడు

"సరే! నెయ్యి వేసుకోండి" అంటూ అక్కడ గిన్నెవుంచి హాల్లోకి పరుగు తీసింది ఊర్మిళ.

వేడి వేడిగా వున్న కూరతో అన్నం వూదుకుంటూ తినటం పూర్తిచేసేంతలో కొడుకు నెత్తుకొచ్చింది ఊర్మిళ.

"తర్వాత ఏమిటి?" చుట్టూ చూస్తూ అడిగాడు.

"పులుసువుంది. అయ్యో పోపు పెట్ట టం మర్చిపోయాను. వీణ్ణి ఒక్కక్షణం పట్టుకోండి" అంటూ కొడుకుని భర్త ఒడిలో వుంచేసి పరుగెట్టింది.

"నీ పులుసు గురించి కాచుకుంటే నా ఆఫీసుకు టైమయిపోతుంది కాని మజ్జిగ పోసెయ్."

ఊర్మిళ వారిస్తున్నా వినకుండా మజ్జిగ పోసుకొని లేచి కొడుకును భార్య కందించి గబగబ చేయి కడుక్కో వటానికి పరిగెట్టాడు రాజారావు.

భార్య ఇచ్చిన తువ్వాలుకు చేతులు తుడుచుకుంటూ అక్కడే కొక్కేనికి తగిలించిన చొక్కా తీసితొడుక్కున్నాడు.

సైకిలు బయటకు తీసుకెళ్తూండగా,

"ఏమీ మర్చిపోలేదుగా" అంది వెన కాలనుంచి ఊర్మిళ

"ఏంలేదు" అంటూ టా టా చెప్పి రివ్వున సైకిలెక్కాడు రాజారావు

కొడుకు చేయి వూపి టాటా చెప్పించి లోపల కొచ్చింది ఊర్మిళ.

తుఫాను వచ్చి వెలిసినట్లనిపించింది.

"ఛీ. ఛీ. పాడునిద్ర. పాపం రోజూ ఆయనను అర్ధాకలితో పంపుతున్నాను. రేపటినుంచయినా ముందుగా లేవాలి" అనుకుంటూ పాత్రలు సర్దటానికి లోపలి కెళ్ళింది ఊర్మిళ.

అది ఆ ఇంట్లో రోజూ జరిగే తంతే!

ఊర్మిళ సార్థక నామధేయురాలు. పడుకుంటే చాలు నిద్ర పట్టిపోతుంది. ఆదీ మొద్దునిద్దర.

చిన్నప్పుడు తల్లి పోరి పోరి చివరకు "నీకు పెళ్లయితేగాని తెలిసిరాదంటూ వదిలేసింది. కాని పెళ్లయినా తెలిసి రాలేదు ఊర్మిళకు

నిద్రపోతే మరి ప్రపంచం తెలియదు. ప్రొద్దున్న అరున్నరకుగాని మెలకువ రాదు.

రాజారావు యీ అలవాటు మాన్పిద్దా మని ప్రయత్నించి ఓడిపోయాడు. కొత్తలో పెద్ద కష్టంగా అనిపించలేదు కాని బిడ్డపుట్టిన తర్వాత పరుగులు ఎక్కువయ్యాయి.

రాజారావుకు కాఫీ తాగుతూ పేపర్ తిరగేయటం చాలా ఇష్టం. అలాంటప్పుడు

ఎవరైనా పలకరిస్తే తగని చిరాకతనికి. కాని మగవాళ్లు పెళ్లయిన తర్వాత చాలా మారవలసి వస్తుంది. తండ్రి అయితే మరీను

ఊర్మిళ బాబిగాడిని ఏడుకల్లా పాలు పట్టి భర్త దగ్గర పడుకోబెట్టి వంటింటి లోకి ప్రవేశిస్తుంది.

వాడు తండ్రిని ప్రశాంతంగా చదువుకోనివ్వడు తననెప్పుడూ ఎవరో ఒకరు పలకరించాలంటాడు.

"వీడికి నీ పోలికైనా రాలేదేమిటే?" హాయిగా పడుకొని నిద్రపోక నన్ను సాధిస్తున్నాడు" అంటూంటాడు రాజారావు.

కాని ఊర్మిళ తక్కువ తిన్నదేమీ కాదు. "పాపం మీ పోలిక వచ్చింది. అందుకే అవస్థపడండి. నేను వంటింటిలో వున్నప్పుడు పిలవకండి" అంటుంది.

ఈ ఆదరా బాదరా పనులకు రాజారావు క్రమంగా అలవాటుపడిపోయాడు కాని అప్పుడప్పుడు భార్య నిద్ర చిరాకు తెప్పిస్తున్నా చేసేదిలేక వూసూరు మనుకుంటాడు

* * *

ఆ మర్నాడు రాజారావు క్యాంపు కెళ్ళాలి. అందులో పై ఆఫీసరు గారొకరు అక్కడికి తనిఖీ కొస్తున్నారు మొదటి బస్సు ఐదుకల్లా పట్టుకోవాలి.

ఇంటికిరాగానే మొట్టమొదట అతను చేసినపని గడియారానికి 'కీ' ఇవ్వటం. తరువాత భార్యకు మర్నాడు తను క్యాంపు కెళుతున్న విషయం చెప్పాడు

"రేపు నాలుగుగంటలకల్లా నన్ను లేపాలి ఒకవేళ గడియారం ఏ కారణం చేతనయినా కొట్టకపోతే లేపవలసిన బాధ్యత నీదే సుమా" అంటూ రెండు మూడుసార్లు హెచ్చరించాడు రాజారావుకు రాత్రిపూట, ప్రొద్దున్న కోటా కలిపి నెమ్మదిగా భార్యతో కబుర్లు చెపుతూ భోజనం చేయటం అలవాటు

'నేను వూర్లో లేనప్పుడు జాగ్రత్త; బాబు జాగ్రత్త. రాత్రిళ్ళు తలుపులన్నీ వేసుకొని పడుకో.'

ఊర్మిళ నవ్వటం చూసి చెప్పటం ఆపాడు రాజారావు.

"మళ్ళీ దేవిగారు నిద్రలోకి ప్రవేశిస్తే లేపటం నా తరంకాదు. అందుకనే అన్నీ ఇప్పుడే చెప్తున్నాను. నవ్వకు "

"నేను నవ్వటంలేదు. చెప్పండి" అంది మోకాళ్లపైన తలపెట్టుకొని భర్తను చూస్తూ, ఊర్మిళ, పంటికింద నవ్వు నదిమిపెట్టి.

అతనలా చిన్నపిల్లలకు చెప్పినట్లు చెపుతూంటే ఊర్మిళకు అలా వినటం తమాషాగా బాగుంటుంది.

భోజనం పూర్తిచేసి పడుకొనేసరికి పదయింది వెన్నెల పచ్చపువ్వులా కాస్తోంది రాజారావుకు వెంటనే నిద్ర రాలేదు. భార్యవైపు చూసాడు. అప్పుడే



నిద్రపోయింది. పడుకోగానే నిద్రపట్టే వాళ్ళు నిజంగా అదృష్టవంతులు.

బరువు బాధ్యతలను తాత్కాలికంగా మరచిపోతారు. అతనికి భార్యను చూస్తూంటే ఓ రోజు రాత్రి గుర్తొచ్చింది. అప్పుడూ ఇలానే వెన్నెల ఎంతో బావుంది. పెళ్లయిన కొత్త. ఊర్మిళ నిద్రపోతూంది.

"ఊర్మిళా" నెమ్మదిగా చెక్కిలి పైన తట్టాడు. కాని భార్యలో చలనం కనిపించలేదు ఆశ్చర్యపోయి భుజాలు కుదిపాడు ఊహూఁ జవాబులేదు. మూడోమారు కాస్త గట్టిగా కదిపి చూశాడు ఊర్మిళ అరమోడ్పుగా కన్నులు తెరిచి "ఏమిటండీ" అంది.

మెల్లిగా చెవిదగ్గర "వెన్నెల చూసావా" అన్నాడు రాజారావు.

"అబ్బ తెల్లవారి చూద్దామండీ. నాకు నిద్ర వస్తోంది" అంటూ మళ్ళీ నిద్ర లోకి జారిపోయింది ఊర్మిళ.

నెత్తిమీద కుండెడు చల్లనీళ్లు కుమ్మరించినట్లుగా చప్పచల్లారిపోయాడు రాజారావు అలిగి దూరంగా జరిగి పడుకున్నాడు. భార్య లేపుతుందేమోనని కాసేపు చూసాడు. అది అడియాసే అయింది. తర్వాత అతనే పొర్లి పొర్లి నిద్రపోయాడు అది గుర్తుకువచ్చి చిన్నగా నవ్వుకున్నాడు తనలో.

"ఇక పడుకోవాలి. దీన్ని లేపమంటే

అంతే! అనుకుంటూ దుప్పటి లాక్కున్నాడు.

*  *  *

పెద్ద చప్పుడుచేస్తూ పాల వ్యాను కామోసు వెళ్తూంటే రాజారావుకు మెలకువ వచ్చింది

గబుక్కునలేచి కూర్చుని లైటువేసి గడియారంవైపు చూసాడు. ఆగిపోయి వుందది.

రిస్టువాచీవైపు చూసాడు. ఐదున్నర కావస్తూంది.

రాజారావుకు ఏంచేయాలో ఒక్కక్షణం తెలియలేదు

ఉవ్వెత్తున అతనికి అందరిమీదా కోపం-ఏదో కసిలాంటిది కలిగింది. ఎంతపని జరిగిపోయింది? భార్యవైపు చూసాడు. హాయిగా నిద్రపోతూంది.

అతని కోపం కాస్తా భార్యమీదకు మళ్ళింది "ఛీ. ఛీ ఊర్మిళకు మరీ బుద్ధి లేకుండా పోతూంది మొద్దులాగ ఏమిటింతసేపు పడుకొని నిద్రపోవటం? మొగుడు వూరికెళ్తూంటే లేపవలసిన బాధ్యత తనమీద లేదూ? ఇప్పుడు తన టూర్ ప్లానంతా పాడయిపోయింది. అందరాడవాళ్ళూ ఇలానే వున్నారా? తన ఖర్మకొద్దీ దొరికింది ఇది. పై ఆఫీసర్ అడిగితే ఏం చెప్పాలో అర్థంకాలేదతనికి.

ఆరుగంటలవుతూండగా ఊర్మిళకు మెలకువ వచ్చింది. మంచంమీదనే కూర్చుని ఆలోచిస్తున్న రాజారావు కనబడంగానే,

"అరె, ఇవ్వాళీయన క్యాంపుకెళ్తానన్నారు కదూ. మరి ఇక్కడే వున్నారేమిటి?" అనుకుంటూ గడియారంవైపు చూసింది

మూడులో ఆగిపోయివుందది.

"అరెరె క్షమించండి. నేనైనాలేపలేకపోయాను" అంది ఊర్మిళ భర్తతో నొచ్చుకుంటూ

రాజారావు ఏమీ మాట్లాడలేదు. అతనికి కోపం వచ్చినట్లు గ్రహించింది.

మంచం దిగి వంటింట్లో కెళ్ళింది కాఫీ తీసుకొచ్చేసరికి రాజారావు కని పించలేదు.

"కాఫీ అయినా తాగకుండా తెల్లవారే ఎక్కడికి కెళ్ళారబ్బా" అనుకుంది ఆశ్చర్యంగా.

ఇంతలో బాబిగాడు ఉయ్యాల్లో కదలటంతో వాడిని తీసుకొని భుజంమీద వేసుకుంది.

రాజారావు ఏడున్నర అవుతుండగా వచ్చాడు తిన్నగా స్నానాల గదిలోకి వెళ్ళిపోయాడు.

ఊర్మిళకు అతని ప్రవర్తన కొత్తగ అనిపించింది. కాపురానికి వచ్చిన తరువాత అతనిలా ప్రవర్తించటం ఇదే మొదటిసారి.

మనస్సు చివుక్కు మనిపించింది.

కొడుకుని ఎత్తుకొనే వంటింట్లో పని



చేసుకుంటూంటే బయట సైకిల్ చప్పుడు వినిపించింది.

భర్త సైకిలు తీస్తూ కనిపించాడు.

"ఎక్కడికి వెళ్తున్నారో చెప్ప కూడదా?" అంది చర్రున వెనక్కు తిరిగి చూసాడు రాజారావు.

"అన్నీ నీకు చెప్పాలా? చెప్పినవన్నీ సవ్యంగా జరుగుతున్నాయా?" కరుగ్గా అని సైకిలెక్కి వెళ్ళిపోయాడు

ఊర్మిళ ఒక్కక్షణం బ్రాన్పడి పోయింది కళ్లల్లో నీళ్ళు చిప్పిల్లాయి.

"ఇదంతా ఆ గడియారం అలారమ్ కొట్టకపోవటంవల్ల జరిగింది. తను లేపి వుండవలసింది. కాని తనది మొద్దునిద్ర. అది ఆయనకు తెలుసు. తెలిసీ అంత కఠినంగా మాట్లాడితే తనెంత బాధ పడుతుందో ఎందుకు గ్రహించరు?"

ఇంతలో బాబిగాడు ఏడుపుతో గబుక్కున కళ్ళు తుడుచుకొని పాలు పట్టటానికి లోపలి కెళ్ళింది.

* * *

సైకిలు తొక్కుతూ ఆలోచిస్తున్నాడు రాజారావు. ఆఫీసర్ రేపు కారణం అడిగితే ఏమని చెప్పాలా అని. చక్కగా తన స్నేహితుల భార్యలు ఒకొక్కరు ఒకో విద్యలో ఆరితేరినవారు.

ఆ శేఖర్ గాడి భార్యకయితే ఎప్పుడూ ఏవో కుట్లూ అల్లికలు. ఇక గోపాల్రావు పెళ్ళాం అయితే క్లబ్బులు, మీటింగు లంటూ హడావిడిగా తిరుగుతూ వుంటుంది. తన పెళ్లామో? ఇరవైనాలుగు గంటలు చక్కగా నిద్రపొమ్మంటే పోతుంది.

దీనివల్ల ఏమి ఉపయోగమో దానికే తెలియాలి.

పెళ్ళయిన కొత్తలో స్నేహితుల కుటుంబాలతోపాటు అందరూ సెకెండ్ షో కెళ్ళారు.

ఆటమధ్యలో తన భుజంమీద తల వాల్చుకుంది ఊర్మిళ. దాన్ని మరోలా అర్థంచేసుకొని పొంగిపోయాడు. కాని ఆ ఆనందం ఎంతోసేపు నిలవలేదు.

సినిమా పూర్తవగానే లైట్లు వేశారు. అప్పుడు చూశాడు. ఊర్మిళ హాయిగా నిద్ర పోతూంది. భార్యను గబగబ తట్టి నిద్రలేపి ఒంట్లో తనకు బాగుండలేదని చిన్న అబద్ధం ఆడేసాడు. తరువాత భార్యతో సెకెండ్ షోలకు వెళ్ళటం మరి పెట్టుకోలేదు.

ఆలోచనలతో ఆఫీసుకు వచ్చాడు రాజారావు. ప్రొద్దున్న కాఫీకూడా తాగ లేదేమో కడుపులో ఆకలి కరకర మనసాగింది. హోటల్లో తిందా మనుకొని డబ్బుకోసం జేబులో చేయి పెట్టాడు. ఖాళీగా తగిలింది ఇంటినుంచి వస్తూ ఆ కోపంలో పర్సు తీసుకురావటం మరిచిపోయాడు.

ఎవర్ని అడుగుదామా అని చూస్తూం డేంతలో శేఖర్ ఆదరా బాదరా వగర్చు కుంటూ వచ్చాడు.

రాజారావును చూడగానే ఏదో పెద్ద బరువు దింపుకున్నవాడిలా కుర్చీలో కూలబడ్డాడు, "హమ్మయ్య" అను కుంటూ.

రాజారావుకు సంగతీ సందర్భం అర్థంకాలేదు.

"ముందు నాకు పార్టీ ఇప్పించు" అంటూ జబ్బపట్టుకు లాక్కుపోతున్న శేఖర్‌ను ఆపుతూ

"ఏమయిందిరా?" అనడిగాడు విసుగ్గా రాజారావు.

"ఏమిటా! నీ అంత లక్కీఫెలో మరెవడూ లేడనుకో. పొద్దునే నువ్వు తుని క్యాంపు కెళ్ళాలనుకున్నావా? ఆ బస్సుకు పిఠాపురందగ్గర పెద్ద పమాదం జరిగింది. నలుగురు అక్కడికక్కడే చనిపోయారు. చాలామందికి గాయాలు తగిలాయి" శేఖర్ చెప్పుకుంటూ పోయాడు.

రాజారావు శేఖర్ చెప్పినదంతా నిర్ఘాంతపోయి విన్నాడు ఇవ్వాళ తనెంత గండంనుంచి బయటపడ్డాడు. ఊర్మిళమీద తెల్లవారు ఝాముననే లేప లేదని ఎగిరిపడ్డాడు పాపం తనెంత బాధపడిందో.

దీని నిద్ర ఎందుకూ పనికిరాదను కున్నాడు. కాని ఆ నిద్రే ఇవ్వాళ తన ప్రాణాలు కాపాడింది

రాజారావుకు అక్కడ వుండాలని పించలేదు. సైకిలేసుకొని గబగబ ఇంటి కొచ్చాడు.

గదిలో ఊర్మిళ నిద్రపోతూ కనిపిం చింది.

బుగ్గలమీద ఏడ్చినట్లు గుర్తుగా వున్న కన్నీటి చారికలను చూడగానే అతని మనసు విలవిలలాడింది.

"నా ప్రవర్తనకు క్షమించు ఊర్మిళా! హేట్సాఫ్ టు యువర్ స్లీప్" అను కున్నాడు సైకిలుకు స్టాండ్ వేస్తూ.




అర్ధరాత్రి సరిగ్గా పన్నెండు గంటల వేళ.

వీధి తలుపు చప్పుడయింది. ఇంట్లో ఉన్నవారు ఒక్కొక్కరే "ఎవరు వారూ?" అని కేక వేశారు. ఆ ప్రశ్నకు సమాధానం రాలేదు. తలుపు చప్పుడు మాత్రం అవుతూనే ఉన్నది. లేచి వెళ్ళి తలుపు తియ్యడానికి ఎవరికి వారికే బద్ధకంగా ఉంది. ఎవరూ లేవలేదు. చప్పుడు — మెల్లగా — అవుతూనే వున్నది.

"ఎవరంటే మాట్లాడ రేమిటమ్మా? అమ్మాయీ కనకం, వెళ్ళి తలుపు తియ్యి. మీ బాబాయి అఘుఁవుంటాడు ఆయనకు యిదే దురలవాటు. ఎంత పిలిచినా పలకడు" అని వసారాలో మూలగా పడుకున్న ముసలమ్మ సణిగింది.

"వస్తున్నా ఉండండి, ఎవరో" అని కనకం—కళ్ళు నులుముకుంటూ నడవ గదిలోనుంచి వసారాలోకి వస్తూ అంది. ఆ జవాబుతో తలుపు చప్పుడు ఆగింది.

అగ్గిపెట్టెకోసం, రాత్రి యెప్పుడో ఆర్పి, ఎక్కడో పెట్టిన లాంతరుకోసం వెతుక్కుని, లాంతరు వెలిగించుకొని, కనకం తలుపు తియ్యడానికి వచ్చేటప్పటికి, అర్ధరాత్రివేళ నిద్రాభంగం పొందిన ఆ యింటిలోని ఇద్దరు ముగ్గురికి మళ్ళీ నిద్ర గాఢంగా పట్టింది.

పాపం! ఆ వచ్చినవా రెవరికో తలుపు తీసే అవస్థ కనకానికి మాత్రం తప్పలేదు. భర్త విడిచిపెట్టిన పడతి ఎవర్తెతైనా, పుట్టింటో మాత్రం లోకువ బ్రతుకు కాదూ!

కనకం మనసులో ఏమైనా అనుకున్నదో, లేక యిలాటి ఫర్మాయింపులకు ఆమె అలవాటుపడిందో కాని వెళ్ళి తలుపు తీసింది.

తలుపు తియ్యడమంటే ఏమిటి? బార్లా కాదు ఒక్క రెక్క సగం తీసిందో లేదో "నువ్వా!" అంటూ నిర్ఘాంతపడి, అలా నిలుచుండిపోయింది.

వీధిలోవున్న వ్యక్తిమీద, కనకం చేతిలో వున్న లాంతరు వెలుతురు ఒక్కమాటు మాత్రమే పడింది. ఆ వెలుతురులో, తలమీద నీలిరంగు కోకకొంగు ముసుగు వేసుకున్న ఒక చక్కని పాతికేళ్ళ స్త్రీ కనకానికి స్పష్టంగా కనిపించింది.

ఆ స్త్రీని చూడగానే కనకం ఎందుకో విపరీతంగా భయపడింది. త్రాచుపామును చూసిన వ్యక్తి, వెనక్కు వెనక్కు ఎలా జరిగిపోతాడో, అలాగ తలుపువెనకకు జరిగిపోయింది.

"చూడు, కనకం-నేను నిన్ను ఏమీ చెయ్యడానికి రాలేదు" అని, దీనమైన సన్నని కంఠంతో, ఆ వచ్చిన స్త్రీ అన్న దాకా, కనకం అలా ప్రమాన్పడి, తలుపును కవచంగా పెట్టుకొని నిలుచునే వున్నది. ఆ స్త్రీ మాట్లాడిన తరవాత కనకానికి కొంచెం ధైర్యం వచ్చింది.

"నువ్వెందు కొచ్చావు యిక్కడికి?" అని ప్రశ్నించింది.

"నీతో మాట్లాడడానికి" అని ఆ స్త్రీ జవాబు.

"నాతో మాట్లాడవలసింది నీకూ, నీతోటి మాట్లాడవలసింది నాకూ ఏమీ లేదు. అర్ధరాత్రి ఇలా వచ్చి తలుపు కొట్టడంలో నీ వుద్దేశం ఏమిటి?" అని కొంచెం రోషంతో రెట్టించింది కనకం.

"కనకం—ఎందుకలా కోపగిస్తావ్? నీతోటి మాట్లాడాలని వచ్చాను. రెండే మాటలు—చూడు ఎవరైనా వింటా రేమో, ఇలా వీధి అరుగుమీదకు రా. లేదా, నీ పడకగదిలోకి నేను వస్తాను పద. బయట చాలా చలిగా వుంది" అని మరింత దీనంగా ప్రార్థించింది ఆ వ్యక్తి.

కనకానికి ఏమీ తోచలేదు. ఆ వచ్చిన మనిషి కోరిక తీర్చకుండా తలుపు వడేల్మని బిగించి లోపలికి వెళ్ళడానికి కనకానికి మనసు వొప్పలేదు.

"సరే. లోపలికి రా" అని తాను ప్రక్కకు వొదిగి, ఆ మనిషి లోపలకు రాగానే తలుపు మూసి, లాంతరు కొంచెం తగ్గించి, ఆ వ్యక్తిని తన గదిలోకి తీసుకొని వెళ్ళింది. వీళ్ళిద్దరూ లోపలికి వెడుతూఉండగా "ఎవరే, ఆవచ్చిందీ?" అని ముసలమ్మ అడిగింది గాని, "ఎవరూ లేదు. గడియ సరిగ్గా వెయ్యక గాలికి తలుపు కొట్టుకుందిలే" అని కనకం చెప్పిన జవాబుతో ఏదో సణుక్కుంటూ ముసలమ్మ మళ్ళీ గుర్రులో పడింది.

కనకం, ఆ వచ్చిన మనిషిని తన గదిలోకి తీసుకువెళ్ళి లాంతరు పెద్దది చేసి, ఆపాదమస్తకమూ, ఆ వ్యక్తిని పరీక్షించింది.

"చాలా చిక్కిపోయావ్?" అని ప్రశ్నించింది.

"అవును, చాలా పెద్ద జబ్బు చేసింది" అని, ఆ స్త్రీ అతిజాలిగా, కనకంవైపు చూసింది. ఆమెపట్ల యెంతో కర్కశత్వాన్ని చూపుదామనుకున్నా, కనకానికి చేతకావకంలేదు. నిజానికి




చూపాలంటే, ఆ వ్యక్తి కంటే వేరే శత్రువు లెవరూ కనకానికి లేరు. తన భర్తను తనకు కాకుండా చేసింది ఆ మనిషే।

"చూడు కనకం—నువ్వు అర్జంటుగా ఆయన దగ్గరకు వెళ్లాలి. ఇప్పుడు నువ్వు ఆయనకు చాలా అవసరం" అంది ఆ వ్యక్తి.

"ఏం, ఆయనకు జబ్బుగా ఉందా?" అని అమితమైన ఆదుర్దాతో అడిగింది కనకం.

"జబ్బా లేదు, ఏమీలేదు. ఒకప్పుడు నువ్వు నన్ను నీ భర్తను నీకు యిమ్మని అడిగావ్. అప్పుడు అది నా చేతిలోపని కాదన్నాను కేవలం అశక్తతవల్ల సుమా। ఆయన నన్ను యెంతో ఎక్కువగా ప్రేమించారు. నేనూ ఆయన్ని అలాగే ప్రేమించాను. నువ్వు ఆయన్ని ప్రేమించడం లేదని నేననను సుమా. మనిద్దరం ఆయన్ని ప్రేమించాము. ఆయన మాత్రం మనిద్దరిలో ఒకర్ని ఎక్కువగా ప్రేమించారు. నిన్ను సరిగా ప్రేమించ లేదు. అందుకు నేను సంతోషించడం లేదు సుమా. నువ్వు ఆయన సుఖాన్ని ఎలా కోరావో, నేనూ ఆయన సుఖాన్ని అలాగే కోరాను. ఆయన లోపం నువ్వు క్షమించు. వెంటనే ఆయన దగ్గరకు వెళ్ళు" అని కనకం గడ్డం పట్టుకుని బుజ్జగించింది ఆమె

కనకానికి ఇదంతా అయోమయంగా వుంది. ఇప్పుడిది ఇంకొకడితో ఎవడితో నైనా లేచిపోతోందా। అలా ఐతే, తన భర్త ఏమయితే దాని కెందుకు - ఇలా వచ్చి తనను ప్రాధేయపడడం జరుగుతుందా। కాదు. ఏమిటబ్బా।

"చూడు, నాకేమీ అర్థంకావడంలేదు" అంది కనకం.

"ఏముంది దీంట్లో? నువ్వు అసలు అర్థంచేసుకోడానికి ప్రయత్నించకు. నా సంగతీ అదీ మరిచిపో; తెల్లవారగానే

బయలుదేరి ఆయనదగ్గరకు వెళ్ళు. ఆయన సుఖం నీ సుఖంగా చూచుకుంటావుకదూ! ఇంక నన్ను వెళ్ళనీ. దా, తలుపు వేసుకుందువుగాని—" అని లేచింది ఆ స్త్రీ.

తనను మించిన ఏదో ఒక శక్తికి లోబడిపోయినట్లుగా కనకం కూడా లేచింది. ఇద్దరూ తలుపు తీసుకొని వీధిలోకి వచ్చారు.

"కనకం—నా మీద యిక యెప్పుడూ కోపంగా ఉండకేం, ఏం? ఏది, ఒక్కసారి నన్ను కౌగలించుకోనియ్యి" అని ఆ స్త్రీ కనకాన్ని అత్యంత తమకంతో కౌగిలించుకుంది

"ఇంత అర్ధరాత్రి ఎక్కడికి వెడతావు? రేపు వెడుదువుగానిలే, రా. లోపల పడుకుందాం" అని కనకం అంటున్నా వినిపించుకోకుండా కనకం సిగ్గుపడుతున్నా లక్ష్యపెట్టకుండా ఆమె రెండు చెక్కిళ్ళనూ గట్టిగా ముద్దుపెట్టుకొని ఆ స్త్రీ గబగబా మెట్లుదిగి వీధిలోని చీకట్లోకి నడిచిపోయింది

దిగ్భ్రమతో కొంతసేపు అక్కడే నిలుచునీ, చాలా సేపు మంచంమీద కూర్చుని ఆలోచించీ, నిద్రపట్టక అటూ యిటూ మసులుతూ, కనకం ఆ రాత్రి శేషాన్ని ఎలాగో గడిపింది.

తెల్లవారిందో లేదో, నాయనమ్మ మాట లక్ష్యపెట్టక, అమ్మతో పోట్లాడి, తన సామాను సర్దుకుని బండియెక్కి, తన భర్త కాపురమున్న పేటకు అరగంటలో వెళ్ళి, భర్తవున్న తలుపు కొట్టింది. లోపల్నుంచి "తలుపు తీసేవుంది" అని వినపడగానే, గబగబా లోపలికి వెళ్ళింది.

వసారాలో చాపమీద శవం—ఆ శవం ప్రక్కనే, తలవంచుకొని దుఃఖిస్తూ తన భర్త—మండువా దగ్గర దిగాలుపడి కూచుని బంట్రోతూ కనపడ్డారు.

భర్త తలయెత్తి తనవంక చూసి, "నువ్వా!" అని వ్రేలితో శవాన్ని చూపించాడు.

ఆ శవం ఎవరో అని కనకం దగ్గరకు వెళ్ళింది.

నిన్నరాత్రి తన దగ్గరకు వచ్చినప్పుడు ఎలా వుందో అలాగే వుంది విషం తాగింది కాబోసు!

"అయ్యో! ఇంతపని చేస్తుందనుకోలేదు. నిన్నరాత్రి పన్నెండింటికి వచ్చి, నన్ను వెంటనే మీ దగ్గరికి రమ్మని ప్రతిమాలింది!" అని కనకం అంటూండగానే, ఆమె భర్త లేచి "పన్నెండుగంటలకా! సరిగ్గా ఆ సమయానికే దాని ప్రాణాలు పోయాయి. సరిగ్గా పన్నెండింటికే!" అన్నాడు.

"నిజమే!" అంటూ విస్తుపోయింది కనకం. కాని రెండు నిమిషాలలో ఆమెకు ఏమర్థమయిందో; "ఎంత ప్రేమగలదానివే, లక్ష్మీ!" అంటూ ఆ శవాన్ని కౌగలించుకొని విలపించింది.




నిరంజనరావు కారులోంచి దిగి సూటిగా తనగదిలోకి వెళ్ళి పడకకుర్చీలో చేరగిలపడ్డాడు. చేతులురెండూ వెనక్కుచాచి కళ్ళుమూసుకున్నాడు. ఆయన వచ్చిన అలికిడి విని గబగబ సుగుణ గదిలోకి వెళ్ళింది భర్త మొహంలోకి చూస్తూ అట్లాగే నిలబడిపోయింది. సుగుణ వచ్చినట్టు గమనించినాకూడా ఆయన కళ్ళు తెరవలేదు. కొంచెంసేపు విలవిలలాడిపోతూ అట్లాగే పట్టుబిగువున నిలబడి యిహ వుండబట్టలేక 'ఏమండీ' అంటూ దగ్గరగావెళ్ళి కుర్చీలో కూర్చుంది జాలిగా.

'ఊఁ...' అన్నాడు కళ్ళుతెరవకుండానే నిరంజనరావు. దుఃఖం ఆపుకోలేకపోయింది. వెక్కి వెక్కి ఏడ్చింది. మళ్ళీ తమాయించుకుని పెద్దగా నిట్టూర్చింది

కళ్ళు తెరుచుకుని భార్యవంక ఆలోచనగా చూస్తూ ముందుకు ఒరిగి కూర్చున్నాడు.

'చూడు సుగుణా' అంటూ ఆమె తల మీద నిమురుతూ పెదిమలు బిగపెట్టి కళ్ళజోడు అద్దాలు తుడుస్తూ పెద్దగా నిట్టూర్చాడు. ఎడంచెయ్యి గుప్పెడు గట్టిగా నొక్కిపెట్టేసి గుటకలువేస్తూ తెగ ఆయాసపడుతున్నాడు. భర్త ఆవేదన, ఆరాటంచూసి కళ్ళుతుడుచుకుంటూ నేను ఆపుకోలేకపోయానండి అన్నది తానేదో తప్పుచేసినట్టుగా.

"...సుగుణా...నువ్వు తల్లివి నేను తండ్రిని. మనిద్దరికీకూడా ప్రేమలు

బాధ్యతలు ఒకటే. తల్లివని నీకెక్కువ ప్రేమవుందని అనుకుంటే తండ్రిగా నా కెక్కువ బాధ్యతవుందని నేననుకో వచ్చు. ఏమైనా మనిద్దరం గూడా ఒకే స్థితిలో వున్నాం ఏమీ చెయ్యలేని అశక్తత గుర్తించికూడా పదే పదే బాధ పడితే యేం ప్రయోజనం...ఇంకా యేదో చెప్పబోతుంటే "అంతేనంటారా" అన్నది ఆవేశంగా, భర్త మొహంలోకి పిచ్చిదానిలాగ చూస్తూ.

"నీకింకా అర్థంకాలేదు. మన చేతిలో యేదో వుందని భ్రమపడుతున్నావు ఈ సమయంలో మనం సరిగ్గా అర్థంచేసు కోవాల్సింది యెంతోవుంది ... నీకింకా నమ్మకం కుదరటంలేదు. పెంచిన, పెంచుకున్న మమకారము, నిన్నట్లా బాధపెడుతోంది అంతే..."

"మీకూ అంతకంటె యెక్కువే మమకారాలు, ప్రేమలు వున్నాయి, నేను కాదనటంలేదు ... మీ మాటకు అడ్డు చెప్పానని అనుకోవద్దు. వాడిమీద ఎన్ని ఆశలుపెట్టుకున్నాం ఎన్నెన్ని ఆలోచ నలుచేశాం ఏమేమో అనుకున్నామే అవన్నీకూడా వృధా అయిపోయినాయా ..."

''నిజమే మనముఆలోచించింది వేరు, జరగబోయేది వేరు. దీనికి మనమేం చేస్తాం చెప్పు...''

'మీకు తెలీదా. నాచేత చెప్పించాలా ...'' ఉక్రోషం ఆపుకోలేకపోయింది.

"...అక్కడే నువ్వు చాలా పొర పాటు పడుతున్నావు...నా చేత్తో నేను యెంతమందికి యెన్నిరకాల శిక్షలు విధించానో యెన్ని ఉరిశిక్షలు వేశానో నీకన్నీ తెలుసు. నాకు రహస్యాలంటూ లేవు. ఏమైనావున్నా, నీలోనే దాచు కున్నా, నీకు తెలియని విషయము యేమీకాదు నేను న్యాయం చేశానని కాని, దుష్టులను శిక్షించాననిగాని యెన్నడూ అనుకోలేదు నేను కేవలం నా విద్యుక్త ధర్మం నెరవేర్చాను. అంతే. ఇవ్వాళ నేను యింకోళ్ళదగ్గరకు కర్తవ్యానికి వ్యతిరేకంగా చెయ్యమని ఏ మొహంపెట్టుకుని వెళ్ళగలను ... వెళతాను వాడికోసం ఏదైనా చేస్తాను. వాడు లేకపోయిన తర్వాత, నేనుంటే యేం, లేకపోతే యేం. ఇదికూడా ఆలో చించాను. కాని తీరా మనం వెళ్ళి దేహీ అన్న తర్వాత, కాదంటే, నాతల తీసేసి నట్టేగా. అందులో ఆయన నాకంటే కూడా రూల్సు, లా పాటించేవాడు. అదే నా భయం...''

"అంతే నటారా..."

"అవును సుగుణా అంతే అంత కంటె యేముంది చెప్పు ... పని కాదని తెలిసినప్పుడు, మాట నిలుపుకోవటంలో వుండే గౌరవం మాటపోగొట్టుకోవటంలో వుండదు...''

"అయితే మనబ్బాయి మనకు దక్క దన్నమాటేనా..."

"అట్లా అనవద్దు. మనం యెవ్వరికీ అన్యాయం చెయ్యలేదు. అందుకనే మనకు అన్యాయం జరగదని నా గట్టి విశ్వాసం, నమ్మకం.

నువ్వు దిగులు పెట్టుకోవద్దు నా కూడా ధైర్యాన్నివ్వాలి నన్ను ఓదార్చే పరిస్థితి మాత్రం నువ్వు తెచ్చుకోవద్దు. నేను యెంత నిబ్బరంగా వుంటున్నానో, నువ్వొక్కసారి వూహించుకో. నువ్వుకూడా అట్లాగే వుండాలని నా ఉద్దేశం... ఇంక నన్ను యిట్లా పడుకోనీ..." మళ్ళీ కుర్చీలో చేరగిలబడి కళ్ళు మూసుకున్నాడు. కాని నిద్రపోవటంలేదు, నిద్ర రావటంలేదు. నిద్ర రాదు కూడా.

ఆమె గదిలోకివెళ్ళి పరుపుమీద పడుకుంది. కళ్ళురెండూ తెరుచుకునేవుంది. కాస్త కళ్ళు మూతపడంగానే, కొడుకు కనిపిస్తున్నాడు. ఏవేవో అడుగుతున్నాడు. ఏమేమో మాట్లాడుతోంది. ఆమె భరించలేదు అందుకనే కళ్ళు తెరుచుకునే పడుకుని వుంది

ఆయన కళ్ళు మూసుకున్నాడు. ఎన్నెన్నో ఆలోచనలు. ఆయన మెదడులో మెసులుతున్నాయి. ఎన్నెన్నో దృశ్యాలు యిట్టే కనిపించి మాయమయిపోతున్నాయి శిక్షలు పడినవాళ్ళందరూ కట్టకట్టుకుని వచ్చి బెదిరిస్తున్నారు తనలో తాను నవ్వుకున్నాడు ప్రతివాడూ నిర్దోషే. నేరం రుజువయ్యేదాకా పెద్ద మనిషి. ప్రతి నేరానికి వెనకాల యేదో అగాధమైన గాథ వుంటూనే వుంటుంది. నేరమూ, శిక్ష, యీ రెంటికీ అవినాభావ సంబంధం వుంది. నేరము చేసినవాడూ చెయ్యనివాడూ శిక్ష అనుభవిస్తాడు. శిక్ష అనేది, నేరము చేసినవాడికి పడకపోవచ్చు. వందమంది నేరస్థులనైనా వదిలిపెట్టెయ్యచ్చుగాని, ఒక నిర్దోషిని మాత్రం శిక్షించకూడదు అని సూత్రం బాగానే వుంది. కాని ఒక నేరస్థునికి శిక్ష పడకపోవటంకూడా చాలా ఘోరమైన విషయమే. ఇది సామాజిక సమస్య. సాంఘిక అవసరము. ఇది కేవలం వ్యక్తిగతమైన విషయం కాదు. నేరస్థుని వదిలేసిననాడు ప్రతీకారవాంఛ కేవలం దెబ్బతిన్న వ్యక్తిలోనే రగుల్కోదు. మొత్తం సంఘం అంతా లేస్తుంది. ఇది వాంఛనీయంకాదు. నేరస్థునికి విధిగా శిక్ష పడాల్సిందే. దీనికి తిరుగులేదు. ఆయన ఆలోచనలు ఆయనకే ఆశ్చర్యంగా వున్నాయి.

గభాలున కుర్చీలోంచి లేచి, గదంతా పచార్లుచెయ్యటం మొదలుపెట్టాడు. ఇంత శిక్ష నాకెందుకు వేస్తున్నాడు. నేను ఏ నేరం చేశానని. నా జడ్జిమెంట్సువలన, యెవరైనా నిరపరాధి శిక్షకు గురి అయ్యాడా, తనలో తాను చర్చించుకుంటున్నాడు. లంచం తీసుకున్నందుకు, అక్రమమైన చర్యలకు పాల్పడ్డందుకు, కల్తీ కలిపినందుకు, హత్యచేసినందుకు,

పిటికేగా నే శిక్షలు వేసింది. దస్తాలు దస్త్రాలు కాగితాలు వున్నాయి. సాక్షులు, నమ్మతగ్గ కాగితాలు. ఇవన్నీ చూసిన తర్వాతేగదా ఆ శిక్షలువేసింది. తప్పేమీ లేదు. నేను చేసింది తప్పేమీకాదు. తనలో తాను సమాధానపడుతున్నాడు. కాని నేనట్లా యెందుకనుకోవాలి నేను చేసిన తప్పుకు నాకు శిక్షపడటంలేదు. ఎంత తీవ్రంగా ఆలోచించుకున్నా, యెన్నివిధాల వూహించుకున్నా మన స్సుకు శాంతి దొరకటంలేదు. ఊరికే అలసటగా గదంతా చకచక తిరుగుతు న్నాడు. ఒక్కొక్కప్పుడు శరీరంలోకి వణుకు వచ్చేస్తోంది. గుండెమీద చెయ్యి పెట్టుకుని, పెద్దగా శ్వాస పీలుస్తున్నాడు.

'ఎట్లా వుందండి...వెనకాలే శబ్దం వినిపించింది.

'నువ్వు నిద్రపోయావనుకుంటు న్నాను...'

'అవును నాకు నిద్రపట్టాల్సిందే. మీ మాదిరి నేను యేమీ ఆలోచించుకోలేక పోతున్నాను...'

వెనక్కి తిరిగి ఆమెవంక చూసి, యిప్పుడు నిద్రపట్టేటట్టే వుంది అంటూ మంచంమీదికి వెళ్ళి పడుకున్నాడు.

భళ్ళున తెల్లారేటప్పటికి, యింకా ఆయన మంచంమీదే వున్నాడు ఆమె గుర్రుపెట్టి నిద్రపోతోంది

వంటమనిషి, కాఫీతెచ్చానంటూ, లేపేటప్పటికి, ఆయన బద్ధకంగా కళ్ళు నలుపుకుంటూ, ఓ చేత్తో కాఫీకప్పును అందుకున్నాడు. ఆమె, గాభరాగా లేస్తూ చాలా పొద్దెక్కిందే అనుకుంది. ఇంతలోకి పోర్టికోలో ఓ టాక్సీవచ్చి గభాలున ఆగింది.

నిరంజనరావు, తన గదిలో కూర్చుని కిటికీ కర్టెన్ కొంచెంగాతీసి తొంగి చూశాడు వాకిట్లోకి ఆశ్చర్యంగా వీళ్లొ చ్చారేమిటి యిప్పుడు అనుకున్నాడు తనలో. సుగుణ ఆదరాబాదరాగా వచ్చి, 'వదినగారూ పిల్లలువచ్చారండీ,' అన్నది ఆవేశంగా. భర్త మౌనంచూసి చప్పున ఆశ్చర్యపడి, 'యిప్పుడెట్లా' అన్నది అదుర్దాగా

'ఇప్పుడొచ్చారేంటి ... వస్తున్నట్లు ఉత్తరంకూడా లేదే ... ఆశ్చర్యపో యాడు.

'నే చెపుతూనేవున్నా. వాళ్ళన్ని వుత్తరాలు రాస్తున్నప్పుడు ఏదో సమా ధానంగా వుత్తరం రాయమని...'

మెదలకండా వూరుకున్నాడు.

'లోపలికి వస్తున్నారు. మనం యిక్కడ కూర్చుంటే యేంబాగుంటుంది ...' హడావిడిగా వాకిట్లోకి వెళ్ళింది.

'ఏమక్కయ్యా కులాసానా...' వెన కాలే వచ్చిన నిరంజనరావు వర్ధనమ్మను పలకరించాడు.

'బాగానే వున్నాం నాయనా...'

'బావగారూ రండీ...'




సుగుణకు యేంతోచలేదు. ఏం మాట్లాడాలో అసలు అర్థంకావటంలేదు.

"వస్తున్నట్టు మాకుతెలియనే తెలీదు. లేకపోతేస్టేషనుకు కారు పంపించేవాళ్ళం" ...మొహం యింత చేసుకుని, సుగుణ యేదో మాట్లాడింది

"ఎన్ని ఉత్తరాలు రాసినా సమాధానం లేదు. ఆ పట్టాన మేమే వచ్చేశాం. అయినా మామీద మీకు మాత్రం అభిమానం వుంది అదే చాలు..."

'ఏమిటక్కయ్యా ఆ మాటలు. అభిమానంలేక ఏమయిందని...'

'...మాటవరసకన్నాలే...' నాలుక కరుచుకుంది వర్ధనమ్మ.

పైకి మాట్లాడుతున్నాడన్నమాటే గాని, వీళ్ళు యిప్పుడెందుకొచ్చారా, వీళ్ళను వెంటనే యేవిధంగానైనాసరే పంపించెయ్యాలి అని తీవ్రంగా ఘర్షణ పడుతున్నాడు నిరంజనరావు. సుగుణకు అయోమయంగావుంది ఏవో పనులు చేస్తోంది మాట్లాడుతోంది. అంతే. అప్పటికే కొడుకుమాట వచ్చేటప్పటికి యేదో విధంగా తప్పించేసింది. ఆ పూటకు భోజనాలయినాయి త్వరత్వరగా నిరంజనరావు కోర్టుకు వెళ్ళిపోయాడు ఇంట్లో ఒంటరిగా వుండిపోయినట్లుగా బెరుకు బెరుకుగా సుగుణ వుండిపోయింది.

"బాబు యింకా రాలేదే ..." వర్ధనమ్మ, మాట్లాడుతోందల్లా చప్పున ఆపేసి అడిగింది.

సుగుణ చప్పునతడబడింది. 'బహుశా యూనియన్ పనల్లో వూరికేమైనా వెళ్ళాలిసి వచ్చిందేమో వారొచ్చిన తర్వాత సంగతి తెలుస్తుంది...' కొంచెంగా తల వంచుకుని కూర్చుంది.

'వదినా...మీమీద గంపెడాశ పెట్టుకుని వున్నాం. మరేంచేస్తావో నువ్వు.

అంతా నీ చేతిలోవుంది. నువ్వుఅవునంటే మా వాడు కాదనడు...

'నాదేముంది వదినగారూ ... అంతా వారిచేతిలో వుంది...'ఏవిషయం మాట్లా డుతోందో అర్థంకాకపోయినా. మామూ లుగా అనేసింది సుగుణ.

తింటున్నామో పస్తుంటున్నామో ఆ భగవంతుడికి తెలుసు. ఏమయినా, జడ్జి గారి కోడలంటే హోదాకు తగ్గట్టుండాలి గదా అని, బి.ఏ దాకా చెప్పిస్తున్నా. వసంత విషయం చెపుతున్నా. అట్లా చూస్తావే...'

'ఆ! ఏంలేదులెండి...అవును వసంత విషయమే యిప్పుడు ఫైనలియర్టగా...'

'ఈ ఏడుతో అయిపోతుంది...'

'తర్వాత ఏంచేద్దామనుకుంటున్నారు' సుగుణకు మతిలో మతిలేదు.

'ఇంకా చేసేదేమిటి పెళ్ళిచెయ్యటమే ...' పెద్దగా నవ్వింది వర్ధనమ్మ.

సుగుణకూడా కొంచెంగా నవ్వింది.

'అబ్బాయికి ఈయేడాదితో యం.ఏ. అయిపోతుంది గాదు...'

"అవునవును...గొంతులో గీరవచ్చే సింది. సుగుణ కళ్ళల్లో నీళ్లు సుడులు తిరిగినాయి.

వస్తా యిప్పుడే అంటూ చివాలునలేచి లోపలికి వెళ్ళిపోయింది సుగుణ.

'ఏమండీ, శాయిమాట ఎత్తుతే చాలు, సుగుణ అట్లా యిది అయిపోతుందేమి టండీ...'

సత్యమూర్తి ఏమీ మాట్లాడలేదు

నిరంజనరావు చాలా పెందరాళేనే యింటికి వచ్చేశాడు. గబగబ సుగుణ వెళ్ళి 'ఏమండీ' మీ అక్కయ్యగారు అబ్బాయి సంగతి అడుగుతున్నారు ఊరువెళ్ళాడేమో, మీరొచ్చిన తర్వాత తెలుస్తుందని చెప్పానండి...'

'అట్లాగా, అంత గాభరా యెందుకు నే చూస్తాన్లే...'

'తమ్ముడొచ్చినట్టున్నాడు. మీరు కూడా రండి. ఇహ వచ్చింతర్వాత అడక్కుండా కూర్చుంటే యేంలాభం' ...వర్ధనమ్మ, భర్తను కూడా తీసుకుని, నిరంజరావు గదిలోకి వెళ్ళింది

'పిల్లలందర్నీ యింట్లో వదిలిపెట్టి వచ్చాం...'

'వాళ్ళనుకూడా తీసుకురాకపోయి నావా. నాలుగురోజులపాటు బస్తీఅంతా చూసేవాళ్లు...'

"నువ్వామాట అంటావని నాకు తెలుసు. మామీద నీకున్న ప్రేమ, అభి మానంకూడా బాగా తెలుసు. ఆ ధీమా తోనే యిక్కడికి వచ్చాం, చెప్పకుండా పెట్టకుండానూ. చూశారా నే చెపల్వా మీకు, మా తమ్ముడికి మనమంటే యేంతోయిదని..."

నిరంజనరావు సత్యమూర్తి వంక చూస్తూ చిరునవ్వు మొహం పెట్టాడు.

తల్లీతోడూ, నీకు నేను, నాకు నువ్వే యింకెవ్వరున్నారునాయనా కష్టం సుఖం

నీతో చెప్పుకోకపోతే యింకెవరితో చెప్పుకుంటాను...' వర్ధనమ్మ మొదలు పెట్టింది.

నిరంజనరావు కుర్చీలో ఒదిగి కూర్చున్నాడు. వింటున్నట్టు మెల్లిగా తల వూపుతున్నాడు.

'అమ్మాయిని బి ఏ. చదివిస్తున్నాం. వదినతోకూడా చెప్పాను...అంతా నీ యిష్టం అంది. దాన్నెట్లాగైనా నీ కోడలుగా చేసుకోవాలి నాయనా ... శాయికి యీడూ జోడూ బాగుంటుంది మేమూ పెద్ద పెద్ద కట్నాలు యిచ్చుకోలేమనీ నీకు తెలుసు. అయినప్పటికీ, ఏదో శక్తివంచన లేకండా ముట్టచెప్పదామనే కొంచెం కొంచెంగా కూడబెడుతున్నాం. పరమేశ్వరుడి దయ ఎట్లావుందో యేమో ...'

'అవన్నీ యిప్పుడెందుకు చెప్పు...'

'ఇప్పుడు కాకపోతే యింకెప్పుడు ...'

'అదికాదు. ఇంకా వసంత బి ఏ చదువుతూనే వుందిగా. చదువు పూర్తి కాని...తర్వాత చూద్దాంలే...'

'అట్లాగే. ఇప్పుడు మాట మాట్లాడుతున్నానా. బి.ఏ పూర్తి అయింతర్వాత మాటలే...మళ్ళీ మరదలొస్తుందేమో. నీ కడుపులోవుంచుకో...మా పరిస్థితేమీ బాగాలేదు. పూటపూటకు గడవటమే మహా కష్టంగావుంది. ఇంటినిండాపిల్లలు. ఎట్లా సంసారం యీదుకువస్తున్నామో యేమో ఆ భగవంతుడికే తెలుసు వాసు బి ఏ ప్యాసయ్యాడు. ఉద్యోగం కోసం ప్రయత్నం చేస్తున్నాడు. ఎన్ని దరఖాస్తులు పెట్టాడో అంతులేదు ఇంతవరకు యేమీ అచ్చిరావటంలేదు ఎక్కడకు పోయినా లంచాలు, సిఫార్సులు మేమా లంచాలు యివ్వలేము సిఫార్సుల సంగతి నీకు తెలిసిందే మీ బావగారికి ఏం పలుకుబడుందని. నోట్లో నాలుక లేదు. అకదాన్ని నేనైనా, తెలిసే తెలియకో బడబడా నాలుగు మాట్లాడతానుకాని, ఆయనకు అదీ చేతకాదు చెప్పుకుంటే సిగ్గుచేటు వాడికేదైనా ఉద్యోగం యిప్పించావంటే యేదో సంభనంగా బతుకుతాం లేకపోతే వీధులపాలయిపోతాం...'

'ఏమిటామాటలు నరీను...'

'అబద్ధం చెప్పటంలేదు. ఉన్న విషయం చెపుతున్నా. నీదగ్గర దాపరికం యెందుకు. కష్టంగా వుందని నాలుగు సార్లు అనుకుంటే కష్టాలు తీరతాయి కనక, అప్పటికీ వాసును ఎంత రమ్మని మన్నా, నేనెందుకులే. మావయ్యతో నే చెప్పానని చెప్పమని పంపించాడు. ఏదో చీటీరాసి యిచ్చాడు. ఆఉద్యోగాలేంటో, ఆ పేర్లేమిటో కూడా నాకు సరిగ్గా తెలీదు. వాడు తగని బిడియపడతాడు. చెడ్డ అభిమానం. అంతా నీ పోలికే...' సంతృప్తి పడుతోంది వర్ధనమ్మ.

ఆ చీటీ చూస్తూ నిరంజనరావు

పెద్దగా నిట్టూర్చి, కుర్చీలో వత్తిగిలుతున్నాడు. మనస్సులో మధనపడుతున్నాడు. ఏమిటి చెయ్యటమా అని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

'శాయి ఊరు వెళ్ళాడేమో అంటుంది. అంత మీకు చెప్పకుండా పూళ్ళు వెళ్ళేటంత అర్జంటు పన్లేముంటాయి అయినా నాకు తెలీదులే...' ఆపేసింది వర్ధనమ్మ.

"వాళ్ల స్టూడెంట్స్ యూనియన్లపన్ల మీద అప్పుడప్పుడు బైటకు కూడా వెళుతూ వుంటాడులే అయినా చెప్పక పోవటం యేముంది రెండురోజుల్లో వస్తానని చెప్పే వెళ్లాడుగా..."

'పోన్లే. ఇంత దూరం వచ్చినవాళ్లం యీ రెండురోజులూ వుండి వాడిని చూసి వెళ్లితేనే మనసుకు తృప్తిగా వుంటుంది ...' వర్ధనమ్మ మామూలుగానే అనేసింది.

నిరంజనరావు ఒక్క క్షణం ఆమె మొహంలోకి చూసి మళ్లీ తల అవతలకు తిప్పేశాడు.

ఏం రాశాడు ఆ చీటీలో...'

'అదే చూస్తున్నా...'

'ఆ ఉద్యోగాలు మానివేనా...'

ఆ...'

ఏదో నాయనా ఓ దారి చూపించు రోజురోజుకు ధరలు పెరిగిపోతున్నాయా, బజార్లోకి వెళ్లేటట్టుందా, ఏమైనా కొనేటట్టుందా ... మరి ఎట్లా వెళతాయో రోజులు. తలుచుకుంటే భయమేస్తోంది. వసంతకు పెళ్ళిచేసి, వాసు ఉద్యోగస్థుడయితే, మాకు మూడొంతులు భారం తగ్గుతుంది తర్వాత ఆ పిల్లలు పెరిగి పెద్దవాళ్లయినప్పుడు చూసుకోవచ్చు, తల్లితోడు కాబట్టి, అరమరికలులేకుండా వున్నదివున్నట్టు చెప్పకున్నా...అదుగో మరదలు వస్తున్నట్టుంది...'

సుగుణవచ్చి, ఫలహారం చేద్దురుగాని రండిలోపలికి అన్నది.

వర్ధనమ్మ, సత్యమూర్తి చప్పున లేచారు.

'ఏమిటి అట్లా చూస్తున్నారు...'

'ఏం లేదు పెద్దచిక్కే వచ్చేటట్టుంది ...చెపుతా నువ్వు పద...' నిరంజనరావు తలపట్టుకుని కూర్చున్నాడు.

నేనింతవరకు యెవ్వరికీ సిఫార్సులు చెయ్యలేదు. చెయ్యకూడదుకూడా. ఎంతో స్ట్రిక్ట్‌గా వుంటూ చాలామందికి విరోధిని అయ్యాను. నా డ్యూటీని నేను సక్రమంగా నెరవేరుస్తాననే తృప్తిఒక్కటే మిగిలివుంది. నన్ను అందరూకూడా అపార్థం చేసుకున్నారు. గర్వమని, మానవత్వములేదని, కఠినహృదయుడు అని ఎన్నెన్నో టైటిల్స్ తెచ్చుకున్నాను ఇవన్నీ నాకెట్లా వచ్చినాయి. నా డ్యూటీ నేను చేస్తున్నందుకు నా హితులు నాకు యిచ్చిన బిరుదులు అని సహించాను అన్నీ భరించాను. ఈ వెలివేస్తున్న సంఘంలో యింకా నేను ఒంటరిగా యిట్లాగే యెన్నాళ్ళు వుండగలను



ఉండలేనేమోనని భయమేస్తోంది. అక్కయ్య సంసారం యింత దీనస్థితిలో వుందని నాకు తెలీదు. ఒకవేళ డబ్బు యిచ్చినా, ఆమె తీసుకుంటుందో లేదో. అయినా ఒకసారి రెండుసార్లు యివ్వ గలుగుతాము అంతేగా. శాయి వచ్చే దాకా వుంటానంటూంది. ఆహా, శాయి యెప్పుడు వస్తాడు. అసలు శాయి మళ్ళీ యీ యింట్లో అడుగుపెడతాడా. పెట్ట గలడా. మళ్ళీ ఆవిడ శాయి యెప్పుడు వస్తాడు యెక్కడికి వెళ్ళాడు అని అడి గితే సమాధానం యేమనిచెప్పాలి. అబ్బ, యిదంతా అగమ్యగోచరంగా వుంది. పెద్ద సమస్యే తెచ్చిపెట్టింది. గదంతా ఊరికే పచార్లుచేస్తున్నాడు. ఎటూ తోచ టంలేదు. ఎంత తీవ్రంగా ఆలోచిస్తే, అంత ఆరాటం, ఆవేదన యెక్కువయి పోతున్నాయి. మనస్సు నిలవటంలేదు. తెగ బాధపడుతున్నాడు.

'మీరు రండీ...వాళ్ళు మీ కోసం యెదురుచూస్తున్నారు...' సుగుణ వచ్చి అన్నది

చప్పున ఉలిక్కిపడి ఆ ..వస్తున్నా ...అన్నాడు.

'మన నీడ మనం చూసుకుని భయ పడాల్సిన రోజు వచ్చింది...'అనుకుంది

సుగుణ. ఆమె మెదలకుండా వెళ్ళిపోయింది డైనింగ్ హాలులోకి. ఆమె, నిరంజన రావుకంటే నిబ్బరంగా వుండిపోయింది. ఇప్పుడు ఆయనే విలవిలలాడిపోతు న్నాడు. సూటిగా వచ్చి ఫలహారంచేసి మళ్ళీ మెదలకండా వెళ్ళి గదిలో పడు కున్నాడు.

ఒకటి రెండుసార్లు వర్ధనమ్మ గది దాకా వెళ్ళి తొంగిచూసి వెళ్ళిపోతోంది. నిరంజనరావు గమనిస్తూనే వున్నాడు.

'అక్కయ్యా' అన్నాడు.

సంతోషంగా చప్పున లోపలికి వెళ్ళింది వర్ధనమ్మ.

'ఈ ఉత్తరం వాసుకియ్యి. దీంట్లో అంతా రాశాను...' కాస్త పస్తాయించి, రేపే యివ్వాలి యీ ఉత్తరం-అన్నాడు ఆయాసపడుతూ.

'ఉద్యోగం వచ్చేస్తుందా నాయనా?'

'ఆ...'

'అయితే యీ రాత్రికే వెళ్ళిపోతాం.'

'మరి...'

'నువ్వేమీ అనుకోవద్దు. ఇహ రామా, పోమా. ఈసారి వచ్చేటప్పుడు పిల్లలం దర్నీ కూడా తీసుకొచ్చి, నాలుగురోజు లుండేటట్లే వస్తాము. శాయిని అడిగామని చెప్పు. వాడిని చూడకండా వెళ్ళడం మాకు పెద్ద లోటుగానే వుంది. కాని పరి స్థితులు యిట్లా వచ్చినాయి. రేపే యీ ఉత్తరం యివ్వాలంటున్నావేను ...' వర్ధనమ్మ అంటుంటే నిరంజనరావు తలవంచుకున్నాడు.

రాత్రిబండికే అక్కయ్యను, బావను పంపించేసి, యింటికివచ్చి రొప్పుతూ మంచంమీద పడుకున్నాడు. తెగ ఆయాసపడుతున్నాడు.

'ఏమిటి, యెట్లా వుందండి ...' సుగుణ మెల్లిగా వచ్చి నిలబడింది.

'...నా పని అయిపోయింది...నేను అన్నీ పోగొట్టుకున్నాను ఏ సిఫార్సూ ఎవ్వరికీ చెయ్యనివాణ్ని, యివ్వాళ సిఫార్సు ఉత్తరం యిచ్చాను. రేపే ఆ ఉత్తరం యివ్వాలని అబద్ధం చెప్పాను. జన్మలో నేను ఏ పనులు చెయ్యకూడదో ఆ పనులు చేశాను సుగుణా! నాకు యిలాంటిదుస్థితి యెందుకొచ్చిందం టావు...'

ఏమిటి మీరంటోంది. నాకేమీ తెలీ టంలేదు...ఎందుకు అంత యిదవుతారు. మేనల్లుడికి ఉద్యోగం యిప్పించారు. ఇది ఉపకారమేగాని, అపకారమేమీకాదే. మీరు ఎవ్వరికీ ద్రోహంచెయ్యలేదు. అన్యాయం అంతకంటే చెయ్యలేదు. ఏదైనా అన్యాయం జరుగుతే మనకు జరుగుతుందేమో. నాకు మీరు యెన్నో చెప్పి, మీరిట్లా యిదవటం ఏమీ బాగా లేదు. మీరు ఉద్రేకపడటం, మంచిది కాదని డాక్టరు యెన్నోసార్లు చెప్పాడు




...' సుగుణ భర్తకు ధైర్యం చెపుతోంది.

'నాకేమీ అర్థంకావటంలేదు. నాకేమీ తెలీటంలేదు. మతిపోతున్నట్లుంది. నాకు చాలా భయంగా కూడా వుంది...'

'మీరు పడుకోండి. మీకు రెస్ట్ చాలా అవసరం...'సుగుణ వంటింట్లోకి వెళ్ళి, ఉద్వేగం అంతా వెళ్ళబుచ్చుకుంది.

ఆ రాత్రికూడా ఎట్లా గడిచిపోయిందో, యిద్దరికీ ఆశ్చర్యంగానేవుంది.

నిరంజనరావు ముభావంగా వుండిపోయాడు. సుగుణ ఎన్నిసార్లు పిలిచినా సమాధానం ఇవ్వలేదు.

'మీరు నాతో మాట్లాడరా ...' జాలిగా అన్నది.

ఇంకా బండరాయి అయిపోయాడు.

యాంత్రికంగా పనులుచేసుకుంటూ, టైము చూసుకుంటూ నిరంజనరావు పదిన్నర అవుతూండగా, కోర్టుకు వెళ్ళటానికి, పోర్టికోలో కారుదగ్గరకు వెళుతన్నాడు. సుగుణకూడా దిగాలుపడి, క్రుంగిపోయి, పిచ్చిదానిలాగ, ఆయన వెనకాలే కారుదాకా వెళ్ళి నిలబడింది.

'ఈ రోజే జడ్జిమెంటు ...' చప్పున కారులోకివెళ్ళి కూర్చున్నాడు.

'ఆః...' ఆశ్చర్యపోతూ శూన్యంలోకి వెర్రిగా చూసింది కారు బర్రున దూసుకుపోయింది.

క్షణక్షణానికి టైము చూసుకుంటోంది. తానుకూడా కోర్టుకు వెళితే బాగుంటుందేమో అనుకుంటోంది. మళ్ళీ పస్తాయిస్తోంది. ఏం తీర్పు వస్తుందో యేమో అని ఆందోళనపడుతోంది.

శాయి అంత ఘోరనేరం చేశాడంటే నమ్మలేకుండా వున్నాను. కాని హత్య చెయ్యటం కళ్ళారాచూసినవాళ్ళుచెప్పారు,

నమ్మకండా ఎట్లా వుంటం! రౌడీలతో సహవాసంచేసి పేరుప్రతిష్ఠలు మంట కలిపేసి చదువులు నాశనం చేసుకుని యింత దిగజారిపోతాడని కలలోకూడా వూహించలేకపోయాను. ఇంత ఘోరా నికి పాలుపడినవాన్ని భగవంతుడు కూడా క్షమించలేడు. గుడ్డిప్రేమ కన్న తల్లిప్రేమ. ఛీ! శాయి నా కొడుకుకాదు. వాడికి యే శిక్ష విధించినా కూడా నాకు సంతోషమే. నేను యెందుకు దుఃఖప డాలి. దేనికోసం బాధపడాలి. అన్నీ పోగొట్టుకున్న తర్వాత జీవచ్ఛవంలాగ శాయిని యీ యింట్లో చూస్తూ నరకం అనుభవించలేను. నా మాట వినలేదు. తండ్రిమాట వినలేదు. తాను బాగుపడ లేదు. మేము ఒకళ్ళం వున్నామనే ఆలో చనకూడా లేకుండా ప్రవర్తించాడు. మాకు వాడు లేడు అంతే. సుగుణ రక రకాలుగా ఆలోచిస్తూ ఆరాటపడిపో తోంది. గోడగడియారం గంటలు కొట్టం గానే చప్పున తలెత్తిచూసింది. అయిద యింది—వాకిట్లో కారుచప్పుడయింది. చప్పున లేచివెళ్ళింది.

నిరంజనరావు కారు దిగి యెంతో నిబ్బరంగా లోపలికి వచ్చేశాడు. గభా లున కుర్చీలో కూలబడ్డాడు.

'...సుగుణా అయిపోయింది ... మనకు ఒక్కకొడుకు. వాడు కాస్తా లేకపోతే మనిద్దరం యేమయిపోతామో. యెంత ఆవేదనపడతామో. మన మాన సికబాధ యేమిటో ఆ పట్నాయక్ తెలుసుకున్నాడు. మనమీద జాలిపడ్డాడు. మనమీద సానుభూతి చూపించాడు. తోటి జడ్జికి యెంతో సహాయంచేశాడు ...' నిరంజనరావు చెప్పుకుపోతు న్నాడు.

కళ్ళు పైకెత్తి చూసేటప్పటికి, సుగుణ బొమ్మలాగ నిలబడివుంది చైతన్యరహితంగా.

'...సుగుణా...మనబ్బాయిని విడు దలచేశారు...' గట్టిగా అరిచాడు నిరం జనరావు. ఆయాసపడుతూ కుర్చీలో వెనక్కుపడ్డాడు

ఆ అరుపుతో సుగుణ తెప్పరిల్లి కను రెప్పలు టపటపమనిపించింది. ఆమె కళ్ళవెంబడి నీళ్ళు ధారగా కారుతు న్నాయి. అవి ఆనందబాష్పాలో, కన్నీరో ఆమెకే తెలియాలి.






దాదాపు పదేళ్ళక్రితం ఒక కుగ్రామంలో ఒక మామూలు ఇల్లాలు ఒక్కసారిగా ప్రసిద్ధవ్యక్తి అయిపోయింది. ఫలాని మాలక్ష్మమ్మగారింట్లో చాకిరీచేసేరంగడు అన్నమే తినట్ట, అన్న పుకారు ఊరంతా చుట్టేసుకుంది. అది క్రమంగా చుట్టు ప్రక్కల గ్రామాలకుకూడా పాకింది.

"ఆఁ దొంగవేషమై ఉంటుంది" అన్నారు కొందరు. "ఈ వెధవప్రపంచంలో ఏది చెప్పినా నమ్మేవాళ్ళున్నారు గద" అన్నారు మరికొందరు. అట్లా అన్నం తినకుండా బతికే అవకాశమే ఉంటే నిన్న మొన్న ఆ బెంగాల్లో అన్ని లక్షలమంది ఎందుకు చావాలిసొచ్చిందీ? అన్నారు ఇంకా కొందరు.

కాని ఈ వార్త నమ్మినవాళ్ళే జాస్తి.

"ఏ మనిషిలో ఏ మహత్తుంటుందో ఎవరు చూశారు? మా వదినెగారి ఊర్లో ఓ పిచ్చిపిల్లవాడు చెట్టుచూసి క్షణంలో చెప్పేస్తాట్ట, ఎన్ని ఆకులున్నాయో! ఎండుమిరపకాయ గలగల్లాడిస్తే ఎన్ని విత్తులున్నదీ చెప్పేస్తాట్ట!" అని కొందరూ, "జలభక్షణా, వాయుభక్షణా అనే మాటలు ఊరికే పుట్టినాయట్రా? ఏ పుట్టలో ఏ పాముందో ఎవరు చెప్ప గలరు? ఏ జన్మలోనో యోగి అయి

ఉంటాడు. కించిత్తు దోషం చేసుకొని ఈ జన్మలో ఈ తక్కువ పుటక పుట్టాడు. ఆ పాపం కాస్తా పరిహారం అయిపోగానే ఆ శ్రీమన్నారాయణమూర్తి సన్నిధికి నేరుగా చక్కాపోతాడు!" అని మరి కొందరూ, "ప్రకృతి చిత్రాలను మనం ఊహించలేం. మా మేనమామల ఊళ్లో ఏడు తలల ఈతచెట్టు లేదూ? పెద పద్రులో ఘంటలమ్మ తాళ్ళుండేవి కావూ? హిమాలయం మంచుకొండల్లో దిగంబరు డున్నాడని మనం వినలా? ఒకాయన నా చిన్నతనంలో మన ఊరి చెరువులో బాసినపట్టు వేసుకుని ఈ చివరనుంచి ఆ చివరకు ఈదాడని చెప్పకోలా? వాటిని మనం అర్థంచేసుకోలేం. మన పరిజ్ఞానం చాలదు, అంతే" అని ఒకరూ, ఈవిధంగా తలోమాటా అన్నారు.

ఇంతకూ రంగడు అన్నం తినడనేది ఎట్లా బయటపడిందంటే—

వాడు మాలక్ష్మమ్మగారింట్లో చాకిరీ చేస్తూండేవాడు. వాడి కప్పుడు పదేళ్లో పన్నెండేళ్ళో ఉంటాయి. వాడి దసలు ఆ వూరు కాదు. తన దేవూరో వాడికి తెలీదు. చిన్నతనంలోనే తల్లి చచ్చింది. తండ్రనేవాడు ఉన్నాడో లేదో కూడా ఎవరికీ తెలీదు. ఏడాదిక్రితం ఆ వూరు వచ్చాడు. మాలక్ష్మమ్మగారింటికి వచ్చి పనిచేస్తానన్నాడు. ఏ చాకిరీ అయినా చేస్తానన్నాడు. జీతంకూడా అడగలేదు. రెండువూటలా ఇంత తిండిపెట్టే ఏర్పా టుతో వాణ్ని పనికి పెట్టుకున్నారు. పిల్లల ఎంగిలికంచాల్లో మిగిలినది వాణ్ని తినమనేవాళ్ళు. కంచాల్లో ఎక్కువ మిగిలినా తక్కువ మిగిలినా వాడేమీ పేచీపెట్టేవాడుకాదు. ఎంగిలి కంచాలు తీసుకుని ఇంటివెనక్కి పోయేవాడు. కంచాలు కడిగితెచ్చి ఇంట్లో పెట్టేవాడు. కంచాల్లోది వాడు తింటున్నా డనే మాలక్ష్మమ్మగా రనుకునేది. ఆవిడకి మటుకేం తెలుసూ?

ఒకరోజు వెన్నెలరాత్రి. పిల్లల అన్నాలయాక, ఎందుకో మాలక్ష్మమ్మ గారు ఇంటివెనక్కి వెళ్ళేసరికి అక్కడ రంగడు తెల్లకుక్కను చేరదీసి దానికి కంచాల్లో అన్నం పెడుతున్నాడు. ఆ పూట రంగడికి అన్నంతక్కువయిందని అంతో ఇంతో నొచ్చుకుంటున్న మాలక్ష్మమ్మకి చూడగానే శివం ఎత్తినట్ట యింది.

"నీ కడుపుకాలా! ఆ అన్నం కాస్తా కుక్కకి పెడుతున్నావేరా? నువ్వేం తిని చస్తావ్?" అని అడిగిం దావిడ.

రంగడు మాటా పలుకూ లేకుండా కంచాలు తీసుకుపోయి, కడిగితెచ్చి, లోపలపెట్టి, అరుగుమీద చుట్టచుట్టుకుని పడుకుని, నిద్రపోయాడు. అంతసేపూ యజమానురాలు వాణ్ణి తిట్టిపోస్తూనే వుంది. అడుక్కుతినేవాళ్ళందరికీ ఉండే తెగులే ఇదన్నది. పిల్లల ఎంగిలి తినటం కుక్కకి నామోషీ అయింది కాబోలు

నన్నది. పాపంకదా అని ముష్టివాణ్ని చేరదీసి పిల్లలతో సమంగా పెంచితే కళ్ళు నెత్తికొచ్చాయన్నది. తేరతిండి బాగా వంటపట్టి ఈకాడికి వచ్చిందన్నది. నాలుగురోజులు తిండి పెట్టకపోతే దొక్కమాడి అప్పుడు తెలిసివస్తుంద న్నది. ఇంకేమేమో అన్నది. దేనికీ రంగడు సమాధానం చెప్పలేదు.

కోపంవస్తే మా మాలక్ష్మమ్మ మామూలు మనిషి కాదు! మర్నాడు పొద్దున పిల్లల కంచాల్లో మిగిలింది రంగడు తినటానికి లేకుండా వీధిలో పారేసింది. మళ్ళీ తెల్లకుక్క వచ్చి అది కాస్తా తినేసింది. ఆ కుక్కను చూడగానే తాను చేసినపని అర్థంలేనిపని అని ఆవిడకు తట్టింది. తాను ఈ పూట చేసిన పనేగా వాడు చేసిందీను? అది శిక్ష ఎట్లా అవుతుంది?

నిక్షేపంలాంటి అన్నంకాస్తా కుక్కకి పెట్టాడని ఆవిడ ఆగ్రహించిందేగాని, రంగడు ఏంతిన్నాడు, తినకుండా ఎట్లా ఉన్నాడన్న అనుమానం మా మాలక్ష్మమ్మకు ఇప్పుడే కలిగింది. తాను పెట్టే ఎంగిలి మెతుకులు కుక్కకు వేసి వాడు ఇంకేదోతింటూవుండాలని ఆవిడకు తోచింది. తిండిగాని, డబ్బులుగాని ఇంట్లోనుంచి దొంగిలిస్తున్నాడా అని ఆలోచించి చూసింది. నమ్మశక్యంగా లేదు. ఒకవేళ అవతలవీధిలో ఉన్న తనఆడపడుచు వాణ్ని పిలిచి తిండిపెట్టి డబ్బులిచ్చి తన ఇంటిరహస్యాలేమన్నా తెలుసుకుంటున్నదా అని అనుమానం కలిగింది. ఈ అనుమానానికి ఆధారం దొరకలేదు. ఎందుకైనా మంచిదని ఆరోజల్లా వాణ్ని ఓకంట కనిపెడుతూనే వుంది. వాడెక్కడికీ పోలేదు. ఎవరి తోనూ మాట్లాడలేదు. ఏమీ కొనుక్కొని తినలేదు. అన్నిటినీ మించిన చిత్ర మేమంటే తిండిమాటే ఎత్తలేదు. మామూలుగానే పనులన్నీ చూశాడు.

ఆరాత్రి మాలక్ష్మమ్మ గుండె కరిగింది. వాడిమీదవచ్చిన కోపమంతా దిగిపో యింది. ఆవిడలెక్కన వాడప్పటికి మూడుపూటలు తిండి తినలేదు. పిల్లల అన్నాలయాక వాడికి మామూలుకన్న ఎక్కువ అన్నంపెట్టి, "పో వెధవా, పిచ్చికళలుపోక కడుపునిండా తిను" అన్నది. కంచాలూ, అన్నమూ తీసుకుని రంగడు ఇంటివెనక్కు పోయినాడు. మరుక్షణమే ఆవిడ కేదో సందేహం తోచింది. ఆకలిమీద వున్న వాడు ఎంత ఆత్రంగా తింటాడో చూదామని ఆవిడ వాడి వెనకే పిల్లిలాగా బయలుదేరింది. ఆవిడ గోడమలుపునుంచి తొంగిచూసే సరికి బాదంచెట్టు పక్కగా తోక ఆడిస్తూ, తెల్లకుక్క దానిముందు అన్నం బోర్లిస్తూ రంగడూ కనిపించాడు

మొదట మాలక్ష్మమ్మ నిర్ఘాంత పోయింది. తరువాత ఆవిడకు కలిగినది ఆగ్రహం. ఈసారి ఆవిడ కోపానికి

కారణం అన్నం కుక్క తినేస్తున్నదని కాదు; రంగడు ఇంత అస్వాభావికంగా ఎందుకు ప్రవర్తిస్తున్నాడా అని! అసహజమైన పని చెయ్యటంలో వాడికా పట్టుదల ఏమిటా అని! ఆవిడకు రంగడిపై కలిగిన కోపంలాంటిదే పూర్వం హిరణ్యకశిపుడికి ప్రహ్లాదుడిపై కలిగివుండాలి.

"ఒరే రంగడూ!" అని ఒక్క పొలికేక పెట్టింది, మాలక్ష్మమ్మ. రంగడు నిర్ఘాంతపోయినాడు. ఆవిడ దగ్గిరికి వస్తూంటే వొణికిపోయినాడు. మాలక్ష్మమ్మ రంగణ్ని చేతికి దొరికిన ఎండు బాదంకొమ్మతో బాదింది. ఆ బాదుడుకు అర్థంలేదు. వాడు తనదొక్కే మాడ్చుకుంటున్నాడుగాని ఆవిడకు చేసిన ద్రోహం ఏమీలేదు. ఆ ఎంగిలికంచాల అన్నంతో ఆవిడకు ఇంకేమీ ఉపయోగం లేదు. న్యాయంగా అది రంగడిసొత్తు. ఆవిడ ఆమోదించే న్యాయంప్రకారం చూసినా! దాన్ని వాడు ఏం చేసుకున్నా ఆవిడకు అభ్యంతరం ఉండరాదు.

రంగడు ఏడిచాడు. మళ్ళీ "ఇలా చేస్తావా? చేస్తావా?" అని అడుగుతూ ఆవిడ కొడుతుంటే "చెయ్యనమ్మగారూ, చెయ్యనమ్మగారూ!" అన్నాడేగాని వాడుచేసిన తప్పేమిటో వాడికి తెలీదు.

ఇదంతా మాలక్ష్మమ్మకూ సుఖంగా లేదు. కొంతసేపయాక ఆవిడ వాణ్ని లోపలికి తీసుకుపోయి, "ఎందుకిట్లా అన్నం తీసుకుపోయి కుక్కకు పెడతావు? పొద్దునల్లా మాడిస్తేనే, సిగ్గులేదట్రా? నీ పొట్టసంగతి నువ్వు చూసుకోక ఆ కుక్కగొడువ నీకెందుకురా?" అన్నది.

వాడు మాట్లాడలేదు. వేరే ఏం తింటున్నావు, చెప్పమన్నది. ఏమీ తినటం లేదన్నాడు-వాడు. నీ కన్నం అక్కర్లేకపోతే చెప్పు. నాచేత నిష్కారణంగా దేనికి వండి వార్పిస్తావు? అన్నదావిడ. తనకు అన్నం అక్కర్లేదన్నాడురంగడు. ఆవిడ నిర్ఘాంతపోయింది. కాని, వాడు చాలా ఏళ్ళుగా తిండితినటమేలేదని విని, దాన్ని రూఢిచేసుకుని ఆవిడ పొందిన ఆశ్చర్యానికి అంతులేదు.

ఆవిడే ఊరంతా టాంటాం వేసింది, రంగడు అసలు అన్నమే తినడని. తన నోట ఈమాట విని ఒక్కొక్కరే ఆశ్చర్యపోతున్నకొద్దీ ఆవిడకు ఓ విధమైన ఆనందం కలగసాగింది. తానే అన్నం తినని మనిషి అయినట్టూ ప్రపంచం తనను చూసే ఆశ్చర్యపోతున్నట్టూ ఆవిడ భావించసాగింది. రంగడు అన్నం తినకపోవటంవల్ల తనకు ఊళ్లో ఇంత ప్రాముఖ్యం వస్తుందని ఆవిడ కలలో కూడా అనుకోలేదు. అందరూ వాణ్ణి గురించి తనను అడిగేవాళ్ళే. రంగడికి తానొక గార్డియన్ అయికూచుంది.

కాని ఈ ఆనందం ఆవిడకు ఆట్టే కాలం దక్కలేదు. ఇతరులు రంగణ్ని తనకు కాకుండా చేయాలని చూస్తున్నట్టు




ఆవిడకు తోచింది. పొరుగింటి సుబ్బమ్మ వచ్చి చాలా ఇచ్చకాలాడింది. రంగణ్ని చూసినప్పుడే అనుకుందిట, వాడు మామూలు మనిషి కాడని — నోరుబడ! వాడు తన ఇంట్లోనే పనిచేస్తుంటే పువ్వుల్లో పెట్టి పూజించేదట! వాణ్ని కుక్కకన్నా హీనంగా చూశానట. వాడు వచ్చినప్పట్నుంచీ మాలక్ష్మమ్మ గారి ఇంటికి ఎంతో కలిసొచ్చిందట! వాడొచ్చిన ఏడు మాలక్ష్మమ్మగారి కాకరపాదు కాచిన కాపుతోనే తాము— అంటే సుబ్బమ్మ అదంతా రంగడి మహిమ అనుకుందట.

ఆంజనేయోపాసనచేసే ఆ గడ్డం హనుమయ్య వచ్చాడు. రంగడికేసి రెప్పవాల్చకుండా చాలాసేపు చూసి, తల ఆడించి "తెలిసింది. తెలిసింది" అన్నాడు. చేతులు జోడించి ఆకాశంకేసి చూసి, కళ్ళు తేలేసి, గంజీలుతీసి, రంగడి దగ్గరకొచ్చి వాడి చెవులో ఏదో చాలాసేపు నూరిపోశాడు. "హనుమయ్య ఏం చెప్పాడ్రా?" అని తరువాత అడిగితే రంగడు భయంతో "చెప్పకూడదు, చెబితే నాతల పగిలిపోతుంది" అన్నాడు.

నోరు మాట్లాడితే నొసలు వెక్కిరిస్తుంది, ఆ బసవయ్యకు ఆయనవచ్చి కళ్ళెగరేస్తూ "నేర్పింది మాలక్ష్మమ్మది. రంగడి కిన్నాళ్ళూ జీతమూ ఇవ్వకుండా తిండీ పెట్టకుండా పనిచేయించుకుంది," అని పదిమందీ వింటూండగా అనేశాడు!

రంగడుకూడా వెనకటి రంగడు కాదిప్పుడు. అందరూ తనను చూడరావటమూ "ఎన్నాళ్ళనుంచీ నువు తిండి మానేశావురా! నీ కేదైనా మంత్రం వచ్చా! ఏ బైరాగి అయినా చిట్కా ఇచ్చాడా? చాటుగా ఏమన్నా తింటూంటావా? కావాలని అన్నం తింటే ఏమవుతుందిరా? కడుపునెప్పి వస్తుందా? దాహమవుతుందా? వంటవాసనవస్తే నోరూరదూ?" ఇత్యాది ప్రశ్నలు వేస్తూండడము వాడికి భలే సరదాగావుంది.

గడిచిన రోజుల్లో టెంటుసినిమాలాడించిన వెంకయ్య రంగణ్ని గురించి మొదటగా పత్రికల్లో వేయించాడు.

ఆయనే పత్రిక పట్టుకువచ్చి తాను వేయించిన వార్త చదివి వినిపించాడు...

"ఈ కుర్రవానికి వ్రాయను చదువను రాదు. వీనికి ఎట్టి మంత్రములును రావు ఈ వింత చూచుటకు ప్రజలు తండోపతండములుగా చుట్టుప్రక్కల గ్రామముల నుండి వచ్చుచున్నారు. కొందరు ఈ భగవదంశసంభూతునికి కానుకలు అర్పించి మ్రొక్కుకొనుచున్నారు." అని వెంకయ్య చదవేసరికి, అదంతా నిజం కాకపోయినా ఊళ్ళోవాళ్ళు హర్షించారు.

ఈ వార్త పత్రికల్లో పడ్డనాటినుండీ నిజంగానే జనం కానుకలతో రాసాగారు. మాలక్ష్మమ్మ కంగారుపడింది. ఈ వచ్చే జనమూ, వాళ్ళు తెచ్చే కానుకలూ మొదలైనవి చూస్తే వాటికి తగ్గ పవిత్రవాతావరణం తనయింట లేనట్టు ఆవిడకు స్పష్టమయింది. ఈ సంగతి ఆవిడ వెంకయ్యతోనే అన్నది. వెంటనే వెంకయ్యకు గొప్ప ఆలోచన తట్టింది. ఆయన రాఘవయ్యతో మాట్లాడి, వాళ్ళతోటలో చిన్న కుటీరం వేయించాడు. అందులో రంగడికి మకాం ఏర్పాటుచేశారు; వాడికి చిన్న యోగివేషం వేయించాడు వెంకయ్య తపస్సు చేస్తున్నట్టు వాణ్ని కూచోమన్నారు. ఎవరికీ ఏమీ జవాబు లివ్వక్కర్లేదన్నారు. భక్తులందర్నీ అక్కడికి రమ్మన్నారు.

"రంగడికిది నమ్మతం కాలేదు ఒకగంట కదలకుండా కూచునేసరికి వాడికి యమచెర అయిపోయింది ఆకలి ఒకటి లేకపోయినా వాడికి మిగిలిన కోరికలన్నీ ఉన్నాయాయె మరి. గొడ్ల మధ్య తిరగటం, గోలికాయ లాడటం, చింతచెట్లెక్కడం, డాం దగ్గిర చేపలు పట్టేవాళ్ళతో కబుర్లుచెప్పటం; ఇవేవీలేందే వాడికి జీవితమే లేదు కళ్ళుమూసుకుని కూచుంటే వాడికి మొదట్లోనవ్వొచ్చింది.

"ఛీ నవ్వకు" అన్నాడు రాఘవయ్య.

"మేం చెప్పినట్టు చేయకపోతివా తాట వొలుస్తాం;" అన్నాడు వెంకయ్య. ఈ ఇద్దరూ వాడికి యములయ్యారు

కుక్క ఒక సమస్య అయింది. రంగడు రాఘవయ్యగారి తోటలో మకాం పెట్టినట్టు తెల్లకుక్క పసికట్టి నేరుగా వాడి దగ్గరికివచ్చి వాడి కెదురుగా కూచుంది. రంగడు రెండు మణికట్లూ రెండు మోకాళ్ళమీదా ఆనించి అభయ ముద్ర పట్టినట్లుకళ్ళుమూసుకునికూచుంటే కుక్కకి ఇదంతా నిజమా? లేక నేను కలగంటున్నానా?అని అనుమానం కలిగినట్టుంది. అది తల ఒకపక్కకి ఒరగేసి రంగడికేసి పరీక్షగాచూసి, ఎందుకన్నా మంచిదని ముందుకువచ్చి వాడి మొహం నాకింది. ఈ సమయంలో లోపలికి వచ్చిన రాఘవయ్యదాని నడుం విరిగేట్టు ఒక్క తన్ను తన్నాడు. ఏ అపచారం చెయ్యని తెల్లకుక్క భగవంతుడికి మొర పెట్టుకుంటూ అవతలికిపోయి పాక బయటినుంచి అరవసాగింది.




మాలక్ష్మమ్మను ఎవరూ తన్నలేదు గాని ఆవిడ గతీ దాదాపు కుక్కగతే అయింది. ఆవిడ పని మానుకుని ఒక పూటల్లా రంగడిదగ్గరే కూచుంది. ఎందుకు కూచున్నదీ ఆవిడకే తెలీదు. వాడిమీద తన కిప్పు దేహకూ్కలేదని ఆవిడకింకా స్పష్టంగా తెలియలేదు. రంగడి భక్తులెవరూ తనను గురించి పట్టించుకోవటంలేదు. మధ్యాహ్నం పద కొండింటికి ఆవిడకు ఎవరో కోప్పడ్డట్ట యింది. తాను ఇక్కడ కూచుంటే ఇంటిపను లెవరు చేస్తారు? అయినా తన కిక్కడ ఏంపని? తాను రంగడికి కానుక లివ్వటంగాని, మొక్కుకోవటం గాని అసంభవం. అసలు రంగడు అట్లా కూచోవటమే ఆవిడకు ఎబ్బెట్టుగా ఉంది. ఎవరికీ చెప్పకుండా మాలక్ష్మమ్మ వెళ్ళి పోయింది.

రంగడికి ఫొటోతీయించి పత్రికల్లో వేయించాలని వెంకయ్య సంకల్పించాడు. వెంకయ్యదగ్గిర పాత కెమెరా ఒక టుంది. దాంతో ఫొటోలు తీశాడు. కాని లాభంలేకపోయింది. ఒక ఫొటోలో రంగడి తలకాయ లేదు. రెండోదాన్లో వాడు ఒరగబడి కూచున్నట్లు పడ్డాడు. అన్నిటిలోనూ పొగమంచు రంగణ్ని ఆవరించినట్లుగానే వుంది. ఒక్కదాని లోనూ వాడి మొహమూ ముక్కూ తెలియరావటంలేదు

గత్యంతరంలేక వెంకయ్య బస్తీకి వెళ్ళి ఒక ఫొటోగ్రాఫర్ని తీసుకొచ్చాడు. వాడు మూడు ఫొటోలు ఎత్తాడు. ఒక దాంట్లో రంగడు ఒక్కడే ఉన్నాడు. రెండోవాన్లో రంగడూ పక్కన రాఘవయ్యా ఉన్నారు. ఇది చాలా అన్యాయం "రంగడివెంట నువ్వుంటే నేనూ ఉండాలి." వెంకయ్య అభ్యంతర పెట్టినమీదట మూడో ఫొటో ముగ్గురి

తోనూ తీగాడు ఫొటో|గ్రాఫర్. రాఘవయ్యే డబ్బిచ్చి పంపాడు.

నాలుగోనాటికి ఫొటోలు వచ్చాయి. అన్నీ ఒక ఫొటో కాపీలే అందులో రంగడూ, రాఘవయ్యా మాత్రమే ఉన్నారు. వెంకయ్య ఆదరాబాదరా బస్తీకిపోయి ఫొటో|గ్రాఫర్ను ఇదేమిటని అడిగాడు. "నన్నేం చెయ్యమన్నారు? మిగిలిన రెండు ప్లేట్లూపగిలిపోయాయి,'' అన్నాడు ఫొటో|గ్రాఫర్.

రంగడు చాలా గిట్టుబాటుగా ఉన్నాడు. వాడూ, రాఘవయ్యా ఉన్న ఫొటో పత్రికల్లో పడ్డప్పటినుంచీ జనం దూరపు గ్రామాలనుంచి కూడా రాసాగారు. కట్నాలూ కానుకలూరాసాగాయి. ఇందులో వెంకయ్యకు వంతు పెట్టటం రాఘవయ్యకు శుష్కదండగగా తోచింది. "నువ్వుకూడా పనిమానుకొని ఈ తోటలో దేనికి? పనిబడ్డప్పుడు నేను నీకు కబురుచేస్తాగా ?" అన్నాడు రాఘవయ్య వెంకయ్యతో.

"ఓహో! అదా సంగతి?" అన్నాడు వెంకయ్య.

మర్నాటినుంచీ వెంకయ్య రకరకాల ప్రచారం చెయ్యసాగాడు. రంగడు మూడుపూటలా మెక్కి తింటాడనీ, రాఘవయ్య ప్రపంచాన్ని వంచిస్తున్నాడనీ ఊరూరా ప్రచారం చెయ్యసాగాడు. ఈ ప్రచారం ఊరికే పోలేదు. రంగడికి కానుకలు అర్పించుకున్నవాళ్ళు కొందరు ఏ మహత్తూలేదనీ వాడికి దణ్ణంపెట్టి కోరుకుంటే కోరిక సిద్ధించదనీ అనసాగారు.

ఒకరోజున వెంకయ్యగారి దడి అంటుకుంది. రంగణ్ని గురించి దుష్ప్రచారం చేసినందుకే ఈ పని జరిగి ఉంటుందని రాఘవయ్య కొందరితో అన్నాడు. అందరూ నమ్మలేదు. రంగణ్ణి గురించి ఎందరో ఎన్నిరకాలుగానో చెప్పుకున్నారు కాని వాడి అవస్థ విచారించినవాడు లేడు. వాడి గతి నానాటికీ దుర్భరమవుతున్నది. రాత్రిపూటే వాడి ప్రాణానికి కాస్త సుఖం. ఒకరాత్రి వాడు కుటీరందాటి తోటదాటి పొలాలన్నీ చుట్టివచ్చాడు. ఇంటికి రాగానే రాఘవయ్య బాదదన్నాడు.

"ఈసారి తోటదాటిపోయి చూడు, పూడ్చిపెడతా!" అన్నాడు రాఘవయ్య. ఆ మర్నాటిరాత్రి రాఘవయ్య గురక పెట్టి నిద్రపోతున్న సమయంలో రంగడు తోట దాటాడు. రాఘవయ్య తంతాడని కాబోలు మళ్ళీ వాడు ఆ వూరికి తిరిగి రాలేదు. వాడి జాడ తెలుసుకున్నవారు కూడా లేరు.



# ఎ రిక్వెస్ట్




వేదుల మీనాక్షిదేవి

"అమ్మా! మా ఫ్రెండు శ్రీరాములు లేడూ! నా పెళ్ళికి టేబిల్ లైటు ప్రెజెంట్ చేశాడు జ్ఞాపకం వుందా? అతను వూళ్లోకి వచ్చాడుట. రేపు మన యింటికి వస్తాడుట. అర్జంటుగా ప్రక్కవూరికి వెళ్లవలసి వచ్చిందట. ఎవరో కుర్రవాడి చేత పంపించాడు వుత్తరం వ్రాసి," అన్నాడు జగన్నాధం కాఫీ తాగుతూ.

"అదేమిటబ్బాయ్. శ్రీరాములు జ్ఞాపకం లేకపోవడమేమిటి? ఏక గర్భ వాసులు లాగ పెరిగారు మీ యిద్దరూ" అంది ఆమె.

శ్రీరాములూ, తనూ ఆబాల్యస్నేహితులు. చిన్నప్పుడు గోటీబిళ్లలు, గోళీ కాయలు ఆడుకునేవారు. విద్యాభ్యాసంలో సహాధ్యాయులు. తను బి.ఎ. ప్యాసై మేజస్ట్రేట్ కోర్టులో హెడ్ క్లార్కుగా పనిచేస్తున్నాడు. అతను బి.కాం.చదివాడు. పరీక్షలముందు తండ్రి పోవడంతో మరి చదువుసాగలేదు. ఇంటికి తనే పెద్దఅయాడు. స్వంతంగా బిజినెస్ పెట్టినట్లు విన్నాడతను. అంతే ...ఇద్దరూ కలుసుకుని సుమారు ఎనిమిదేళ్లు కావస్తోంది.

ఇన్నాళ్లకు తన బాల్యస్నేహితుడు వస్తున్నాడు.

అతనికి చాలా ప్రిన్సిపల్స్ వుండేవి. వాటికి కట్టుబడి వుండేవాడు చిన్నప్పటి నుండి కూడా.

ఎందరెందరో కొత్త కొత్త పరిచయ

స్తులూ, సహాధ్యాయులతో పరిచయం, స్నేహం జరిగినా ప్రాణమిత్రుడనదగిన వాడు శ్రీరాములు ఒక్కడే. చదివితే యిద్దరూ, ఆడితే యిద్దరూ,తిరిగితే యిద్ద రుగా వుండేవారు. చిన్నప్పుడు గోళీ లాడితే, హైస్కూల్లో వాలీబాల్, బాడ్ మింటన్ ఆడేవారు. కాలేజీలో క్రికెట్ ఆడేవారు క్రికెట్ కామెంట్రీవస్తే రేడియో దగ్గర కూర్చుని వింటూండేవా రిద్ద రూను...ఎంతో సరదాగా గడిచాయి, ఆరోజులు...ఇప్పుడు సంసార బాధ్యత లతో యెవరికి వారు సతమత మౌతున్నారు...కొన్నాళ్లు వుత్తరాలుజరి గాయి ఇద్దరి మధ్యా...తరువాత అవీ నిలిచిపోయాయి.

దూరం నుండి తనను చూసికూడా అర్థంటు పని అని ముందుకు వెళ్లగలి గాడుగాని ఆదేతనయితే అడుగు కదిపే వాడా? నాటికి నేడు...

అతని ఆనందం అర్ణవమే అయింది.

ఊహాలోకంలో విహరిస్తున్న జగ న్నాధానికి మిత్రుడు వుత్తరం లోపల వ్రాసిన విషయం గుర్తుకువచ్చింది.

"అన్నట్టు మరిచేపోయానమ్మా... మన శ్రీరాములు వుత్తరంవ్రాసి ఏం చేశాడో తెలుసా...ఇవిగో చూడు..." అని జేబులోని కవరుతీసి వుత్తరంమడత లోనుండి సినిమా టిక్కెట్లుతీసి ఆమెకు చూపించాడు.

"మనకోసం ఎనిమిది టిక్కెట్లుకొని, సీట్లు రిజర్వు చేయించాడుట. సకుటుం బంగా మరీమరీ రమ్మని కోరాడు. తను అక్కడ వుంటానన్నాడు. మనంవెళ్లాలి. త్వరగా పనులు తెముల్చుకోండి. సుగుణ ఏదీ?" అన్నాడు జగన్నాధం

"ఇప్పుడు ఆరుగంటలు కావస్తోంది. ఇప్పుడు వెళ్లడం కుదరదు. కోడలు సుగుణ, అమ్మాయి సరోజ పేరంటం వెళ్లారు. మీ నాన్న, బావ షికారుగా వెళ్ళారు పార్కు కేసి. చిన్నవాడు స్నేహితుడు యింటికి వెళ్లాడు చదువు కుంటానని. పరీక్షలు పదిరోజులున్నాయి కదూ మరి..." అంది తల్లి రాజేశ్వ రమ్మ.

"తొందరేం లేదమ్మా ... అందరూ వచ్చాక, భోజనాలయాక సావకాశంగా వెళ్లవచ్చును. ఈ టిక్కెట్లు ఇవ్వాళ రెండవ ఆటకే. ఇవాళ వెళ్లితీరాలి. ఇరవై రూపాయలు పెట్టి కొన్నాడన్న మాట తెలుసా" అన్నాడు జగన్నాధం.

"ఏమిటి అన్నయ్యా ఇరవై రూపాయ లంటున్నావు?" అన్నాడు అప్పుడే మిత్రుడింటినుండి వస్తున్న తమ్ముడు శ్రీనివాసు.

"మా ఫ్రెండు శ్రీరాములని వున్నా డులే. నీకు తెలియదు బాగా చిన్నవాడివి. అతను ఫిలిం రిప్రజెంటేటివ్‌లుగా ఈ ప్రాంతంలో వాళ్ల సినిమా కలెక్షన్లు చూడడానికి వచ్చిన వారిపై పర్యవేక్షకు నిగా వచ్చాడట. మనందరినీ సినిమాకు

రమ్మని టిక్కట్లు పంపాడు. కొన్నాడట. తప్పకుండా రమ్మని రిక్వెస్ట్ చేస్తూ వ్రాశాడు.''

"ఆయన సినీమావాళ్లతరపున వచ్చాడంటున్నావు. మొగమాటస్థులను ఫ్రీగా తీసుకువెడుతూంటారే! కొనడం ఎందుకుట!" సందేహం వ్యక్తంచేశాడు శ్రీను.

''వాడి వుత్తరంచూస్తే నీ సందేహం పటాపంచలై పోతుంది. నిప్పులాంటి మనిషి. ఎవరి మొగమాటంలోనూ పడడు. తరువాత వాళ్లు ఏ పనిచెయ్యమన్నా చేయవలసిన ఆబ్లిగేషన్‌లో పడవలసి వస్తుంది అంటాడు." అన్నాడు జగన్నాధం మిత్రుని గురించి మెచ్చుకోలుగా. శ్రీనివాసు వుత్తరం చదవబోతూండగా షికారుకు వెళ్ళిన తండ్రి, బావ రామారావు వచ్చారు.

"ప్రియమైన జగ్గూ!

ఈవూళ్లో నువ్వున్నావని తెలియదు. వైనతేయ పిక్చర్స్ తరపున వచ్చిన రిప్రజెంటేటివ్‌లపై పర్యవేక్షణకు నేను వచ్చాను. కారులో అర్జంటుగా ప్రక్కవూరు వెడుతున్నాను. టైం అయిదున్నర గంటలయింది. ఆరు గంటలకు ఆట ప్రారంభం అయేవేళవుతోంది. అందువల్ల దూరంనుండి నిన్నుచూసి గుర్తుపట్టినా ఆగకుండావెళ్ళిపోతున్నాను. రేపు ఉదయం మీ ఇంటికివచ్చి మీ ఆతిధ్యం స్వీకరిస్తాను.

అయితే, ఒక్క రిక్వెస్ట్.

నేను స్వయంగా దగ్గరవుండి మిమ్మల్ని తీసుకువెడదా మనుకున్నాను. కాని రేపు యీ వూరునుండి వెళ్ళిపోవాలి. మెయిల్‌లో అడంగు చేరుకోవాలి. అందువల్ల ఇవ్వాళే మీరు సినిమాకు రండి నేను అక్కడ వుంటాను ఆ సమయానికి. ఎనిమిది టిక్కెట్లు కొని సీట్లు రిజర్వు చేయించాను. మీరు యెంత మంది వున్నారో వివరంగా తెలియదు. ఒకటీ రెండు టిక్కట్లు అదనంగా కావలసివస్తే అక్కడ నేనుంటాను కదా.

ఒక గమనిక

మా సినిమా అయినా మా కుటుంబం టిక్కట్లు కొనుక్కునే వెడతాము. రెండవ ఆటకు మీరంతా తప్పకరమ్మని మళ్ళీ రిక్వెస్టు చేస్తున్నాను.

సెలవ్"

చదవడం ముగించాడు శ్రీను

"ఈమారు తెలిసిందా వాడెంతప్రిన్సిపిల్డ్ మనిషో!" అన్నాడు జగన్నాధం.

"సంతకం సరిగా తెలియడంలేదు" అన్నాడు బావ రామారావు

అందరూ చూస్తున్నారు సంతకాన్ని పరిశీలనగా.

"ఇదిగో...మొదటి అక్షరం శ్రీ... కనబడుతూనే వుంది అది శ్రీరాములు పేరే'' అన్నాడు జగన్నాధం.

"కానియ్యండి...పోదాం సినిమాకి ...ఏదివస్తే ఏది ఆగుతుంది గనుక?... కక్కు వచ్చినా, కల్యాణం వచ్చినా ఆగదంటారు. ఆ లిస్టులో సినిమా

వచ్చినా అని చేర్చాలి" అన్నాడు రామారావు.

"నేను మాత్రం రాను. మీరంతా వెళ్ళండి. నేను నిద్రకి ఆగలేను" అన్నాడు రాఘవరావు

"అదేమిటి నాన్నా. నా ఫ్రెండ్ రమ్మంటూంటే మీరురాకపోవడమేమిటి? అదీకాక నాకు నాజరుగా ప్రమోషనిస్తూ ట్రాన్స్ఫరార్డరు వచ్చిందికదా. నాలు గైదు రోజులలో వెళ్ళిపోవాలి సామాన్లు సర్దుకొని. వెళ్ళి అక్కడ స్థిమితపడే సరికికొంతకాలం పడుతుంది. అందువల్ల ప్రమోషన్ సందర్భంగా అందరం కలిసి సినిమాకి వెళ్ళాలనుకుంటున్నాను నిన్నటి నుండి అన్నీ కలిసివచ్చాయ్. రండి" అన్నాడు జగన్నాధం.

"అందరం కలిసి వెళ్ళడం అనేది యెప్పుడూ పడలేదు ఇన్నాళ్ళకివచ్చిన గోల్డెన్ అపార్చ్యూనిటీ వృధా పోనియ్య కండి" అన్నాడు వాసు.

"రండి మామగారూ" అన్నాడు అల్లుడు.

పేరంటానికివెళ్ళినకోడలు, కూతురూ వచ్చారు

నిద్రకి ఆగలేనని యెంతచెప్పినా ననేమిరా ఒప్పుకోలేదు యింట్లోవాళ్ళు.

తల్లీ, తండ్రీ, పెద్దకొడుకు జగన్నాధం, భార్య, కుమార్తె సరోజ, అల్లుడు, చిన్నకొడుకు శ్రీను ఆయింట్లోనభ్యులు. ఒక టిక్కట్టు అదనంగా వుండి పోయింది.

ఎవరినైనా తీసుకువెళ్ళవచ్చును.

ఎవరిని? అని ఆలోచిస్తుండగా "మన ప్రక్కవాటాలో వున్నగుమాస్తా రామ నాధంగారిని రమ్మందాం పాపం ఒక్కరూ వున్నారు" అన్నాడు శ్రీను.

అంతా అంగీకరించారు.

మొగమాట పడుతూనే ఒప్పుకు న్నాడు రామనాధం.

"అన్నట్లు ప్రొద్దుట శ్రీరాములు వస్తాడు. టిఫిన్, కాఫీ దండిగా తయారు చెయ్యాలి. వంట ఆవిడను పెందరాడే రమ్మన్నాడు జగన్నాధం. టైం తొమ్మిదింపావు అయింది.

రిక్షాలు పిలిచారు.

నేనంటే నేనంటూ అయిదు రిక్షాలు వచ్చాయి. నాలుగు చాలు అంటూ కట్టించుకుని వెళ్ళిపోయారు.

గొణుక్కుంటూ అయిదవ రిక్షావాడు వీధి మొగలో ఆగివున్న లారీదగ్గర రిక్షా ఆపుకొని కూర్చున్నాడు.

* * *

సినిమాహాలు వద్దకు చేరేసరికి పావు తక్కువ పది అయింది. గేట్మన్కి టిక్కట్లు చూపారు. వాడుకూడా వచ్చి వారు కూర్చోవలసినచోటు చూపిందాడు. వరుసగా యెనిమిది కుర్చీలకు ఒక పురి కొస అడ్డంగా వుంది అంతవరకు.

జగన్నాధం అటూయిటూ చూస్తు న్నాడని గమనించిన గేట్మన్ 'ఎం కావాలండీ' అన్నాడు.

"ఆయన రాలేదా? ఈ టిక్కట్లు కొన్నారే ఆయన" అన్నాడు.

"వారా! వస్తారు కూర్చోండి. ఈ పాటికే వస్తామన్నారు. వస్తూవుంటారు లెండి" అని తన పనిమీద చక్కా పోయాడు.

సినిమా ప్రారంభమైంది.

ఈ రోజులలో యెవరికి వారుగాని, మిత్రులతోగాని, దంపతులుగాని వెళ్లవల సినదేగాని కుటుంబ సభ్యులంతా కలిసి వెళ్లి చూడడానికి యోగ్యతగా వుండడం లేదు సినిమాలు. అటువంటిది ఆనాటి సినిమా చాలా డీసెంటుగా వుంది. ఇదీ బాగానే వుంది. రాకరాక అందరం వచ్చి నందుకు అని ఆనందించాడు జగన్నాధం.

ఇంటర్వెల్ టైం అయింది.

జనం ఒక్కొక్కరే లేచి బైటకువెడుతున్నారు.

"అయ్యా, తీసుకోండి"అంటూ నలుగురు కుర్రాళ్లు డ్రింకులు పట్టుకువచ్చారు జగన్నాధం వాళ్లూ కూర్చున్నచోటకు వచ్చి.

'ఎవరికైనా కావాలా' అని అడిగాడు జగన్నాధం.

అంతా వద్దన్నారు. అర్ధరాత్రివేళ డ్రింకులేమిటని. "అలాగంటే ఎలాగండీ. ఆ అయ్యగారు మీ అందరికీ యిమ్మన్నారుట" అన్నారు కుర్రాళ్ళు

"ఎవరు చెప్పారు?" అడిగాడు శ్రీను.

'మా మేనేజరుగారు'

'సరే' అంటూ తీసుకుని అందరికీ యిచ్చాడు జగన్నాధం.

"చిన్నప్పటి నుండి శ్రీరాములు స్వభావమే అంత. ఏ పనిచేసినా పెర్ఫెక్టుగా చేస్తాడు. కాలేజీలో ఫంక్షన్లు వచ్చాయంటే ఎంత బాగా నిర్వహించేవాడు! మంచి సమర్థత వుంది"అన్నాడు జగన్నాధం మిత్రుని తెలివితేటలకు మెచ్చుకుంటూ.

బెల్ మ్రోగింది.

బైటకు వెళ్ళిన జనం మళ్ళీ యధాస్థానాలకు వచ్చి కూర్చున్నారు.

"కాళ్ళు మీ యెదుటి సీటుమీద పెట్టకండి."

"సినిమా అయేవరకు మీ టిక్కట్లు జాగ్రత్త పరచండి. ఏ కారణంవల్లనైనా సినిమా ఆగిపోతే మర్నాడు ఆ టిక్కట్లతో ఆట చూపబడును."

"మీరు వెళ్ళేటప్పుడు మీ సీట్లు చూడండి."

స్లైడ్స్ వేస్తున్నారు.

"అదేమిటి?" అన్నారొకరు.

"ఏవైనా మరచిపోతామని మనకు హెచ్చరిక" ఇంకొకరి జవాబు

"బహుశః అందరూ వెళ్ళిపోయాక ఏ వస్తువులైనా దొరికివుండాలి. అందుకే చేసివుంటారు పాపం సినిమావాళ్ళు." అంది ఒక వృద్ధ.

''మా అమ్మాయి చేతిబాగ్ మరిచి పోయింది ఒకసారి" అన్నది ఒకామె.

"మా మనుమరాలి కాలిజోడు పడి పోయింది యెత్తుకున్నప్పుడు. ఇంటికి వచ్చి చూసుకున్నాం. సినిమాలోనే పడి పోయిందో? త్రోవలోనే పడిపోయిందో?" అంటున్నది ఒకామె.

"మీ సైకిళ్ళకు తాళం వెయ్యడం మరచిపోకండి''

హెచ్చరికగా మరొక స్లైడు వేశారు. అది అలానే తెరమీద వుంది.

''సైకిళ్లకి తాళాలు వెయ్యకపోతే పోతున్నాయి కదుటండీ మరి? అందుకే అలాగ హెచ్చరిస్తున్నారు అందరినీ."

''సైకిళ్ళ దొంగతనాలేం ఖర్మం. పల్లెల్లో, పట్నాల్లో యెక్కడ విన్నా దొంగతనాలనే కదా! పగలు 'గంట్లు వేస్తామనో', 'జోళ్ళు బాగుచేస్తామనో', 'ఇంటికి రంగులు వేస్తామనో', 'నూతిలో మట్టి తియ్యమన్నారా,' అనో రావడం, ఎక్కడెక్కడ యేమున్నాయో గ్రహించి రాత్రిళ్లు దొంగతనాలకి రావడం పరిపాటైపోయింది."

''దిక్కుమాలిన రోజులు వచ్చాయి. ఇల్లు తాళం వేసుకుని వెళ్లడానికి భయం కదా పగలైనా సరే" జనం కబుర్లు రొదకింద వినబడుతున్నాయి.

మళ్ళీ ఆట ప్రారంభమైంది.

మొదటి భాగం సరదాగావుంది ఈ రెండవభాగం అంతా నాయిక నాయకుల బాధలు, కష్టాలు ... చివరివరకు సస్పెన్స్‌తో నడిచింది.

హాల్లో రొద సద్దుమణిగింది.

కథ సుఖాంతమే అయింది.

సినిమా అయేసరికి రెండు గంటలు కావస్తోంది.

అందరికీ ఆవలింతలు వరుసగా వస్తున్నాయి. కళ్ళు గులాబీ రంగుగా వున్నాయి.

ఒళ్లు విరుచుకుంటూ జనం బైటపడుతున్నారు.

నాలుగురిక్షాలలో జగన్నాధం కుటుంబం బయలుదేరింది.

గుమ్మంలో రిక్షాల్లు ఆగేసరికి తమ యింట్లో అన్ని దీపాలూ వెలుగుతుండడం చూసి ఆశ్చర్యపోయారు.

"ఆర్పడం మరిచిపోయాం కాబోలు" అంది తల్లి.

"అదేమిటమ్మా! నేను స్వయంగా అన్ని స్విచ్‌లూ ఆఫ్‌చేశాను!" అన్నాడు శ్రీనివాసు.

తలుపు తాళంతీయబోయిన జగన్నాధానికి తలుపున తాళం కనబడలేదు! గడియ తీసేవుంది! తలుపులు ఓరగా వున్నాయి.

గుండెలు చేతపట్టుకుని మెల్లిగా లోపల అడుగుపెట్టారు.

ఇల్లంతా బారుమంటోంది.

ఖాళీచేసి వెళ్ళిపోయినట్లుంది.



"కొంప మునిగిందర్రోయ్" అని తండ్రి కుప్పలాగ కూలిపోయాడు.

ఈ గడబిడకి యెదరింట్లోవాళ్ళు, ప్రక్కయిళ్ళల్లోవాళ్ళు వచ్చారు.

"మీరింకా యిక్కడే వున్నారా? సామానంతా పంపేస్తేనూ మీరూ వెళ్ళారనుకున్నాం. బదిలీ అయిందికదా" అన్నారు వాళ్ళు.

అవాక్కయిపోయారు ఇంట్లోవాళ్ళు!

"మా అబ్బాయి ముచ్చటపడి అందర్నీ సినిమాకు తీసుకువెళ్ళాడు. వచ్చేసరికి యిదీ వరస యిల్లు" నెత్తి మీద రెండుచేతులూ పెట్టుకుని గోడకి అంటుకుపోయాడు రాఘవరావు.

ఇల్లంతా తిరుగుతుండే మతులు పోతున్నాయి ఇంటోవారికి. కంచి, ధర్మవరం, పట్టుచీరలు; టెర్లిన్, నైలాన్, ఫారిన్ నైలెక్స్, షిఫాన్ మొదలైన సిల్కు చీరలు, బ్లౌజులు, స్ట్రెచ్‌లాన్ పాంట్లు, టెర్లిన్, టెరికాట్ పాంట్లు, షర్టులు పెట్టెలతో సహా పోయాయి.

ట్రాన్సిస్టరు ... టేబిల్ ఫాన్ ... స్కూటరు ... ఒకటేమిటి! సర్వస్వం దోపిడీ అయిపోయింది

వాళ్ళనోళ్ళు యిగిరిపోతున్నాయి!

మంచినీళ్ళు త్రాగడానికి గ్లాసుకూడా లేదు.

అవతల రామనాథం లబ్బున మొత్తుకుంటున్నాడు తన యిల్లు దోచుకుపోయారని.

"పట్టపగలే తలుపు తాళంవేసి వెళ్ళటానికి హడలిపోతున్నా కదా! అర్ధరాత్రి ఏమని వెళ్ళారండీ. పోనీ సాయంత్రం ఆటకైనా వెళ్ళలేకపోయారా? ఒక వేళ రాత్రిపూట వెళ్లారే అనుకోండి. ఎవరో ఒకరువుంటే యింత ప్రమాదం జరక్కపోను" అన్నారు ఎదురింటినుండి వచ్చినవాళ్ళలో ఒకరు.

"ఇంకా నయం. ఒక్కరుంటే మాత్రం ఏంచేస్తారు ఇంత దోపిడీకి తలపెట్టినవాళ్ళు అడ్డంవచ్చినవాళ్లను ఏమైనా చెయ్యవచ్చు. సాయుధులయే వస్తారు వాళ్ళు" అన్నారు మరొకరు

"నా చిన్నప్పటి స్నేహితుడు చాలా కాలానికి యీవూరు వచ్చారట. మమ్మల్నందరినీ తప్పకుండా సినిమాకు రమ్మని టిక్కెట్లు పంపించాడు. సరదాగా వెళ్ళాం" అన్నాడు జగన్నాథం. కత్తిపోటుకి నెత్తుచుక్కలేదు అతని ముఖంలో.

"మీరు నిత్యం కోర్టులో వుంటూంటారు రకరకాల కేసులు చూస్తుంటారు. తెల్లవారితే ఎన్నో దొంగకేసులతో వ్యవహరిస్తూనే వుంటారుకదా! ఆ టిక్కట్లు మీ స్నేహితుడే పంపాడని మీకు దాఖలా ఏమిటి?" అని నిగ్గదీసి అడిగాడు ఒక వృద్ధుడు.

"స్నేహితుడు కాకపోవడం ఏమిటండీ? లేకపోతే 'ప్రియమైన జగ్గూ' అని వ్రాస్తాడా?" అన్నాడు జగన్నాథం.

పంపినవాళ్ళకు మీపేరు తెలియడానికి గుమ్మంలో మీ బోర్డువుందికదటండీ! సాధారాణంగా జగన్నాధం అన్న పేరువాళ్ళని ఇంట్లోవాళ్ళుగాని, దగ్గరవాళ్ళుగాని, మిత్రులుగాని జగ్గూ అనడం జరుగుతూంటుంది. ఆ విధంగా నే మిమ్మల్ని సంబోధించి వుండవచ్చును కదా?...అఁహఁ... ఇది నాకు తట్టిన వూహే అనుకోండి...మీరూ ఆలోచించి చూడండి," అన్నాడా వృద్ధుడు.

ఆ మాటలు అందరికీ సమంజసంగానే తోచాయి.

"అసలు ఆ ఉత్తరంలో సంతకం తెలియరావడంలేదండీ గీతలాగవుంది. అన్నయ్య అది శ్రీరాములుదే అన్నాడు, మరీ మరీ పరిశీలించి" అన్నాడు శ్రీను.

ఇవేవీ జగన్నాధానికి వినబడ్డంలేదు.

"ఎక్కడ విన్నా దొంగతనాలనే వింటున్నాం. జోళ్ళు బాగుచేస్తాం అనో, రుబ్బురోళ్ళకు గంట్లు వేస్తామనో, ఇళ్లకు రంగులు వేస్తామనో పగలు రావడం; ఇళ్లలో విషయాలు సొంతం తెలుసుకుని రాత్రిళ్లు దొంగతనాలు, దోపిడీలు చేస్తూండడం పరిపాటైపోయింది. సినిమా హాల్లో జనం చెప్పుకున్న కబుర్లు అతని చెవుల్లో గింగురుమంటున్నాయి.

"అయితే, ఉత్తరం వ్రాసింది శ్రీరాములుకాదా! దొంగా!!"

కొయ్యబారిపోయాడు జగన్నాధం.

---



# చక్రపాణి

కావిలిపాటి విజయలక్ష్మి

(గత సంచిక తరువాయి)

"పద్మావతి ఏమంది? అన్నిటికీ నిరుత్సాహపడకూడదని చెప్పలా! ఆ సూటులో నిన్ను చూడాలని ఉంది నాకు. చాలా అందంగా ఉంటావు. ఏం తీసి ఇవ్వనా?" అడిగింది లాలనగా పసివాణ్ణి అడిగినట్టు

"ఆ అమ్మాయి ఏమనుకుంటుందత్తయ్యా! సినిమా చూడనన్నవాడు సిల్కుసూటు వేసుకు మరీ తయారయ్యాదని నవ్వుకోదూ!" అన్నాడు పాణి, విసుగ్గా.

"అయితే ఆ పాంట్‌తోనా బయటకు వెళ్ళేది? నీకు నీ రూపం కనువించనంత మాత్రాన నలుగురికీ కాస్త నయంగా కనుపించవద్దూ!"

"సరె. ఇయ్యి."

ఆమె అతనికి బట్టలు తీసిచ్చి అవతలికి వెళ్ళిపోయింది.

"పద్మావతీ! పాణీ, నేనూ కాఫీ తీసుకుంటున్నాం నువ్వుకూడా తీసుకోవూ!" అడిగింది అన్నపూర్ణమ్మ.

"ఇప్పుడే కదండీ అర్ధశేరు పాయసం తాగించారు నాచేత. రాత్రి భోజనం చెయ్యాలా, వద్దా చెప్పండి" అంది పద్మావతి, నవ్వుతూ.

"ముఖం ఓసారి కడుక్కుంటావా?"

"ఏం జిడ్డుగా ఉందా?"

"అహా. చల్లగా ఉంటుందని."

"వద్దులెండి," అంది పద్మావతి, ఆమె హడావుడికి నవ్వుకుంటూ.

సాయంత్రం ఆరుగంట లయ్యేసరికి టాక్సీ గుమ్మంలోకి వచ్చింది.

* * *

చక్రపాణి సినిమాకు వచ్చాడని చాలామంది ఆశ్చర్యంగా చూశా రతని వైపు. ఏమిటి చూస్తాడూ! అని గుసగుసలాడి నవ్వుకున్నారు. బాల్కనీ టిక్కెట్లు నాలుగేకాదు ఆ బాక్స్ అంతా ఖాళీగా ఉంచాడు మేనేజరు.

సాయంత్రం కొత్త సినిమా తీసుకురావడం గురించి మాట్లాడటానికి వచ్చాడు మేనేజరు. ఒకవారం ఆడటానికి పదివేలు తీసుకుందామావద్దా! అని అడగటానికి వచ్చాడు.

"నాన్నగారి తర్వాత ఈ వ్యాపారంలో మీకు తెలిసిన లోతుపాతులు నాకేం తెలుసు. మీ ఇష్టం" అనేవాడు పాణి. పాణి అలా అంటాడని మేనేజరుకి తెలుసు అయినా ఓసారి చెబుతూంటాడు. ఎప్పుడో సినిమాహాలు అమ్మేసి ఆ డబ్బు బేంకిలో వేసేస్తే వడ్డీ వస్తుంది అని ఆలోచించాడు పాణి. కాని అందులో పనిచేసే నమ్మకం, అభిమానం ఉన్న నౌఖరులు, వారంతా నిరుద్యోగులవుతారని ఆ ఆలోచన విరమించాడు. తండ్రి పోయి రంగారావూ మేనేజరూ చేసే యాజమాన్యంలో ఏమంత లాభాలు రావడంలేదు. వచ్చిన కొద్ది లాభం సంవత్సరానికోసారి వర్కర్స్‌కి బోనస్‌లని కొంత పంచేస్తాడు పాణి.

అతను టాక్సీ దిగగానే, మేనేజరు కరచాలనంచేసి "చాలా సంతోషం. సాయంత్రం నేను మీ ఇంటికి వచ్చినప్పుడు ఇలా వస్తానని మాటమాత్రమన్నా చెప్పలేదే!" అన్నాడు నవ్వుతూ.

"అప్పటికి అనుకోలేదు," అన్నాడు పాణి

అతనికి సంతోషంగా కరచాలనం చేసి పలకరించేవారు కొందరూ, 'నమస్కారం బాబు!' అనేవారు కొందరూ. కొంచెంసేపు ఊపిరి సలపలేదు. అప్పారావు చెయ్యిపట్టుకొని నెమ్మదిగా అతనితో నడిచి మేడమెట్లెక్కి బాల్కనీలో కూచుంటూ, "అత్తయ్యా! పద్మావతీ! అని..." ఆగిపోయాడు పాణి.

"వచ్చాం బాబూ! కూర్చుంటున్నాం. సరిగా కూర్చో. ఈ బాక్స్ మనం

మాత్రమే. ఎవరూ లేరు. ఫ్రీగా మాట్లాడవచ్చు,'' అంది అన్నపూర్ణమ్మ. ఆమెకు అతను సినిమాకు వచ్చినందుకు సంతోషంగానూ అతనికి కళ్ళు కనుపించనందుకు బాధగానూ ఉంది. గొంతు ఆర్ద్రమైంది.

పాణి పక్కనే కూర్చుంది పద్మావతి. తెరమీద పేర్లు నిర్మాతా, డైరక్టరూ, యాక్టర్లూ, వగైరా పేర్లు, చదివి వినిపించింది. తర్వాత ఆట మొదలయ్యింది.

మౌనంగా కూర్చున్నారందరూ.

"మధ్యలో నెమ్మదిగా మీకు కథ అర్థమయిపోతూంది కదూ!" అంది పద్మావతి అతని చెవిదగ్గర నోరుంచి.

అవుతూందన్నట్టు తల ఊపాడతను.

శిలలపై శిల్పాలు చెక్కినారూ ... పాట వింటూ పాణి చిన్నగా నవ్వి, నెమ్మదిగా, "పద్మావతీ మీరు కావాలనే నన్ను ఈ సినిమాకు తీసుకువచ్చారు కదూ! ఆ హీరో హీరోయిన్‌ని హంపీ తీసుకువెళ్ళినట్లు" అన్నాడు.

ఆమె మౌనంగా ఉండిపోయింది.

వెంటనే హీరో హీరోయిన్ భార్యాభర్తలు. పద్మావతి ఏమనకుందో తన మాట కెలా ఫీలయిందో, అనుకున్న పాణి "క్షమించండి పద్మావతీ! ఆనాలోచితంగా అలా అనేశాను" అన్నాడు.

ఆమె ఈసారీ జవాబివ్వలేదు.

కథలో ఏవో హాస్యంగా చలోక్తులు విన్నప్పుడు పాణిపెదవులు చిరునవ్వుతో విచ్చుకోవడం చూసింది పద్మావతి. అతని వదనంలో ఇదివరకెప్పుడూ తాను చూడని ఆనందాన్నీ, తృప్తినీ కూడా చూసింది.

సినిమా అయిపోయి, జనగణమన వినిపించేసరికి ఒక్కసారిగా లేచినపాణి తూలి పడబోయాడు. చప్పున అతని జబ్బపట్టి ఆపింది పద్మావతి.

మొదటిసారిగా యాదృచ్ఛికంగా అతన్ని స్పృశించిందామె. అతనెందుకో ఆ స్పర్శకి పరవశించా డోక్షణం. అతను సరిగ్గా నిల్చోగానే వదిలేసి బిడియంగా దూరంగా నడిచి నిల్చుంది పద్మావతి.

అతను ఇంటికి వెళ్తూంటే వర్కర్సందరూ సంతోషంగా వీడ్కోలిచ్చి వచ్చిన ప్రతి సినిమాకీ మీరు రావాలి అన్నారు మనస్ఫూర్తిగా.

"పద్మావతీ! ఏమిటో ఇవ్వాళ ప్రపంచంలో నేనూ ఒక మనిషిలాగే బ్రతుకుతూన్నట్టు ఫీలవుతున్నాను. థాంక్స్. మెనీ మెనీ థాంక్స్. స్తంభించిపోయిన నా జీవితంలో మీరు వచ్చాక చలనం ప్రారంభమయ్యింది. మొద్దుగా, విరక్తిగా ఉండే మనస్సుకి ఇవ్వాళెంతో రిలీఫ్‌గా ఉంది," అన్నాడు పాణి.

"థాంక్స్," అని, "నాకు కూడా అలానే ఉంది అస్సలు నాకు బ్రతుకు తెరువు దొరకదనుకున్నాను. నడి సముద్రంలో మునిగిపోయే నాకు ఆశ్రయమిచ్చి, ప్రాణం నిలిపారు మీరు. లేక

పోతే బలవంతాన చచ్చిపోవాలనుకు న్నాను. మీకు నా కృతజ్ఞతలు ఎలా తెలుపుకోవాలో తెలియదు. అస్సలు మీ ఋణం ఎలా తీర్చుకుంటానా? అని అనిపిస్తూంటూంది నాకు ఒక్కోసారి."

"బెంగపడకండి. తీరిపోతుంది. కళ్లు లేని మనిషితో కాలక్షేపం సామాన్యమా. సారీ అలా అనవద్దన్నారు కదూ!" అని నవ్వి, "నాకు పుస్తకాలు చదివి వినిపించడం, నా సమీపంలో కూర్చోవడం విసుగ్గా, చిరాగ్గా ఉండటంలేదా పద్మావతీ!" అడిగాడు పాణి.

"అహ! లేదు. పుస్తకపఠనం విసుగా! మన మధ్య సాధారణంగా ప్రయోజనకరమైన సంభాషణలే సాగుతూంటాయి. ఒక్కోసారి మీ అభిప్రాయాలు నాకు నచ్చవు. మీరు అయితే యజమానీ, నేను నౌకరునూ. కాబట్టి మౌనంగా ఉండిపోతాను."

"అన్యాయం పద్మావతీ! అస్సలు మీరు నాతో మాట్లాడిందెప్పుడు? పోనీ మీకు నచ్చని అభిప్రాయాలేమిటో ఉదాహరణకి ఒక్కటి చెప్పండి," అన్నాడు పాణి నవ్వుతూ.

చక్రపాణి ఇంట్లో డైనింగ్ రూమ్‌లో టేబిలుముందు ఎదరకుర్చీల్లో కూర్చున్న పాణీ పద్మావతీ మధ్య సాగుతూన్న సంభాషణ అది. వింటూ ముసిముసిగా నవ్వుకుంటూంది అన్నపూర్ణమ్మ.

"నేను మాట్లాడలేదని ఒప్పుకుంటున్నాను. కాని, గుర్తుతెచ్చుకోండి. అప్పుడప్పుడు నేను చదివేటప్పుడు 'అహ. అది సరికాదు. మూలం మరో రకంగా ఉండిఉంటుంది. కవి కల్పన పాడుచేశాడు' అనేవారు. మూలం ఎలా ఉందో నాకు తెలియదుకాని ఆ కవి కల్పనే బాగుందనిపించేది నాకు."

"మీరు చర్చించి మాట్లాడితే బాగుండు ననిపించేది నాకు." మనస్సులోని మాట చప్పున అనేశాడు పాణి.

"ఓ అందుకా. అలా అనేవారు. నన్ను మాట్లాడించాలనా!" నవ్వింది పద్మావతి.

"ఆ వాదనేదో రేపు తీరికగా వాదించుకుందురుగాని, అన్నం చల్లారిపోతుంది," అని నవ్వి, పాణి చెయ్యి పట్టుకొని ఎక్కడ ఏ పదార్థం వడ్డించిందో ఆ చెయ్యి తాకించి చెప్పింది అన్నపూర్ణమ్మ.

"మీరూ కూచోండి" అంది పద్మావతి అన్నపూర్ణమ్మను.

"నేను టేబిలుభోజనం చెయ్యనమ్మా. అయినా రాత్రి భోజనం చెయ్యను."

"పోనీ ఫలహారం."

"అరటి పళ్ళున్నాయి, తింటానులే. నువ్వుతిను ముందు. చాలా రాత్రయింది" అంది అన్నపూర్ణమ్మ.

అన్నం కూరా కలిపి నోట్లో పెట్టు

కుంటూ, "రేపు మళ్ళీ ఎన్ని గంటలకు వస్తారు పద్మావతీ!" అడిగాడు పాణి.

"ఇవ్వాళ ఆలశ్యంగా వచ్చానని కదూ అలా ప్రశ్నిస్తున్నారు?"

"పోనీ...అలాగే..." నవ్వాడు.

"రేపు సెలవు తీసుకుంటున్నాను."

"ఎందుకో తెలుసుకోవచ్చా?"

"మీ దగ్గర ఉద్యోగంచేసిన ఇన్ని రోజుల్లో కనీసం ఆదివారమన్నా సెల విచ్చారా?" నవ్వుతూ చనువుగా ప్రశ్నించింది.

ఆమె కొంటెతనానికీ, ప్రదర్శించిన చనువుకీ, పరవశంగా నవ్వుతూ, "అస్సలు మీ ఉద్యోగానికి సెల వుండదు." అన్నాడు పాణి.

"అస్సలు సెలవుల్లేని ఉద్యోగమే ఉండదు "

"ఇలాంటి ఉద్యోగం కూడా ఉండదేమో!"

"నిజమే..." మౌనంగా ఉండిపోయింది పద్మావతి.

కొన్ని క్షణాలు మౌనం తర్వాత "ఊరుకనే అలా అన్నాను పద్మావతీ! మీతో వాదించాలని. రేపు సెలవు తీసుకోండి. ఎప్పుడు కావాలంటే అప్పుడే సెలవు తీసుకోవచ్చు. అయితే నాకు ముందుగా చెప్పాలి. లేకపోతే మీ రాక కోసం నిరీక్షించే కాలం నాకు దుర్భరమై పోతుంది. రారని ముందుగా తెలిస్తే రామనామం జపిస్తూ కూర్చుంటాను," అన్నాడు పాణి.

"నేను సెలవు తీసుకోవటంలేదు పాణిగారూ! తీసుకోను కూడా. నిజం చెబుతున్నాను. మీరు నాకు పరాయి వ్యక్తిగా కనుపించదంలేదేమిటో. ఒక అన్నయ్యలా..."

ఆమె 'అన్నయ్య' అంటే సహించ లేనివాడిలా, ఆమె మాట పూర్తికాక ముందే, "పద్మావతీ!" అన్నాడు వారింపుగా.

అతని భావమేమిటో అర్థంకాని పద్మావతి, మళ్ళీ "నిజం. ఒక ఆత్మీయుడిలా అనిపిస్తున్నారు నాకు. మీలో గూడుకట్టుకున్న విరక్తినీ, జీవితమంటే ఏవగింపునీ, పూర్తిగా తొలగించేవరకూ నిద్రపోగూడదనిపిస్తుంది. మీకు జీవితం మీద తీపి కలిగించాలి మనిషి ఎప్పుడూ చావలేక బ్రతుకుతూన్నట్టు వీలవుతూంటే నేను సహించలేను "

"మరి గ్రుడ్డివారెలా బ్రతుకుతారు పద్మావతీ!" నవ్వాడదోలా పాణి

నాలుగుక్షణాలతని కేమీ జవాబు చెప్పలేకపోయింది పద్మావతి. తర్వాత నెమ్మదిగా, "అస్సలు మనిషిగా జన్మించినందుకే సంతోషించాలి, నిజంగా ఆలోచిస్తే," అంది

"ప్రపంచాన్ని చూసే కళ్ళున్న ప్రతి ప్రాణీ అదృష్టమైనదే అంటాను నేను."

"మీ మాట కాదనలేను కాని, ప్రతి

క్షణం అలా ఆలోచించకూడదని నా అభిప్రాయం. ఆలోచించినందువలన ప్రయోజనమేమిటి చెప్పండి. నిస్పృహ, జీవితంమీద విరక్తి. అన్నం సహించక పోవటం, నిద్రపట్టకపోవడం. అంతేగా!"

అతను మాట్లాడలేదు గబగబా భోజనం ముగించాడు.

శ్రోతగానే మిగిలిపోయిన అన్నపూర్ణమ్మ, "పద్మావతీ! పదిన్నర దాటింది. ఇవ్వాల్టికి ఉండిపోరాదూ!" అడిగింది.

"లేదు, వెళ్ళిపోతాను," అంది పద్మావతి కడిగిన చేతులు కర్చీఫుతో తుడుచుకుంటూ.

"వెళ్ళిపోనీ అత్తయ్యా. టాక్సీవాడికి చెప్పాను, ఈమెను రంగారావుగారింటికి తీసుకెళ్ళమని. మాటల సందట్లో మరచే పోయాను, ఆ సంగతి. అతను పద్మావతి కోసం వెయిట్ చేస్తూ ఉంటాడు," అన్నాడు పాణి.

"మరి సెలవ్. నేను ఏమన్నా పొరపాటుగా మాట్లాడిఉంటే క్షమించండి పాణిగారూ!" అని వెళ్ళిపోయింది పద్మావతి

పద్మావతిని పాణికి భార్యగా చేసుకోవడమంటే అంతగా సరిపెట్టుకోలేని అన్నపూర్ణమ్మ, కొందరు మధ్యవర్తుల ద్వారా సంబంధాలు వెతుకుతూంది. మేనేజర్నీ, రంగారావునీ పాణికి నచ్చ జెప్పండని బ్రతిమిలాడుతూంది ఇవాళ ఇక తొందరలో పాణికి పెళ్ళిచెయ్యాలని అనుకుంది దృఢంగా.

* * *

ఉదయం చక్రపాణికి టిఫిను ప్లేటు అందిస్తూ, "నిన్న మేనేజరుగారూ వాళ్లూ ఎందుకు వచ్చారు?" అడిగింది అన్నపూర్ణమ్మ.

"ఏదో సినిమా తీసుకువస్తామని చెప్పారు. తర్వాతేముంది? పాతపాటే." నవ్వాడతోలా.

"ఆ పాతపాటకు జవాబేంచెప్పావు?"

"పాత జవాబే."

"మొన్న సాయంత్రం దేవాలయంలో ఆ అమ్మాయిని చూశాను. చాలా బాగుంటుంది. అణకువగల పిల్లగా కనిపిస్తుంది."

అతను మౌనంగా టిఫిను తినసాగాడు.

"పాపం చాలా పేదవాళ్ళట." రెండు క్షణాల తర్వాత అంది అన్నపూర్ణమ్మ.

"ఏమన్నా డబ్బు సహాయం చేద్దామా?" అన్నాడు పాణి.

"మాట దాటెయ్యాలని చూడకు పాణీ! నేను ఎన్నాళ్ళు బ్రతికిఉంటాను చెప్పు? నేను పోయాక నిన్నెవరు చూస్తారు. కాదనకు. రేపు వారింటికి కబురుచేసి ఆ సంబంధం సెటిలుచేయిస్తాను."

"అనవసరంగా, ఆ అమ్మాయి

గొంతుకొయ్యాలనిఆలోచనలు చెయ్యకం డత్తయ్యా! పాపం, డబ్బులేనంత మాత్రాన్న, ఆమెకు ఏవేవో కోరిక లుండకపోవు."

"ఆ అమ్మాయి నిన్ను పెళ్ళిచేసు కోడానికి మనస్పూర్తిగా అంగీకరించిం దట."

గలగలా నవ్వి, "ఎంత అమాయకు రాలివత్తయ్యా! నన్ను పెళ్ళిచేసుకోడా నికి ఎందుకు అంగీకరిస్తుంది? నా ఆస్తి పాస్తులూ, ధనంచూసి, అందమైన చీరలూ నగలూ ధరించి దర్జాగా బ్రత కొచ్చని. అంతేకాని గుడ్డిమొగుడిమీద మోజుంటుందా! అతన్ని ఖాతరు చేస్తుందా? వద్దొద్దు, అలాంటి ప్రయత్నం చెయ్యకు," అన్నాడు పాణి.

"నీదంతా ఛాదస్తం. నిన్నెందుకు అలుసుగా చూస్తుంది? కళ్ళులేనంత మాత్రాన్న చదువూ సంస్కారంలేని వాడివా?"

"చదువూ సంస్కారం కొద్దోగొప్పో ఉన్నవాడిని కనుకే, ఓ అమాయకురా లైన అమ్మాయి మెడలో తాళి కట్టడా నికి సాహసించలేక పోతున్నాను."

"ఎంత చెప్పినా కాదనేతప్ప, అర్థం చేసుకు అఘోరించవు. నేను చస్తే నీకేది దారిరా! నిన్నెవరు చూస్తారురా!"

"శశి దగ్గరకు పోతాను."

"దాని మరిది ఎవరితోనో అన్నాట్ట. దాని కాపురం అమెరికాలోనే స్థిరపడే ట్టుంది."

"చచ్చిపోతాను — సరా!" టిఫిను ప్లేటు విసిరేశాడు పాణి.

"ఈసారి ఆ ప్రసక్తి తెస్తే - నన్నను." అని రోషంగా, విసురుగా అక్కడినుంచి వెళ్ళిపోయింది అన్న పూర్ణమ్మ.

తర్వాత పనిమనిషి ప్లేటు తీసుకొని వెళ్ళిపోయింది.

ఆరోజు అతను సరిగ్గా భోజనం చెయ్యలేదు. అన్నపూర్ణమ్మతో మాట్లా డనూలేదు. అతని మనస్సు కలవరంగా చిరాగ్గా ఉంది. అందుకు శశి దగ్గరనుంచి ఉత్తరం రాకపోవడంకూడా ఒక కార ణమే.

సాయంత్రం మామూలుగా పద్మావతి వచ్చింది. కాని పాణి సాధారణంగా కూర్చునే ఆఫీసుగదిలో లేకపోయేసరికి లోపలికివెళ్ళి, "పిన్నిగారూ చక్రపాణి గారు ఎక్కడ ఉన్నారు?" అనడిగింది అన్నపూర్ణమ్మని.

"ఆ గదిలో ఉన్నాడు," అంటూ చెయ్యిచాపి ఓ గదివైపు చూపించింది అన్నపూర్ణమ్మ.

అది అతని పడకగదని గ్రహించిన పద్మావతి గుమ్మంలో నిల్చుని, "నిద్ర పోతున్నారా?" అనడిగింది.

"లేదు. పిలువమ్మా మేలుకునే

వ

ఉన్నాడు. ఫర్వాలేదు," అంది అన్నపూర్ణమ్మ.

తడబడే అడుగులతో సంకోచంగా అతని గదిలోనికి వెళ్ళింది పద్మావతి.

వెల్లకిలా పడుకుని కళ్ళపై రుమాలు కప్పుకున్నాడు పాణి. అతను మెలకువ గానే ఉన్నాడని గ్రహించిన పద్మావతి "ఏం పడుకునిఉన్నా రివాళ? ఆరోగ్యం బాగుండలేదా?" మృదువుగా ప్రశ్నించింది.

అతను సంభ్రమంగా కదిలి లేచి కూర్చుని కళ్ళజోడుకోసం దిండు దగ్గర చేతుల్తో తడమసాగాడు.

విశాలంగా అందంగా ఉన్న అతని కళ్లవైపు ఆశ్చర్యంగా చూస్తూ, కళ్ళజోడు తీసి అతని చేతికిస్తూ, "ఇవిగో కళ్ళద్దాలు పాణిగారూ. నిజంగా మీ కళ్ళు..." అని చప్పున ఆగిపోయింది పద్మావతి.

"కనుపించవా అంటారు. నా కళ్ళు అందంగా ఉన్నాయి అవునా? నా కనుపాపలో మీ ముఖం కనుపిస్తుందా చూడండి," అన్నాడు.

నిజమే అతని కనుపాపపై పాకుడు కట్టినట్లున్న తెర. "కళ్ళజోడు పెట్టేసుకోండి. ప్చ్. పాపం." అంది పద్మావతి.

రుమాలుతో ముఖం తుడుచుకుని కళ్లద్దాలు పెట్టుకుంటూ చిన్నగా నవ్వి, "శారీరకంగా అనారోగ్యమేమీ లేదు. మానసిక ఆరోగ్యం మామూలే," అన్నాడు.

"అంటే?"

"మీరు నిల్చునే మాట్లాడుతున్నారులా ఉంది. అలా కుర్చీమీద కూర్చోండి. గదిలో కుర్చీ ఉందికదూ!" అన్నాడు పాణి.

మంచం పరుపుమీద పరిచిన తెల్లని దుప్పటి తలవైపున రెండు దిళ్లూ, గళ్ళ లుంగీ, కట్‌బనియనూ, చెరిగిన క్రాఫూ, ఆలోచనలతో అలసినట్టున్న వదనం, పాణివైపు పరిశీలనగాచూసిన పద్మావతి అతని ఎదర కుర్చీలో కూర్చుంటూ, "కూర్చున్నాను లెండి. నా ప్రశ్నకు జవాబు" అంది నవ్వబోతూ.

"మా శశిదగ్గరనుంచి చాలా రోజులై ఉత్తరం రాలేదు అదొక కారణం."

"శశంటే? ... ఆమె ఎక్కడ ఉన్నారు?"

"మా చెల్లెలు. అమెరికాలో ఉంది."

రెండు క్షణాల తర్వాత—నవ్వుతూ, "మరొక కారణం?" అని ప్రశ్నించింది పద్మావతి.

"నా పెళ్ళిమాటలు."

ఒక్కసారి అతనివైపు ఆశ్చర్యంగా చూసింది పద్మావతి. ఇతనికి పెళ్లా! అన్నట్టు. "ఎందుకు చేసుకోకూడదు? ఆస్తి, అంతస్తూ ఉంది - అనిపించింది తర్వాత. మౌనంగా ఉండిపోవడం బాగుండదనుకొని, "కంగ్రాచ్యులేషన్సు



యు

పాణిగారూ! సెటిలయ్యిందా? ఎప్పుడు పెళ్ళి?" అడిగింది పద్మావతి.

"నన్ను పెళ్ళిచేసుకోమంటారా పద్మావతీ! మీరుకూడా అత్తయ్యలా... ఆమె అంటే పాతకాలపు మనిషి. కాని... మీరు...''

"అవతలి అమ్మాయి సంతోషంగా అంగీకరించినప్పుడు మీరు పెళ్ళిచేసుకోవడంలో తప్పేముంది?"

"ఆ, అలా దారికి రండి. ఏ అమ్మాయి సంతోషంగా నన్ను భర్తగా స్వీకరిస్తుంది చెప్పండి! నా ఆస్తిచూసి ఒప్పుకోవచ్చు అస్సలు నాకు పెళ్ళే ఇష్టంకాదు. సరే దానికేంగాని, రంగారావుగారు నేను సినిమాకు వెళ్ళానంటే ఏమన్నారు? నవ్వారా?"

"నవ్వటమెందుకు? ఆయన అనుకుంటున్నారట. మీరింకా చాలా మారిపోతారని ఇదివరకైతే డల్‌గా ఉండేవారట కాని ఇప్పుడేదో మీలో కొత్త ఉత్సాహం కనిపిస్తూందట.''

''కారణమేమిటో చెప్పారా?''

''ఏముంటుంది కారణం? మీరు వ్యాపారస్థులుగా! ఈ సంవత్సరం బాగా లాభాలొచ్చుంటాయి అన్నారాయన. కాని నాకు అలా అనిపించలేదు."

"ఏమనిపించింది మీకు?"

"మిమ్మల్ని ఒంటరిగా వదిలేస్తూన్న కారణంగా డల్‌గా కనుపించేవారని. కొంచెంసేపు ఎవరన్నా మీతో కబురు చెప్పి కాలక్షేపంచేస్తే, మీకు తృప్తిగా సంతోషంగా ఉంటుందని."

"నిజం మీరు ఊహించినదే నిజం. మరొకలా అపార్థం చేసుకోకండి. మీతో కబుర్లుచెబుతూ ఉంటే నాకు సమయం తెలియకుండా గడిచిపోతుంది. గుడ్డివాడినని మరచిపోతూంటాను.''

'థాంక్స్. మీరాసంగతి క్షణమన్నా మరిస్తే నాకు మీరిచ్చే జీతం వృధా అయినట్టుకాదు "

"నిన్న సినిమాలో హీరో ఎలా ఉన్నాడు పద్మావతీ?"

"మీలా ... అందంగా ... ఆకర్షణీయంగా," అనాలోచితంగా అనేసి చప్పున నాలిక కరచుకొని, మౌనంగా ఉండిపోయింది పద్మావతి. అతను తనను చూడలేదని తెలినా అతనివైపు చూడటానికి సిగ్గుపడింది.

"ఆ మౌనంలో ఆమె అలా సిగ్గుపడి ఉంటుందని గ్రహించిన పాణి, "ఇవాళ ఏదన్నా పత్రిక చదవండి. పాతదన్నా సరే," అన్నాడు మాట మార్చేస్తూ.

"అరే, అలా నిన్ననే చెప్పుంటే తెచ్చేదాన్ని. మీ ఇంట్లో ఏమన్నా ఉన్నాయా?"

"అత్తయ్య నడగండి - ఉండవనుకుంటాను."

"ఏదన్నా పాతపత్రిక ఉంటే ఇవ్వండి. పాణిగారు చదవమంటున్నారు." అని అడిగిన పద్మావతితో

"అమ్మాయ్, ఈ టిఫిను ప్లేటు మా పాణి చేతికియ్యవూ! అప్పారా వీపూట ఎందు కనో వాడికేమయిందో ఇప్పటివరకూ పనిలోకి రాలేదు. నా మాట వింటూనే మండిపడుతున్నాడు. ఉదయం టిఫిను ప్లేటు విసిరికొట్టాడు. మధ్యాహ్నం అన్నం అలా అలా కెలికి లేచిపోయాడు. ఇప్పటిదాకా పడకవేశాడు. పెద్దముండని ఎప్పుడు చస్తానో, పెళ్ళిచేసుకో అనడం తప్పా! నే నెల్లకాలం వీణ్ణి కనిపెట్టుకుని ఉండిపోతానా? నా తర్వాత ఆ చెల్లె లేదో ఆదుకుంటుందనుకుంటాడు వెర్రి వాడు. అది రెండు ఉత్తరాలు వ్రాసిం దప్పుడే! వాళ్ళు అమెరికాలో స్థిరపడి పోవాలని నిర్ణయించుకున్నారట. వాడితో పాటు నేనూ ఉత్తరం రాలేదంటున్నాను కాని నాలుగురోజుల క్రితమే వరసగా రెండు ఉత్తరాలూ వచ్చాయి. ఈ సంగతి తెలిస్తే మనసు పాడుచేసుకుంటాడు," అని వెక్కి వెక్కి ఏడవటం మొదలు పెట్టింది అన్నపూర్ణమ్మ.

"నెమ్మదిమీద నేను చెప్పిచూస్తాను పిన్నిగారూ! బాధపడకండి. ఏదీ, టిఫిను ఇస్తానన్నారు, ఇవ్వండి," అంది పద్మా వతి, సానుభూతిగా.

ఒక మిఠాయి ఉండా, నాలుగు వడలూ ఒక ప్లేట్లో పెట్టి పద్మావతి చేతి కిస్తూ, "ఉండు నీకూ ఇస్తాను," అంది అన్నపూర్ణమ్మ.

"అహ, నేనేం ఇప్పుడు తీసుకోను గాని, పాతదేమన్నా పత్రిక ఉంటే చూసి తీసుకురండి. ఏదో చదివి వినిపించి ఆలోచన మళ్ళించాలాయనకు," అని చెప్పి టిఫిను ప్లేటు తీసుకొని పాణి గది లోకి వెళ్ళింది పద్మావతి.

అడుగుల సవ్వడి వినిపించి "పద్మా వతీ!" అన్నాడు పాణి.

"ఆ, నేనే. ఈ టిఫిను తీసుకోండి. ఈ లోపల పత్రికచూసి తెస్తారు."

"మీచేతికి టిఫినిచ్చిందా అత్తయ్య." నవ్వాడదోలా పాణి.

"ఏం తీసుకోరా? మీ రీ టిఫిను తీసు కోకపోతే!..."

"అ. తీసుకోకపోతే? అస్సలివాళ ఏమీ తినాలనిలేదు పద్మావతీ! చచ్చి పోవాలని ఉంది. నాకు కళ్ళే కనిపిస్తే ఏ పాయిజనో మింగి ప్రాణం తీసుకునే వాడిని."

"కళ్ళే ఉంటే కథ వేరుగా ఉండేది. నా కీ ఉద్యోగం ఇచ్చేవారా? ఇలా బాధ పడేవారా? హాయిగా దర్జాగా బ్రతికే వారు. ప్చ్. పాపం" అని, మళ్ళీ గొంతు మార్చుకుంటూ, "సరే తింటారా లేదా? మీరు చాలా వీక్‌గా కనిపిస్తున్నారు."

"చెప్పానుగా?" అతను కళ్ళజోడు తీసుకుని కళ్ళు తుడుచుకుని మళ్ళీ కళ్ళ జోడు పెట్టుకున్నాడు.

"సర్లెండి. నేను వెళ్ళిపోతాను."

"పద్మావతీ!..."

అతన్ని చూస్తూన్న ఆమెహృదయం

జాలితో ద్రవించింది. అందం, మంచి మనస్సు, సంస్కారం - ఇచ్చిన దేవుడు - ఘోరంగా కళ్ళు పోగొట్టి కసి తీర్చుకున్నాడులా ఉంది అతనిపైన అనిపించిన పద్మావతికి దేవుడిమీద కోపం వచ్చింది.

చొరవగా అతని చేతిని పట్టుకొని ఆ చేతిలో ప్లేటుంచుతూ, "తీసుకోవాలి. నా కీ ఉద్యోగం బాధగా, కష్టంగా ఉండకూడదు. మీరు సంతోషంగా దిగులులేకుండా ఉంటేనే మీ ఎదుట నేను నిలువగలుగుతాను," అంది పద్మావతి ఆర్ద్రస్వరంతో.

ప్లేట్లోని వస్తువులు తడిమిచూసి, "నిజంగా అత్తయ్య చచ్చిపోతే నేను ఏ అనాధ ఆశ్రమంలోనో చేరిపోవాలి. పిచ్చి అత్తయ్య! ఇన్ని నేను తినగలననే అనుకుందా? మీరుకూడా తీసుకోవాలి," అన్నాడు.

ఆమె కాదు. వద్దు అనలేదు "ఇదిగో తీసుకుంటున్నాను. మీకు అనుమానం వస్తుందేమో! మీరే ఇవ్వండి." అని మళ్ళీ చెయ్యి వెనక్కి తీసుకుంది పద్మావతి.

రెండు వడలుతీసి ఆమెకిచ్చాడు పాణి. ఆమె మౌనంగా తీసుకుని తినేసి చెయ్యికడుక్కుని కూజాలో నీళ్ళు గ్లాసుల్లోకి వంచి "ఇదిగో మంచినీళ్ళు," అంది పాణి దగ్గరలో నిల్చుని.

అతను చెయ్యి ముందుకు చాచి గ్లాసందుకుని "థాంక్స్." అన్నాడు.

రెండు కాఫీకప్పులతో ఆ గదిలో ప్రవేశించిన అన్నపూర్ణమ్మ పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి.

ఆమె చేతిలోని కాఫీకప్పు తీసుకొని, "ఇదిగో కాఫీ" అంది పద్మావతి.

అతను మౌనంగా చెయ్యిచాపాడు.

తానొక కప్పు తీసుకుంటూ, "పిన్నిగారూ! నాకు మధ్యాహ్నం రెండవసారి కాఫీ అలవాటు చేస్తున్నారు," అంది పద్మావతి నవ్వుతూ.

"మరేం పర్వాలేదు. నే నిస్తాలే. టిఫిను తీసుకుందువుగాని రా."

"మీరిచ్చిన టిఫిను మా ఇద్దరికీ సరిపోయిందిగాని, పత్రిక ఏదన్నా దొరికిందా?"

"ఇదిగో చూడు. ఏనాటిదో వారపత్రికలా ఉంది." అంటూ ఓ పత్రిక పద్మావతికి ఇచ్చి వెళ్ళిపోయింది అన్నపూర్ణమ్మ.

"ఎప్పటిదా పత్రిక?" అడిగాడు పాణి.

చెప్పింది పద్మావతి.

నవ్వి, "మా శశి చదివేరోజుల్లో కొన్నది అయిఉంటుంది. సరేమంచి కథ ఏదన్నా ఉంటే చదవండి."

పుస్తకంలో పేజీలు అటూ ఇటూ తిరగేసిచూసి, "ఏప్రిల్ ఫూల్‌ట. ఏదో గమ్మత్తు కథలాఉంది. చదవనా?" అడిగింది.

"చదవండి." అన్నాడు పాణి.

చదువుతూంది పద్మావతి. అతను మధ్య మధ్య నవ్వుతూ ఆ కథ ఆసక్తిగా వింటున్నాడు.

కథ సారాంశం ఇది. గుర్నాథం సామాన్యమైన గుమస్తా. మార్చి ముప్ఫై తేదీన అతనికి ప్రమోషను వచ్చిందనీ, ఏప్రిలు వస్తున ఆర్డర్లిస్తారనీ, తోటి గుమస్తాలంతా నమ్మబలికారు. నమ్మాడు గుర్నాథం. మర్నాటినుంచీ తాను ఆఫీసరు. అనుకున్న గుర్నాథం ఇంట్లో కాఫీగ్లాసుల దగ్గరనుంచి అన్నీ మార్పులు చెయ్యాలని హడావుడిపడి, మరొక పెద్ద ఇల్లు అద్దెకు మాట్లాడుకుని, నానా హైరానా పడతాడు. మర్నాటి ఉదయం ఆఫీసుకెళ్ళడానికి ప్రత్యేకంగా తయారవ్వాలని తనకున్న నాలుగు జతల్లో ఓ పాంటూ షర్టూ తొడుక్కొని, ఇవ్వాళ గుమస్తాలా సైకిలు తొక్కుకుంటూ ఆఫీసుకు వెళ్లటమేమిటని, రిక్షా ఎక్కాడు. తోవలో అతన్నిచూసిన ప్రతివారూ చిన్నగా నవ్వుతున్నారు. ఎందుకు నవ్వుతున్నారో తెలియని గుర్నాథానికి కోపం వస్తూంది. ఒక్కొసారి తానూ బదులుగా నవ్వేస్తున్నాడు. వెధవప్రపంచం ఎదుటివాడు బాగుపడితే చూసి ఓర్వలేదు. నా ప్రమోషను సంగతి వీరికెలా తెలిసిందో వెధవలు నవ్వుతున్నారు, అని తిట్టుకుంటున్నాడు. ఆఫీసు దగ్గర రిక్షా ఆగింది. అతన్ని చూసిన హెడ్‌గుమస్తా పకాల్న నవ్వేసి గబగబా లోపలికెళ్ళిపోయాడు. వళ్ళు మండిపోయింది గుర్నాథానికి. 'ఏమనుకున్నాడో ఇవ్వాళనుంచీ గుర్నాథం గుమస్తాకాదు. నీ పని పట్టిస్తాను చూడు అని కసిగా రిక్షా దిగి రిక్షావాడి చేతులో డబ్బులు పెట్టాడు వాడెందుకో విరగబడి నవ్వుతున్నాడు.' అందర్నీ వెయ్యలేని ప్రశ్న రిక్షావాణ్ణి వేశాడు గుర్నాథం. 'రాస్కెల్ ఎందుకురా! అలా నవ్వుతున్నావ్? కళ్ళు నెత్తికొచ్చాయా?' అని. వాడు అలా నవ్వుతూనే కొంచెం ఆగి "నేదండి. మీరు వంట్లానికి బొత్తాములు పెట్టుకోవడం మరిచిపోనారండి ' అన్నాడు. అది చదివేసి చప్పున అవతలి కెళ్ళిపోయి నవ్వుతూంది పద్మావతి.

కదిలి కదిలి నవ్వుతున్నాడు పాణి.

"పద్మావతీ! ఏమిటమ్మా! ఇద్దరూ అలా నవ్వుతున్నారు! నీ చేతుల్లో ఏ మంత్రముందోకాని మా వాణ్ణి నవ్వించావే! నాక్కూడా ఆ సంగతేదో చెప్పరాదూ!" అంది అన్నపూర్ణమ్మ.

"ఇదిగో ఈ కథ చదవండి" అని పుస్తకం ఆమె చేతికిచ్చేసి, "మరివ్వాళ ఆయన ఎదరపడలేను బాబూ! వెళ్ళిపోతాను. పాణిగారికి వెళ్ళిపోయానని చెప్పండి." అంది పద్మావతి.

"ఏమిటుంది ఇందులో కాస్త చెబుదూ నువ్వే నవ్వక."

క్లుప్తంగా చెప్పి మళ్ళీ నవ్వసాగింది పద్మావతి.

"పీడి హడావుడి మండా! లోపల డ్రాయరు వేసుకోలేదు కాబోలు," అని ఆమె కూడా నవ్వింది.

"నేను వెళ్ళిపోయానని చెప్పండి. నాకీ నవ్వు ఆగటంలేదు. మిగతా కథ మీరు చదివి వినిపించేయండి బాబూ! ఇంకేం రాశాడో ఆ రచయిత," అని అన్నపూర్ణమ్మ పిలుస్తూఉన్నా వినిపించుకోకుండా వెళ్ళిపోయింది పద్మావతి

కొంచెంసేపు పోయాక, "పద్మావతీ! పిల్చాడు పాణి. అలా అంత గట్టిగా చనువుగా అతను పిలవడం అదే మొదటి సారి

''లేదు బాబూ! వెళ్ళిపోయింది. నీతో వెళ్ళిపోయానని చెప్పమంది. మిగతా కథ నన్ను చదివి వినిపించమంది," అంది అన్నపూర్ణమ్మ అతని గదిలోకి వస్తూ.

ఇంతమాత్రానికే సిగ్గా! అని మళ్ళీ కథ జ్ఞప్తికివచ్చి నవ్వుతూ "మిగతా కథ రేపు తానే చదువుతుందిలే. ఆ పుస్తకం టేబులుమీద ఉంచు. అస్సలీ పద్మావతి మనింట్లో ఉండిపోతే బాగుండును," అన్నాడు పాణి.

తనమీద ఉదయంనుంచీ ఉన్న కోపం పోయి, మామూలుగా మాట్లాడుతూన్న పాణివైపు చూసి నవ్వుతూ, నాకూ అలానే అనిపిస్తుంది. ఆ అమ్మాయి ఉన్నంతసేపూ నువ్వీ ప్రపంచంలో ఉన్నట్లుండవు. నిన్ను నువ్వు మరచి హాయిగా సంతోషంగా ఉన్నట్లు కనుపిస్తావు."

"నిజమే అత్తయ్యా! కాని ఆమె ఏమనుకుంటుంది? మనం అలా అడిగితే ఏమైనా అపార్థంచేసుకోవచ్చు."

"పోనీ ఆమెను శాశ్వతంగా ఈ ఇంట్లో ఉంచేసుకునే ఏర్పాటేమైనా రంగారావుగారు చేస్తారేమో అడగనా?"

"వద్దు తొందరపడి నోరు జారేవు సుమా! పద్మావతి ఈ ఇంటి ఛాయలకు కూడా రాదు.సరి, పోయి పనిచూసుకో." అని మళ్ళీ రేపు సాయంత్రంకోసం నిరీక్షణ అనుకుని దీర్ఘంగా నిట్టూర్చి, మంచంమీద వెల్లకిలా పడుకున్నాడు పాణి.

అతని ఆలోచనలన్నీ పద్మావతి చుట్టూ అల్లుకుపోయాయి. తనకే అనర్థం రాకుండా ఉంచే! కొన్ని క్షణాలకి అతని వదనం అలసటగా పీక్కుపోయింది.

* * *

మరి కొన్నిరోజులు దొర్లాయి! పాణి మునపటిలా విరక్తిగా నిస్పృహగా ఉండటంలేదు. పద్మావతితో చనువుగా మాట్లాడుతున్నాడు. ఏం మాట్లాడితే ఏమనుకుంటుందో అనే భయంపోయింది. అలా అని అతని హద్దులుమీరి ఏమీ మాట్లాడడు.

అవాళ సాయంత్రం ఆరుగంటలకు రంగారావుగారింటికి వచ్చింది పద్మావతి.

మనేజరు థామస్న పంతాలూ, రంగా రావూ ఏవో గుసగుసలాడుతున్నారు. గదిలో కూర్చుని అతనెంతసేపై వచ్చాడో తెలియదుకాని, కాఫీకప్పులూ,ఫలహారపు ప్లేట్లూ నూతిచప్టామీద పనిమనిషి కడుగుతూంది.

సినిమా మేనేజరు ఇక్కడి కెందుకు వచ్చాడు? ఏమన్నా మాట్లాడవలసి ఉంటే వ్యాపార విషయాలు చక్రపాణి సమక్షంలోనే మాటలు జరగాలికదా! వీరంతా కలసి చక్రపాణిగారిని మోసం చేస్తున్నారేమో అనే అనుమానం వచ్చింది పద్మావతికి. కాని రంగారావు వ్యక్తపరిచే మంచితనాన్నీ తనకు నిస్వార్థంగా చేసిన ఉపకారాన్నీ గుర్తు తెచ్చుకుని అప్పటికా అనుమానాన్ని త్రోసిపుచ్చింది. చీకటిపడిన తర్వాత వెళ్ళిపోయాడు మేనేజరు. మేనేజరు వెళ్ళిన వెంటనే తన పడకగదిలోకెళ్ళి బీర్వా తాళాలుతీసి ఏదో కాయితపు పొట్లం బీర్వాలో రంగారావు దాచడం పద్మావతి దృష్టిని దాటిపోలేదు. మళ్ళీ ఆమెకు అనుమానం మొలకెత్తింది. ఏమో ఎవరినిమాత్రం నమ్మగలం? అతి నమ్మకంగా, మంచితనంగా, స్నేహంగా ఉంటూనే మోసంచేసే నీచులు ఎంత మందిలేరీ లోకంలో. చెల్లెమ్మా! అని ఆత్మీయంగా పిలిచే రామదాసు క్షణంలో ఎలా మారిపోయాడు? ఈ మంచితనం, స్నేహం, నిప్పులాటివారి నిజస్వరూ పాన్ని నివురులా కప్పి ఉంటాయి అంతే. రంగారావూ, మేనేజరూ, అంతా కలసి కుట్రచేసి అతని ఆస్తి కాజేస్తారేమో! ఆస్తి లేకపోతే చక్రపాణిగారేమై పోతారు? లేదు. అలా జరగటానికి వీల్లేదు. నేను చక్రపాణిగారిని వీరి మోసానికి గురికాకుండా కాపాడాలి, అనే ఆవేశం వచ్చింది పద్మావతికి. మళ్ళీ మేనేజరూ, రంగారావూ అనుభవజ్ఞులు నిజాన్ని అబద్ధంగా, అబద్ధాన్ని నిజంగా మార్చి చెప్పగల నేర్పరులు. వ్యాసమూర్తిగారి వ్యాపారం చెయ్యితిరిగి తలనెరసిన నారాయణ, తాశీల్దారీచేసి రిటైరయిన వారీయనక్కే చక్రపాణిగారు నమ్మిన వీరిద్దరూ, కంచే చేను మేసినట్టు వీరే అతన్ని మోసగించాలను కుంటే!? ప్చ్. పాపం అతనేం చెయ్యగలడు? కాదు రేపు వారి ఆస్తి పాస్తులూ, వ్యాపార వ్యవహారాలూ ఏమిటో తెలుసుకోవాలి.

ఆ రాత్రంతా ఆమె కివే ఆలోచనలతో నిద్రపట్టలేదు

ఉదయం, "పద్మావతీ! ఏమిటలా ఉన్నావ్? ఆరోగ్యం బాగుందా?" ప్రశ్నించాడు రంగారావు.

చంపేశాడు. మనిషిలో మనస్సు చదవగలడులా ఉంది. అనుకున్న పద్మావతి నవ్వేస్తూ, "తలనొప్పిగా ఉంది నిన్నరాత్రి నిద్రపట్టలేదు" అంది.

తర్వాత చక్రపాణి స్వవిషయాల్లో

ఇతని కెంతవరకూ జోక్యం ఉందో తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో, "అన్న పూర్ణమ్మగారు చక్రపాణిగారికి పెళ్ళి చెయ్యాలనుకుంటున్నారులా ఉంది," అంది రంగారావు వదనంలోకి పరిశీలనగా చూస్తూ.

"అతను చేసుకోడు" అన్నాడు ఉక్కున.

"చేసుకుంటే మంచిదే కాని మీ రన్నదే నిజమేలా ఉంది. ఆయన ఒప్పు కోవడం లేదట."

"ఇది చాలా రోజులై అనుకుంటూన్న దేనమ్మా! నేను చాలా రకాలుగా చెప్పి చూశాను అతను వప్పండే ఏంచేస్తాం!"

"వ్చ్ పాపం. మీరు తండ్రిలా ఆయన్నీ, అతని బిజినెస్‌నూ ఓ కంట కనిపెడుతున్నారు కనుక, కాని లేకుంటే?"

"అబ్బో! పాణి తెలివితక్కువ వాడనా నీ అభిప్రాయం? కాయితాల మీదుండే జమాఖర్చులు అతను నోటితో చెప్పేస్తాడు," అన్నాడు రంగారావు తేలిగ్గా నవ్వేస్తూ.

"ఏమోకాని అతన్ని చూస్తూంటే నాకు జాలిగా ఉంటుంది. పాపం! చాలా మంచివారు. లోకంలోని మనుషులంతా మంచివారే అనుకుంటారు మాయ, మోసం ఉండదనుకుంటారు."

"నువ్వనుకుంటున్నావ్! కాని అత న్నెవరూ మోసం చెయ్యలేరు. అయితే మొత్తంమీద ఇద్దరికీ మంచి స్నేహం ఏర్పడిందిలా ఉందే!" నవ్వాడదోలా!

"మీరు నన్ను తండ్రిలా ఆదుకుంటే ఓ అన్నయ్యలా ఆయన ఆదరించారు. అంతే."

నవ్వి ఊరుకున్నాడు రంగారావు.

పదిగంటలకల్లా సుశీలమ్మకి సాయంగా వంటచేసేసి, పాణి ఇంటికి ప్రయాణమైంది పద్మావతి

"ఉదయంకూడా రమ్మన్నాడా?" అడిగింది సుశీలమ్మ.

"అహ, లేదు కాని ఇవ్వాళ ఓసారి వెళ్దామని..."

"తొందరగా వచ్చెయ్ పన్నెండు లోపున..."

"అలానే. తలుపేసుకోండి."

సందుమలుపులో రంగారావు బంట్రోతు సింహాచలం ఎదురయ్యాడు పద్మావతికి.

"అయ్యగార్ని బస్సుకి దిగబెట్టి."

తనతో మాటమాత్రమన్నా ఊరికి వెళ్తున్నానని చెప్పలేదే అనుకున్న పద్మావతి "ఏఊరెళ్ళారు?" ప్రశ్నించింది కుతూహలంగా,

"పట్నంలో ఆరబ్బాయి మేడ కడు తున్నారు కదండి. దబ్బట్టుకెళ్ళారులా ఉంది."

"నీ కెలా తెలుసు?" కొంటెగా నవ్వుతూ ప్రశ్నించింది.

పెద్దోళ్ళ ఇసయాలు నాకెందుకు కాని, కాపోతే నాలుగొందల జీతంతో

ఆ బాబు మేడెలా కట్టిస్తాడండి?'' అని ముందుకి నడిచి వెళ్ళిపోయాడు సింహాచలం.

'రంగారావుగారి అబ్బాయి పట్నంలో మేడ కట్టిస్తున్నాడు. అనుమానం ధృవపడటానికి మరొక ఆధారం. అయితే నిన్న మేనేజరు డబ్బేదో ఇచ్చిఉంటాడు అనుకుంది. కాని తానేం చెయ్యగలదు? ఎన్నో సంవత్సరాలుగా అతనికి అండగా ఉంటూన్న రంగారావూ, నమ్మిన రామన్నపంతులూ, ఇలాటి మోసగాళ్ళని తానెలా చెప్పగలదు? నిండా తానొచ్చి నాలుగునెలలు కాలేదు. తాను ఓసారి నెలజీతం తీసుకుంటూ, జీతం ముట్టినట్టు నాదగ్గర మీరు రశీదు తీసుకోరుకదా! జీతం ఇవ్వలేదని నేను దబాయిస్తే ఏం చేస్తారు? అంది కొంటెగా. దానికి జవాబుగా అతను నవ్వి, మళ్ళీ ఇస్తాను. ఆమాత్రం మనిషిని నమ్మితేకాని, అది కాదు నమ్మినట్టు నటిస్తేకాని లాభంలేదు పద్మావతీ! అందునా నేను పూర్తిగా నమ్మాలి. నమ్మకంలేకపోతే బాధతప్ప మరేమీ ఉండదు అన్నాడతను.

అయినా నిన్నటినుంచీ మనస్సు స్థిమితంగాలేదు ఏమిటో. రంగారావుగారింట్లో ఉండకూడదనిపిస్తూంది. అతని ఇంట్లో ఉండి అతన్ని పూర్తిగా తెలుసుకోవాలి అనిపిస్తూంది ఒక్కోసారి.

అస్థిమితంగానే చక్రపాణి ఇంటికి వెళ్ళింది పద్మావతి.

"నమస్తే పాణిగారూ," అన్న పద్మావతి గొంతువిని ఉలికిపాటుగా కదిలి, మళ్ళీ సరిగ్గా కూర్చుని నవ్వుతూ, "ఇవాళ ఏమదృష్టం? గుడ్‌మార్నింగ్." అన్నాడు పాణి.

"అదృష్టమా! అదేంకాదు. ఏమో ఓసారి ఇలా రావాలనిపించి వచ్చేశానంతే. ఇలాటివేళ నేను రావడం మీ కేమన్నా ఇబ్బందా?"

"ఇబ్బందా!'' అని నవ్వి "అవకాశముండి మీరు ఇలా రోజూవస్తే చాలా సంతోషిస్తాను. ఊరకరారు మహాత్ములు అన్నారు..."ఆగాడు.

"నిజం! తోచటంలేదింట్లో. ఏదన్నా పత్రిక చదివి మీకు వినిపించాలని..." తడబడింది పద్మావతి. ఎందుకు వచ్చానా అని కూడా అనిపించిందామెకు.

"అన్నట్టు మరిచిపోయాను ఆ డ్రాయరుసొరుగులో పాతపత్రిక ఉంది. ఆవేళ వదిలేశారు—ఆ కథ పూర్తిగా చదివెయ్యండి. ఆ కథ చదవాలనే వచ్చారు. అవునా?" అతని గొంతులో రవంత కొంటెతనం తొణికిసలాడింది.

కిలకిలా నవ్వి, అతని ఎదరకుర్చీలో కూర్చుంటూ, "ఇంక నేను చదవలేనబ్బా ఇంకా ఏమని రాసేడో ఆయన," అందామె.

"నాకు ఆ కథ పూర్తిగా వినాలని ఉంది. ప్లీజ్..."

"కావాలంటే ఈనెల జీతం ఇవ్వడం మానేయండి. కాని..."

"అవ్వాళ అంత చిరాగ్గా ఉన్న నన్ను నవ్వించినందుకు ఓ నెలజీతం ఎక్కువ ఇవ్వాలనుకుంటున్నాను. తర్వాత చదువుదురుగాని పోనీ, ఏవన్నా కబుర్లు చెప్పండి. రంగారావుగారేం చేస్తున్నారు? ఆయనకేం అదృష్టవంతుడు. కొడుకులు సంపాయించి పెడుతున్నారు. డబ్బు సంపాదించాలనే తాపత్రయం లేదు."

"ఆయనకు డబ్బు సంపాదించాలనే తాపత్రయంలేదని మీరెలా చెప్పగలరు? ఈరెళ్ళారు. పట్నంలో వారి అబ్బాయి మేడకట్టిస్తున్నారటగా!"

"ఆయన నాతో ఎప్పుడూ అనలేదే!"

"సందర్భం వచ్చిఉండదు."

ఏమో ఆలోచిస్తూన్నట్టు కొన్ని క్షణాలు మౌనంగా ఉండిపోయాడు పాణి.

"ఇవ్వాళ ప్రకృతి ఎలా ఉంది పద్మావతీ? ఉదయం మీరు తూర్పుదిక్కువైపు చూశారా?" అడిగాడు పాణి.

"ఇవ్వాళ ప్రకృతా! ఉదయించబోయే సూర్యుడికి నిప్పులు చెరగకు అని నమస్కరించింది. ఎలా ఉంటుందో మీ రెప్పుడూ చూడలేదా సూర్యోదయపు పూర్వం పూర్వదిక్కు? కుంకుమపూసినట్లూ తర్వాత పసుపు పులిమినట్లూ ఆ

తర్వాత బంగారురంగుగా ఉంది, మళ్ళీ మామూలు వెలుగు. పూర్వసంధ్యా, సాయంసంధ్యా, ఆకాశపు రంగులూ, ఆ అందం ఎవరు వర్ణించగలరు? భానుడు రాగిరేకులా ఉదయించి బంగారు కాంతిని పుంజుకుంటూ పైకొచ్చి తళతళా వెండిలా మెరిసిపోతూ, శతసహస్ర కిరణాలు ప్రకృతిపై పరచి ఆ కిరణాల ద్వారా ప్రకృతిలోంచీ, ప్రకృతిలోని జీవకోటిలోంచీ నీటినిలాగి దాహం తీర్చు కొని జీవుల్ని తాపంతో ముంచెత్తి తర్వాత అలసి అస్తమిస్తాడు గ్రీష్మ ఋతుభానుడు. అయితే ఇవాళ పేదవాడి ఆశల్లా ఆకాశంలో అక్కడక్కడ మబ్బుతునకలు ఎగురుతున్నాయి. అవన్నీ ఓదగ్గర చేరి వర్షంపడక పోతుందా? అని ప్రకృతితోపాటు ప్రకృతిలోని ప్రాణులూ ఎదురుచూస్తు న్నాయ్."

చప్పట్లుచరచి నవ్వుతూ, "కంగ్రాచ్యు లేషన్సు పద్మావతీ! మీరు కవిత్వం రాయొచ్చు," అన్నాడు పాణి

"చంపారు. రాయమనకండేం? నేను కవిత్వం రాయటం ఒకటా! అది సరే గాని పాణిగారూ!..." అని ఆగిపోయింది పద్మావతి. అతని వ్యక్తిగత విష యాలూ, వ్యాపార విషయాలూ తాను ప్రశ్నించవచ్చా అని. అతనింతవరకూ తన వ్యక్తిగత విషయాలు ప్రశ్నించ లేదు. రంగారావుగారి ద్వారా విని ఊర్కు కొన్నాడు. నిజంగా రంగారావుగాని మరెవరు అతని దగ్గర పనిజేసేవారు గాని అతన్ని మోసగించి డబ్బు కాజే స్తున్నా తానా నిజం చెబితే ఇతను నమ్ము తాడా? పైగా తనను కొండేలుచెప్పే వ్యక్తిగా అసహ్యించుకోవచ్చు. ఎన్నో సంవత్సరాలై అతను నమ్మింది వారిని. తన కేదో దయదాక్షిణ్యాలతో ఈ ఉద్యోగం ఇచ్చాడు కాని, తాను మరొక ఉద్యోగంచూసుకొని వెళ్ళిపోతానంటే కాదనడు.అలాటిది తనకెందుకీ అనవసర జోక్యం.

"పాణిగారూ అని ఆగిపోయారేం పద్మావతీ? ఏమిటో ప్రశ్నించండి" అన్నాడు పాణి నవ్వుతూ.

"అహ. ఏంలేదు. మీరు మీ అత్తయ్య చెప్పినట్టు పెళ్ళిచేసుకుంటేనే బాగుంటుం దని."

"ఓ. అదా!" అని గలగలా నవ్వే శాడు పాణి.

"నిజం. కాస్త చదువుకున్న అమ్మా యిని పెళ్ళిచేసుకుంటే మీ వ్యాపార వ్యవహారాలు చూస్తారుగా!"

"నా వ్యాపారవ్యవహారాలు చక్క దిద్దడంకోసం చదువుకున్న అమ్మాయిని పెళ్ళిచేసుకోమంటారా పద్మావతీ? ఇప్పుడు నే నీ వ్యాపారంలో నష్టపోవడం లేదే!" (సశేషం)

Printed and Published by A Chandrasekhar Rao, at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Hyderabad-500001. Controlling Editor : "CHAKRAPANI"